




ఆంధ్రప్రదేశ్ అవతరణ స్వర్ణోత్సవ నేపథ్యంలో

తెలుగుభాష, సంస్కృతి, సాహిత్య వికాస పరిణామాల సమీక్షగా

## కృష్ణాజిల్లా రచయితల సంఘం

(రిజిష్టర్డ్ నెం. 134/1983)

ఆధ్వర్యంలో

# జాతీయ తెలుగు రచయితల మహాసభలు

2006 అక్టోబర్, 27-28

కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ సభా ప్రాంగణం

యస్.వి.యస్. A/C కళ్యాణ మండపం

విజయవాడ

# ప్రత్యేక సంచిక

SOUVENIR

స్థాపితం : 1929 ఫోన్ : 2568716

# ది దుర్గా కో-ఆపరేటివ్ అర్బన్ బ్యాంక్ లిమిటెడ్

No.H. 953 రాజారంగయ్యప్పారావు వీధి, విజయవాడ - 520 001

ది.12-08-2006 నుండి అమలులోవున్న వడ్డీ రేట్లు

| | | |
|---|---|---|
| 31 రోజులు నుండి | 180 రోజుల వరకు | 6% |
| 181 రోజులు నుండి | 364 రోజుల వరకు | 7% |
| 1 సంవత్సరము నుండి | 2 సం॥ లోపు | 8% |
| 2 సంవత్సరముల నుండి | 3 సం॥ లోపు | 9.5% |
| 3 సంవత్సరములు నుండి | 5 సం॥ లోపు | 10.5% |
| 5 సంవత్సరముల ఆ పైన | | 11% |

- డిపాజిట్లకు ఇన్సూరెన్సు రక్షణ.
- బ్యాంకు మెంబర్లకు డిపాజిట్ల పై చెల్లించు వడ్డీకి టాక్సు (T.D.S) వసూలు చేయబడదు.
- సేఫ్ డిపాజిట్ లాకర్ల సౌకర్యం
- నామినేషన్ సౌకర్యం.
- సీనియర్ సిటిజన్స్ (60 సం॥లు దాటిన వారికి) 3 సం॥లు ఆపైన ఫిక్సిడ్ డిపాజిట్ చేసిన యెడల 0.5% వడ్డీ అదనముగా ఇవ్వబడును.
- దేశవ్యాప్తంగా యు.టి.ఐ., ఐ.డి.బి.ఐ. మరియు ఐ.సి.ఐ.సి.ఐ బ్యాంక్ బ్రాంచిలపై డి.డి.సౌకర్యం.
- ఒక లక్ష రూ॥ఐదు సం॥ల డిపాజిట్ పై ప్రతి నెల రూ.908/- వడ్డీ.
- 6 1/2 సం॥లలో మీ సొమ్ము రెట్టింపు.
- 10 సం॥లో మీ సొమ్ముకు సుమారు మూడు రెట్లు.
- పూర్తి కంప్యూటరీకరణ.

పూర్తి వివరములకు బ్యాంకు నందు సంప్రదించగలరు.

**ది దుర్గా కో - ఆపరేటివ్ అర్బన్ బ్యాంకు లిమిటెడ్**

No.H. 953, ఆర్.ఆర్.అప్పారావు వీధి, విజయవాడ - 520 001

మా పథకములు మీ కోసమే - పొందండి సురక్షితమైన అభివృద్ధి

# జాతీయ తెలుగు రచయితల మహాసభలు



## ప్రత్యేక సంచిక

ప్రధాన సంపాదకులు

**శ్రీ కాలనాధభట్ట వీరభద్రశాస్త్రి**

ఉపసంపాదకులు

**డా॥ వేదాంతం రామకృష్ణమాచార్యులు, విజయవాడ**

**శ్రీమతి నోరి విజయ, విజయవాడ**

**శ్రీ పువ్వాడ తిక్కన సోమయాజి, బెంగుళూరు**




సారధ్యం

## కృష్ణాజిల్లా రచయితల సంఘం

(రిజిష్టర్డ్ నెం. 134/1983)

సత్నం టవర్స్, బకింగ్‌హాం పోస్ట్ ఆఫీసుకు ఎదురుగా, గవర్నర్‌పేట,

విజయవా- 520 002.

## జాతీయ తెలుగు రచయితల మహాసభలకు ఆహూతులైన సదస్సులకిదే మా స్వాగత సుమాంజలులు

శ్రీ కాలనాథభట్ట వీరభద్రశాస్త్రి

స్వాగతం సుస్వాగతం
స్వాగతం సుస్వాగతం

స్వాగతమండీ రచయితలారా
స్వాగతమండీ రచయిత్రులారా
స్వాగతమండీ కళాప్రియులకు
స్వాగతమండీ మహామహులకు

నవనవోన్నత భావవిపంచి
సరసభాషణా చమత్కృతి చూప
సాహితిప్రక్రియ లన్నిటిపైన
వ్యాసలిఖితులే పఠితులుగాగ
స్వాగతం సుస్వాగతం

తెనుగుభాష నుడికారపుటందం
తెనుగు మాటలో మాధురిగరిమ
తేట తెల్లమౌ విబుధుల సూక్తులు
మహాసభల మిమ్మలరింపంగ
స్వాగతం సుస్వాగతం

సుమధురభావాల్ పొంగిపొరలగ
మనోజ్ఞ హాస్యం చిందులాడగ
నవ్యత్వం....
సహజత్వం...
తెనుగుపలుకులో
తొణికిసలాడగ
స్వాగతం సుస్వాగతం



## ప్రథమ ప్రపంచ తెలుగు మహాసభలలో సన్మానము నందిన శ్రీ పైడిపాటి సుబ్బరామ శాస్త్రి గారి

# ఆంధ్రజాతీయ గీతము

త్రిలింగదేశం మనదేనోయ్, తెలుంగులంటే మనమేనోయ్
మధురం మధురం మధురం మధురం,
ఆంధ్రమ్మంటే అతిమధురం ;
దేశభాషలా తీరుల్లోకీ, ఆంధ్రమ్మంటే, అతిమధురం........

రాయలు మనవాడోయ్- పండిత రాయలు, మనవాడోయ్
కలంతిక్కనా, ఖడ్గతిక్కనా, గణపతిదేవులు మనవారోయ్ ॥

అమరావతి నాగార్జునకొండా, సిద్ధహస్తులా శిల్పాలోయ్
మల్లినాథ కుమ రిలభట్టులు, అందెవేసినా హస్తాలోయ్ ॥

గోదావరి కృష్ణా, తుంగభద్ర పెన్నా
కని పెంచినవోయ్ తెలుంగుజాతిని
వినిపించినవోయ్ వీణానాదం ॥

ఓడలు కట్టామూ - మింటికి, మేడలు కట్టామూ
మున్నీరంతా ఏకరాశిగా ముద్దర వేశామూ ॥

సంతలలో వజ్రాల రాసులూ, జలజల లాడినవి
కుబేరతుల్యం, మహదైశ్వర్యం గొడుగు పట్టినాదీ ॥

కలకలలాడే తెలుంగు దేవికి, (గంధాగరుధూపం),
కిలకిలలాడే తెలుంగుకన్నెల కిన్నె రలాలాపం,
బలం గడించీ, వెలుంగు నించే, తెలుంగుజండా "హుం"
తెలుంగు భేరీ "ధాం"

గణగణ గణగణ, గణగణ గణగణ
తెలుంగు జయఘంటా !
గణగణా గణాగణ, గణాగణాగణ
తెలుంగుజయంఘంటా.....త్రి ॥





ఆధారం : కు...



ఈ ప్రత్యేక సంచిక ప్రచురణకు సహకరించిన

**డా॥ జటావల్లభుల కృష్ణమోహన్, శ్రీమతి పూర్ణ** దంపతులకు

**(California, U.S.A.)**

ప్రత్యేక అభివాదాలు

Ei a



కవిసామ్రాట్, పద్మభూషణ, కళాప్రపూర్ణ,

భారతీయ జ్ఞానపీఠ బహుమతి గ్రహీత

**డా॥ విశ్వనాథ సత్యనారాయణ గారు**

# కృష్ణాజిల్లా రచయితల సంఘం

## కార్యవర్గం

గౌరవ సలహామండలి

**పద్మశ్రీ డా॥సి.నారాయణ రెడ్డి**

**కవి సమ్రాట్ పైడిపాటి సుబ్బరామ శాస్త్రి**

**శ్రీ విహారి**

**డా॥ ద్వానా శాస్త్రి**

**ప్రొ॥ డా॥ యార్లగడ్డ బాలగంగాధరరావు**

**డా॥ బోయిన వెంకటేశ్వరరావు**

**శ్రీ పెద్దిభొట్ల సుబ్బరామయ్య**

**డా॥ మాదిరాజు రామలింగేశ్వరరావు**

**డా॥ రావి రంగారావు**

**శ్రీ కాలనాథభట్ట వీరభద్రశాస్త్రి**

గౌరవాధ్యక్షులు :

**శ్రీ మండలి బుద్ధప్రసాద్**, శాసనసభ్యులు

అధ్యక్షులు :

**శ్రీ గుత్తికొండ సుబ్బారావు**, మచిలీపట్నం

ప్రధాన కార్యదర్శి :

**డా॥ జి.వి.పూర్ణచంద్**, విజయవాడ.

ఉపాధ్యక్షులు

**శ్రీమతి అక్కల సరస్వతీ బాబురావు, మచిలీపట్నం**

**శ్రీ లంక వెంకట రమణ**, విజయవాడ.

కార్యదర్శులు

**శ్రీ డి. చంద్రశేఖర్**, విజయవాడ.

**శ్రీ వి.శిరీష్ కుమార్**, విజయవాడ.

**శ్రీ విడియాల చక్రవర్తి**, మచిలీపట్నం

సహాయకార్యదర్శులు

**శ్రీ గుడిసేవ విష్ణుప్రసాద్**, అవనిగడ్డ

**శ్రీమతి డి.సుజాతా దేవి**, విజయవాడ

కోశాధికారి

**శ్రీ తాతా రమేశ్‌బాబు**, గుడివాడ

కార్యవర్గ సభ్యులు

**శ్రీ బూదరాజు శ్యామసుందర్**, విజయవాడ.

**శ్రీ డొకల నారాయణరావు**, విజయవాడ.

**డా॥ పాలపర్తి శ్యామలానందప్రసాద్**, విజయవాడ.

**శ్రీ యస్.అశోక్ కుమార్**, విజయవాడ

**శ్రీ దొండపాటి దేవదాసు**, మచిలీపట్నం

**శ్రీ దాసి బసవయ్య కవి**, అవనిగడ్డ

**శ్రీమతి సింహాద్రి పద్మ**, అవనిగడ్డ

**శ్రీ ముత్యాల ప్రసాద్**, విజయవాడ

**కుమారి నందిని నల్లఘట్ల**, గొల్లపూడి

**శ్రీ అక్కల బాబురావు**, మచిలీపట్నం

**శ్రీమతి కోకా విమలకుమారి**, విజయవాడ

**శ్రీమతి భమిడిపాటి బాలాత్రిపుర సుందరి**, విజయవాడ

**శ్రీమతి వి. శ్రీఉమామహేశ్వరి**, ప్రసాదంపాడు

**శ్రీమతి యం.యన్.రాజకుమారి**, మచిలీపట్నం

**శ్రీ యస్.యమ్.బాషా**, విజయవాడ

**శ్రీ జి.మాల్యాద్రి, చినతాడినాడ**

**శ్రీ పి. సూర్యనారాయణ (సర్వజిత్)**, విజయవాడ

**శ్రీమతి మందరపు హైమవతి**, విజయవాడ

**శ్రీ నండూరి రాజగోపాల్**, విజయవాడ

**శ్రీ సత్రీ**, విజయవాడ

**శ్రీ వి.యల్. నరసారెడ్డి**, విజయవాడ

**శ్రీ కోసూరు పున్నయ్య**, కోడూరు

**శ్రీ బులుసు వెంకట కామేశ్వరరావు**, మచిలీపట్నం

**శ్రీ చింతపల్లి వెంకటనారాయణ**, కైకలూరు

**శ్రీ కె.భోజ రంగరాజు**, కైకలూరు

**శ్రీ యస్.కె.డి.ప్రసాదరావు**, నూజివీడు

**శ్రీ కొడాలి సోమసుందరరావు**, గుడివాడ

**శ్రీ జి.విజయకుమార్**, నందిగామ

**శ్రీమతి వేలూరి సుధారాణి**, విజయవాడ

**శ్రీ జి.కృష్ణమూర్తి**, జగ్గయ్యపేట

**శ్రీ వసుధ**, గుడివాడ

**శ్రీ సోమంచి రామం**, మచిలీపట్నం

లీగల్ ఎడ్వయిజర్స్

**శ్రీ పి.మోహన రాంప్రసాద్**, విజయవాడ

**శ్రీ నరహరిశెట్టి నరసింహారావు**, విజయవాడ

**శ్రీమతి కాట్రగడ్డ రజని**, గుడివాడ

**తెలుగు People.com**

**TeluguPeople.com.**

ఆంధ్రప్రదేశ్ భాషాప్రయుక్త రాష్ట్రంలో జనాభా 8 కోట్లయితే, రాష్ట్రం వెలుపల మరో 8 కోట్లమందివున్నారు.

తెలుగు జనాభా ఒక రాష్ట్రం పరిధిలో ఇమిడేదికాదు. అన్ని రాష్ట్రాలకు, అన్ని దేశాలకు విస్తరించిన తెలుగు వెలుగులను కలిపి వుంచే శక్తి రెండింటికే వుంది. ఒకటి తెలుగు భాష, రెండోది తెలుగుపీపుల్ డాట్ కాం.

తెలుగుపీపుల్ డాట్ కాం సరిహద్దులులేని తెలుగు ప్రదేశ్... తెలుగుజాతికి నిజమైన ప్రతినిధి



4,50,000 మంది రిజిస్టర్డ్ సభ్యులు. రోజుకు లక్షకు పైగా పేజ్ వ్యూస్‌తో తెలుగువారిని కలిపే ఏకైక సమాచార వేదిక. వార్తలు విశేషాలు, వ్యాసాలు, ఇంటర్వ్యూలు, వీడియో క్లిప్పింగ్స్, ఫోటోగ్యాలరీలు, కథలు, కవితలు, సీరియల్స్, భక్తి, హాస్యం, పంచాంగం... ఒకటేమిటి తెలుగుపీపుల్ డాట్ కాం సమాచార సాగరం.....

పాఠకులు నేరుగా తమ మనోభావాలను సాటి తెలుగువారితో పంచుకోవచ్చు. ఒకసారి పోస్టు చేసిన ఏ రచన అయినా ఎల్లకాలం అందుబాటులో వుంటుంది. వాటిపై ఎవరైనా తమ అభిప్రాయాలను వ్యక్తం చేయవచ్చు.

వాటిపై చర్చోపచర్చలు, సద్విమర్శలతో రచయితను ప్రోత్సాహపరచి రచనావ్యాసంగాన్ని పరిపుష్టంచేసే విమర్శకులు వేలాదిగా వున్నారు.

ఇప్పటివరకు పాఠకులు పోస్ట్ చేసిన కవితలు మూడు వేలకు పైగా వున్నాయి. వేయికి పైగా కథలు, వ్యాసాలు అందుబాటులో వున్నాయి. పాఠకులు తమంతట తాముగా తెలుగులోకి కంపోజు చేయడానికి సులువైన వ్యవస్థను తెలుగుపీపుల్ డాట్ కాం అందుబాటులోకి తెచ్చింది.

సినిమా, ప్రపంచం, నలుమూలలలోని తెలుగు వధూవరులను కలిపే శుభలేఖ. కొనడానికి గాని అమ్మడానికిగాని వుచిత ప్రకటన ఇచ్చే వీలున్న క్లాసిఫైడ్, నమ్మకానికి, నాణ్యతకు, సమయపాలనకు పెట్టింది పేరైన షాపింగు, రకరకాల సంస్థల చిరునామాలు, ఫోన్ నెంబర్లు తెలుసుకొనే వెసులుబాటుగా ఎల్లోపేజెస్, చాటింగ్, డిస్కషన్, సలహాలు, సంఘాలు, జాతకాలు, పుస్తకాలు, వ్యాపారం, అనుభూతులు, ఐటి జాబ్సు, చిత్రలేఖనం, ముగ్గులు వంటలు తదితరాలతో తెలుగు ప్రజల మధ్య నిరంతరం వారధిగా నిలబడే వేదిక తెలుగుపీపుల్ డాట్ కాం.

ఈజీ మీడియా, పార్ లైన్ హౌస్ ఆఫ్ స్పైసెస్, మాస్ మెయిలింగ్ వంటి
ఉత్పాదనలు ఈ వైబ్సైట్‌లో వున్నాయి
ఎఫెక్స్ జాబ్స్, వెబ్ డిజైనింగ్, వెబ్ హోస్టింగ్,
24-7 హెల్ప్ డెస్క్ లాంటి సేవలు కూడా లభ్యమౌతాయి.

ఒకసారి తెలుగుపీపుల్ డాట్ కాం వెబ్సైట్ తెరిచి చూడండి. మీకే అంతా విశదమౌతుంది.

iva



దర్శించండి.   సేవించండి..   తరించండి...

# శ్రీ దుర్గామల్లేశ్వర స్వామి వార్ల దేవస్థానం

ఇంద్రకీలాద్రి, విజయవాడ.   ఫోన్ : 2425744, 2423600, 2423800



దుర్గమ్మను దర్శించండి!   దీవెనలు పొందండి!!

## శ్రీ చక్రనవావరణార్చన

శ్రీ చక్రరాజనిలయా శ్రీమత్త్రిపురసుందరీ, శ్రీ శివా శివశక్త్యైక్య స్వరూపిణీ లలితాంబికా॥ అని లలితా సహస్రనామ స్తోత్రంలో చెప్పినట్లుగా, సృష్టి స్థితి లయకారిణైన ఆదిశక్తి మన దుర్గమ్మ, పవిత్రమైన ఈ ఇంద్రకీలాద్రి మీద లలితా స్వరూపిణిగా ఆ తల్లి నిత్యం పూజలందుకుంటూ ఉంది. అత్యంత మహిమోపేతమైన శ్రీ చక్రంలో నిత్యం ఆ తల్లి కొలువుదీరి వుంటుంది. అందుకే శ్రీ చక్రాన్ని అర్చిస్తే ఆ తల్లిని అర్చించినట్లే అని పెద్దలంటారు. శ్రీ దుర్గామల్లేశ్వర స్వామివార్ల దేవస్థానంలో ప్రత్యేకంగా భక్తుల సౌకర్యార్థం శ్రీ చక్రనవావరణార్చన ఐశ్వర్యప్రదమూ, ఆరోగ్యప్రదమూ అయిన చక్రనవావరణార్చనలో భక్తులు ఎవరైన పాల్గొనవచ్చును. అలాగే రూ. 6,000/- లు ఒకేసారి చెల్లించినట్లయితే భక్తుల గోత్రనామాలతో ప్రతిసంవత్సరం వారు కోరిన రోజున శాశ్వతంగా ఈ నవావరణార్చన జరిపించబడుతుంది. కావున భక్తులందరూ ఈ అర్చనా కార్యక్రమంలో పాల్గొని తరించవలసిందిగా కోరుతున్నాం. పూజా రుసుము రూ. 516/- (దంపతులకు) గమనిక : పూజాద్రవ్యములన్నీ దేవస్థానం వారే ఏర్పాటుచేస్తారు. పూజానంతరం దంపతులకి అమ్మవారి అంతరాలయం, ఉపాలయాల్లో ఉచితదర్శన సౌకర్యం కల్పించుటమైనది.

## శాశ్వత అన్నదాన పధకం

- శాశ్వత అన్నదానం 8 మందికి (సంవత్సరంలో ఒక రోజు) రూ. 1,116/-
- శాశ్వత అన్నదానం 35 మందికి (సంవత్సరంలో ఒక రోజు) రూ. 5,116/-

అన్నదాన పథకం కార్యక్రమములో పాల్గొనదలిచిన భక్తులు కార్యనిర్వాహణాధికారి శ్రీ దుర్గామల్లేశ్వర దేవస్థానము ఇంద్రకీలాద్రి విజయవాడ వారి పేరున డి.డి. కాని యమ్.ఒ. ద్వారా గాని పంపవలెను.



చదవండి.   చదివించండి..   తరించండి...

## శ్రీ కనకదుర్గ ప్రభ (ఆధ్యాత్మిక మాస పత్రిక)

దేవస్థానం వారి ప్రచురణ.. ఫోన్ : 0866-2423700

సంచిక వెల రూ. 10/-   వార్షిక చందా రూ. 100/-   శాశ్వత చందా రూ. 2500/- లు

# సంపాదకీయము

**జాతీయ తెలుగు రచయితల మహాసభలకు విచ్చేయుచున్న రచయితలకు, కవులకు, సాహితీ మిత్రులకు స్వాగత సుమాంజలులు.**

నలభై సంవత్సరాల సుదీర్ఘ సాహిత్యానుభవంగల కృష్ణాజిల్లా రచయితల సంఘ ఆధ్వర్యమున ఈ మహాసభలు జరుపబడుట ప్రతిష్ఠాత్మకంగా భావిస్తున్నాము. దేశం నలుమూలలనుండే గాక, ఖండాంతరాల నుండి కూడా ఈ సభలలో పాల్గొనడానికి ప్రతినిధులుగా రావడం ముదావహం. ఒకే వేదికపై ఇందరు కలియడానికి, మీదుమిక్కిలి పరస్పర పరిచయం కావడానికి, తమతమ అభిప్రాయాలను వెలిబుచ్చగలగడానికి, ఈ మహాసభలు దోహదపడతాయనడంలో అతిశయోక్తిలేదు.

అంతేగాక పరభాష, సంస్కృతి వ్యామోహంలో తెలుగు భాషను విస్మరిస్తున్న ఈ తరుణంలో ఇంతమంది కలుస్తున్న ఈ మహాసభలలో తెలుగు భాషాభివృద్ధికి తీసుకోవలసిన చర్యల గురించి చర్చిస్తారని, ఆచరణలో పెట్టే మార్గాలను అన్వేషిస్తారని ఆశిస్తున్నాము. నిజానికి నిద్రాణమై ఉన్న తెలుగు సాహిత్య రంగంలో ఈ మహాసభలు ఒక సంచలనమే కావచ్చునని మా విశ్వాసం, ఉద్దేశ్యం కూడాను.

ఈ సభలు ఆంధ్రరాష్ట్ర అవతరణ స్వర్ణోత్సవ సంబరాల సందర్భంగా నిర్వహించబడుతున్నాయి. గత యాభై సంవత్సరాలుగా తెలుగు సాహిత్యరంగంలో నడిచిన ఉద్యమాలు, రూపాలు, భాష తదితర పరిణామాలకు ప్రత్యక్షంగా నిలిచిపోయేవిధంగా ఈ సభలలో చర్చకు వచ్చే ప్రసంగాంశాలన్నింటినీ ఒక సంకలనంగా **"తెలుగు పసిడి"** అనే పుస్తకరూపంలో వెలువరిస్తున్నాం.

విజయవాడ, రాజకీయంగాను వాణిజ్యపరంగాను, చారిత్రకంగాను ఎంతో ఘనచరిత్ర కలిగి ప్రసిద్ధినొందిన మహానగరం. నాలుగు దిక్కుల రవాణా మార్గాలకు కూడలి. చలనచిత్ర పరిశ్రమకు మకుటాయమానం. ఇహ సాహిత్యపరంగా విజయవాడ కవులకు కాణాచి, కృష్ణవేణీ తరంగాల హొయలు, ఇంద్రకీలాద్రిపై కొలువున్న శ్రీ మల్లిఖార్జున సహిత కనక దుర్గాదేవి కరుణాకటాక్షాలు ఈ నగరానికి దైవదత్తాలు. జాతీయ తెలుగు రచయితల మహాసభల సౌరభాలు ఈ నగరాన్ని మరింత గుభాళింపజేస్తాయని ఆశిస్తున్నాను.

ఈ మహాసభల నిర్వహణ ఒక బృహత్తరకార్యదీక్షకు పరీక్ష. అయినను ఆహూతులకు ఏ లోటూ లేకుండా సదుపాయాలను కలిగించుటలో మా శక్తి మేరకు కృషి సల్పాం. ఏవైనా లోటుపాట్లు వుంటే మన్నించ ప్రార్థన.

ఈ మహాసభల నిర్వహణలో తమ సహాయ సహకారాలను అందించిన వదాన్యులకు మా హృదయపూర్వక కృతజ్ఞతాభినందనలు.

ఈ ప్రత్యేక సంచికకు ప్రకటనలు ఇచ్చి తోడ్పడిన ప్రకటనకర్తలకు, వివిధ సాహిత్య ప్రక్రియలపై రచనలు ఇచ్చి సహకరించిన రచయిత(త్రు)లకు, కవులకు హృదయపూర్వక కృతజ్ఞతలు.

ఈ ప్రత్యేక సంచికను సర్వాంగసుందరంగా సకాలంలో తయారు చేసిన శ్రీ విశ్వా టైప్ ఇన్స్టిట్యూట్ వారికి కృతజ్ఞతలు

భవదీయుడు

కాలనాథభట్ట వీరభద్రశాస్త్రి



# జాతీయ తెలుగు రచయితల మహాసభలు 2006

## ఆహ్వాన సంఘం

అధ్యక్షులు : **శ్రీ కుక్కల నాగేశ్వరరావు**, ఛైర్మన్, కృష్ణాజిల్లా పరిషత్

ఉపాధ్యక్షులు : **డా॥ కె.వెంకట రాజు**, విజయవాడ

సభ్యులు :

**శ్రీ వేమూరి బలరాం**, సంపాదకులు, స్వాతి
**శ్రీ పి.బాలగంగాధరరావు**, జనరల్ మేనేజర్, బి.ఎస్.ఎన్.ఎల్.
**శ్రీ లంక వెంకటరమణ**, విజయవాడ
**శ్రీ ఆర్.డి.షా**, సవానీ ట్రాన్స్ పోర్ట్, విజయవాడ
**లయన్ జి. రామబ్రహ్మం**, మచిలీపట్నం
**శ్రీ గుడివాడ రామచంద్రరావు**, మచిలీపట్నం
**శ్రీ కొండూరు ఉమామహేశ్వరుడు**, ఉమాహాలిడే ఇన్, విజయవాడ
**శ్రీ కాజ శ్రీనివాస రాము**, విజయవాడ
**శ్రీ తాడేపల్లి మోహన్‌బాబా**, మచిలీపట్నం
**శ్రీ జె.వి. సోమేశ్వరరావు**, మచిలీపట్నం
**శ్రీ పి.మోహనరావు**, మచిలీపట్నం
**శ్రీ కె.రమణారావు**, మచిలీపట్నం
**శ్రీ బూదరాజు శ్యామసుందర్**, విజయవాడ
**శ్రీ డోకల నారాయణరావు**, విజయవాడ
**శ్రీ దొండపాటి దేవదాసు**, విజయవాడ
**శ్రీ.ఎస్.ఎమ్.బాషా**, విజయవాడ
**శ్రీ పి. మోహనరాం ప్రసాద్**, విజయవాడ
**డా॥ కొడాలి సోమసుందరరావు**, గుడివాడ

## ఆర్థిక సంఘం

అధ్యక్షులు : **శ్రీ ఎం.డి.వివిఎస్.ఆర్. పున్నం రాజు**,
ఛైర్మన్, సన్ ఫ్లవర్ గ్రూప్ విద్యా సంస్థలు, చల్లపల్లి

ఉపాధ్యక్షులు : **శ్రీ మాజేటి పాపారావు**, క్రేన్ బీటల్ నట్ పౌడర్ వర్క్స్

సభ్యులు

**లయన్. జి. విద్యావతి**, విజయవాడ
**శ్రీ వేము కోటేశ్వరరావు**
ఛైర్మన్, ఎల్.ఐ.సి. ఎంప్లాయీస్ కో-ఆపరేటివ్ బ్యాంక్ లిమిటెడ్, మచిలీపట్నం
**శ్రీ బి.ఎన్ మూర్తి**, ఛైర్మన్, చైతన్య గోదావరి గ్రామీణ బ్యాంక్, గుంటూరు
**శ్రీ ఎస్. రామారావు**, వి.జి.ఎస్. పబ్లిషర్స్, విజయవాడ
**శ్రీ ఎ.ఆంజనేయరావు**, రవి పబ్లిషర్స్, విజయవాడ
**శ్రీ కె. శ్రీనివాసరావు**, సెక్రటరీ, దుర్గా కో-ఆపరేటివ్ బ్యాంక్, విజయవాడ
**శ్రీ పులవర్తి కొర్నెలియస్**, గుడివాడ
**శ్రీ కె. శివరామకుమార్**, ఆడిటర్, మచిలీపట్టణం

## ఆతిథ్యసంఘం

అధ్యక్షులు: **శ్రీ ఐ.రామకుమార్**
ఛైర్మన్, ఇమ్మడిశెట్టి అక్కేశ్వరరావ్ ఛారిటబుల్ ట్రస్ట్, విజయవాడ

ఉపాధ్యక్షులు : **శ్రీ వల్లూరు వెంకటబసవయ్య**, విజయవాడ

సభ్యులు

**శ్రీ గోకరాజు గంగరాజు**, ఛైర్మన్, లైలా గ్రూప్ ఆఫ్ ఇండస్ట్రీస్, విజయవాడ
**లయన్ చిగురుపాటి వరప్రసాద్**, శ్రీ కృష్ణవేణి టాలెంట్ స్కూల్, పోరంకి
**ప్రొఫెసర్ యార్లగడ్డ బాలగంగాధరరావు**, విజయవాడ
**శ్రీ రాయల సత్యనారాయణ**, గుడివాడ
**లయన్ ఆర్.నరసింహారావు**, నూజివీడు
**లయన్ దేవినేని కిషోర్‌కుమార్**, కొండపల్లి
**డా॥ ఎన్. ప్రతిభ**, మచిలీపట్నం
**శ్రీ జి.రాజేంద్రప్రసాద్**, విజయవాడ
**శ్రీ వేమూరి బసవకుటుంబరావు**,
ఛైర్మన్, గాంధి కో-ఆపరేటివ్ అర్బన్ బ్యాంక్ లిమిటెడ్, విజయవాడ
**శ్రీ గొట్టిపాటి శ్రీనివాసరావు**, కమీషనర్, గుడివాడ పురపాలక సంఘం
**శ్రీ సుగలావు వెంకటేశ్వరరావు**, మాజీ పురపాలక సంఘ అధ్యక్షులు, గుడివాడ
**శ్రీ నండూరి రాజగోపాల్**, విజయవాడ
**శ్రీ ఎస్.అశోక్ కుమార్**, విజయవాడ
**శ్రీ వి.ఎల్.నరసారెడ్డి**, విజయవాడ
**శ్రీ తుమ్మల భోగేశ్వరరావు**, వెంట్రప్రగడ

## సన్మాహక సంఘం

అధ్యక్షులు : **శ్రీ కాలనాథభట్ట వీరభద్రశాస్త్రి**, విజయవాడ

ఉపాధ్యక్షులు : **శ్రీ సోమంచి రామం**, మచిలీపట్నం

సభ్యులు

**శ్రీ చింతపల్లి వెంకట నారాయణ**, కైకలూరు
**శ్రీ శ్రీనివాస్**, విజయవాడ
**కుమారి నందిని నల్లఘట్ల**, గొల్లపూడి
**శ్రీ కె.బోజరంగరాజు**, కైకలూరు
**శ్రీ ఎస్.కె.డి. ప్రసాదరావు**, నూజివీడు
**శ్రీ అక్కల బాబురావు**, మచిలీపట్నం
**శ్రీ మాల్యాద్రి**, చినతాడినాడ
**శ్రీ బులుసు వెంకటకామేశ్వరరావు**, మచిలీపట్నం
**శ్రీ జి.విజయకుమార్**, నందిగామ
**శ్రీ చోడవరపు విజయకుమార్**, గుడివాడ

## ప్రెస్ & పబ్లిసిటి సంఘం

అధ్యక్షులు : **శ్రీ నరహరశెట్టి నరసింహారావు**, విజయవాడ

సభ్యులు

**శ్రీ ముత్యాల ప్రసాద్**, విజయవాడ
**శ్రీ "వసుధ"**, గుడివాడ
**శ్రీ బూదరాజు శ్యాంసుందర్**, విజయవాడ
**శ్రీ సర్వజిత్**, గుడివాడ
**శ్రీ బసవరాజు మారుతినాగేశ్వరరావు**, నూజివీడు
**శ్రీ దామోదర గణపతిరావు**, నిడమానూరు

## రిజిస్ట్రేషన్ సంఘం

అధ్యక్షులు : **శ్రీ మెరుగు రాధాకృష్ణమూర్తి**, విజయవాడ

ఉపాధ్యక్షులు : **శ్రీ జి.నాగేంద్రరావు**, విజయవాడ

సభ్యులు

**శ్రీ వేలూరి కౌండిన్య**, విజయవాడ
**శ్రీనివాస్**
**శ్రీ జె. సాయి ప్రసాద్**
**శ్రీ జి.కృష్ణమూర్తి**
**శ్రీ బి. ఆంజనేయరాజు**, విజయవాడ

## మహిళా ప్రతినిధుల పర్యవేక్షక సంఘం

అధ్యక్షులు : **శ్రీమతి అక్కల సరస్వతి బాబురావు**

ఉపాధ్యక్షులు : **శ్రీమతి డి.సుజాతాదేవి.**

సభ్యులు

**శ్రీమతి వేలూరి సుధారాణి**
**శ్రీమతి సాయిరాం**
**శ్రీమతి యం.ఎన్.రాజకుమారి**
**శ్రీమతి మందరపు హైమవతి**
**శ్రీమతి వి. శ్రీ ఉమామహేశ్వరి**
**శ్రీమతి కోకా విమల కుమారి**
**శ్రీమతి సింహాద్రి పద్మ**

# Rasamayi
*Andhra Cultural Forum*
*Dubai*



రసమయి
ఆంధ్ర సాంస్కృతిక సదస్సు

జాతీయ తెలుగు రచయితల మహాసభలు దిగ్విజయంగా జరగాలని ఆకాంక్షిస్తూ

## రసమయి

యునైటెడ్ అరబ్ ఎమిరేట్స్ లోవున్న తెలుగువారి చేత 1986 లో స్థాపించబడి,
తెలుగు భాష, అభివృధికి సంస్కృతి పరిరక్షణకు
తెలుగు వారి వునికిని గుర్తింపచేయడానికి పాటుపడుతున్న సంస్థ. రసమయి
దుబాయ్ ఇండియన్ అసోసియేషన్ కి సాంఘిక సాంస్కృతిక సంఘాలలో ఒకటిగా
అనేక కార్యక్రమాలు చేపట్టుతున్న యు.ఎ.యి లోని ఇండియన్ కాన్సలేట్ పరిధిలోని
ఇండియన్ వెల్ ఫేర్ కమిటీ సభ్యతగల సంస్థ.
సుమారు 200,000 తెలుగు వారు యు.ఎ.యి లో వివిధ రంగాలలో
డాక్టర్లుగా, ఇంజనీర్లుగా, ఐటీ సాంకేతిక నిపుణులుగా, ఉపాధ్యాయులుగా
వ్యాపారవేత్తలుగా నిర్మాణవిభాగపు కార్మికులుగా పనిచేస్తున్నారు.
ప్రతిసంవత్సరం రసమయి సంస్థ సంక్రాంతి, ఉగాది, విజయదశమి,
రంజాన్ మరియు దీపావళి వంటి పండుగలతో బాటు
అనేక సాంస్కృతిక కార్యక్రమాలను జరుపుతున్నారు.
ఆంధ్రప్రదేశ్ నుంచి సినీకళాకారులను, లబ్ధ ప్రతిష్ఠులైన కవులను, రచయితలను,
ప్రముఖ వ్యక్తులను ఆహ్వానించి రసమయి వేదికపై సత్కరిస్తున్నారు
డాక్టర్ వై.ఎస్ రాజశేఖర్ రెడ్డిగారు, మాజీ ముఖ్యమంత్రి శ్రీ చంద్రబాబు నాయుడుగారు,
పద్మశ్రీ బాలమురళీ కృష్ణగారు, పద్మవిభూషణ్ అక్కినేని నాగేశ్వరరావుగారు, పద్మభూషన్ మెగాస్టార్ చిరంజీవి గారు,
డాక్టర్ విశ్వనాథ్ గారు, డాక్టర్ మోహన్‌బాబుగారు, పద్మశ్రీ డాక్టర్ ఎస్.పి.బాల సుబ్రహ్మణ్యంగారు,
ఇత్యాది ప్రముఖులను ఘనంగా సత్కరించే భాగ్యం రసమయికి కలిగింది.
సాంస్కృతిక కార్యక్రమాలే గాక, స్థానిక తెలుగు వారి పిల్లలకు
విద్యారంగంలో పోటీ పరీక్షలు నిర్వహించి వారి ప్రతిభకు తగ్గ
పట్టం కట్టి, రానున్న కాలంలో వారు ఎట్టి పోటీ అయినా ఎదుర్కొగల
వారుగా తయారు చేస్తోంది.

## 2006 - 2007 COMMITTEE MEMBERS

**Dr. Jujhavarapu Venkateswara Rao**
President

**Mr. Dharmakartha Chunduru**
General Secretary

**Mr. G. Sudhakar**
Associate Joint Secretary

**Mrs. Kalyani**
Associate Cultural Secretary

**Mr. K. Rama Rao**
Hon'ble Secretary to Al Ain Chapter

**Mrs. Satya**
Executive Member

**Mr. D. Sudhakar**
Executive Member

**Mr. Nukala Murali Krishna**
Webmaster

**Mr. S. Subramanyam Raju**
Vice-President

**Mr. Prakash Rao**
Joint Secretary

**Mr. Adibhatla Sarma**
Cultural Secretary

**Mr. Venkatesh**
Associate Cultural Secretary

**Mr. Ramakrishna**
Welfare Secretary

**Mr. Krishna VNV**
Executive Member

**Mr. Anil Babu**
Executive Member

**Mr. Vishnu Ippili**
Webmaster

**Mr. Vasiuddin**
Vice-President

**Mr. Jaffer Ali**
Associate Joint Secretary

**Mr. Chinta Venkata Krishna**
Treasurer

**Mr. P. Narasimha Rao**
Hon'ble Secretary to Adudhabi Chapter

**Mrs. Uma Padmanabhan**
Associate Welfare Secretary

**Mrs. Sudha Sairam**
Executive member

**Mr. Srinivasa Murthy**
Auditor

Via



# కృష్ణాజిల్లా రచయితల సంఘం
# జాతీయ తెలుగు రచయితల మహాసభలు
## ది.27-10-2006 ఉదయం ప్రారంభసభ

### అధ్యక్షోపన్యాసం

**మండలి బుద్ధప్రసాద్**

గౌరవ అధ్యక్షులు, కృష్ణాజిల్లా రచయితల సంఘం

**జా**తీయ తెలుగు రచయితల మహాసభలకు అధ్యక్షత వహించే మహదవకాశం నాకు కలగడం నా జీవితంలో ఒక అదృష్టంగా భావిస్తున్నాను. కేవలం కృష్ణాజిల్లా రచయితల సంఘంతో గల సన్నిహిత సంబంధం, ఈ సంఘ స్థాపనలో ఒక పాత్రధారుణ్ణి కావడమే నాకీ అధ్యక్షస్థానం లభించడానికి కారణమైంది తప్ప నేనేదో మహారచయితనని నాకీ అవకాశం లభించలేదు. సాహితీ ప్రియుడుగ, భాషా సేవకుడుగ నాకీ గౌరవం కట్టబెట్టినందుకు కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను.

మహారాష్ట్రలోని మహాబలేశ్వరం వద్ద పుట్టి 1400 కి.మీ. ప్రవహించి కృష్ణానది సాగర సంగమం చెందుతున్న పవిత్ర ప్రదేశంలో మనం సమావేశమయ్యాం. కృష్ణానది మహారాష్ట్ర, కర్నాటకల గుండా ప్రవహించినప్పటికీ ఆ నది పేరుతో విలసిలుతున్న జిల్లా మనది. పురావస్తు శాస్త్రజ్ఞుల పరిశోధనల్లో లక్షల సంవత్సరాల క్రమ పరిణామదశలలో కృష్ణాతీర ప్రాంతంలో నాగరికత మహోన్నతంగా వర్థిల్లినట్లు వెల్లడైంది.

ఆధునిక చరిత్రను పరికిస్తూ జాతీయ భావవ్యాప్తికి నడుంకట్టి దేశస్వాతంత్ర్య సాధనకై తెలుగు జాతిని మేల్కొల్పి నడిపించిన జిల్లా కృష్ణాజిల్లా అని చెప్పడంలో ఎటువంటి అతిశయోక్తిలేదు. ఆధునికతకు ఆహ్వానంపలుకుతూ సంస్కృతీ సంప్రదాయాలను పరిరక్షించుకుంటూ ముందుకు సాగుతున్న జిల్లా కృష్ణాజిల్లా! సంగీత, సాహిత్య, ఆధ్యాత్మిక వైభవోద్దీపకలో ఎందరో మహానుభావులకు జన్మనిచ్చింది కృష్ణాజిల్లా. శ్రీ సిద్ధేంద్రయోగి కూచిపూడి నృత్యాన్ని సృష్టించింది ఇక్కడే ! క్షేత్రయ్య పదపరిమళాలు వెదజల్లింది ఇక్కడే ! శ్రీనాథ మహాకవి జన్మించిందిక్కడే. తిరుపతి వెంకటకవుల అవధానోద్యమానికి ఆటపట్టు కృష్ణామండలమే.

కృష్ణాతరంగ పంక్తిలో త్రుళ్లింతలాడిన ఉత్తుంగ తరంగము కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారిదీ విజయవాడే. తెలుగు సాహిత్యరంగంలో వివిధ ప్రక్రియలకు ఆద్యులైన పూజ్యులు ఆంధ్రపత్రిక, భారతి పత్రికల ద్వారా తెలుగు భాషాసాహిత్యాలకు ఎనలేని సేవ చేసిన దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావు, సాంస్కృతిక వికాసానికి శిఖరాయమానులై నిలచిన "బ్రహ్మర్షి" రఘుపతి వేంకట రత్నంనాయుడు, విజ్ఞాన సర్వస్వాల సృష్టికర్త కొమర్రాజు లక్ష్మణరావు, కాంగ్రెసు చరిత్రకారుడు భోగరాజు పట్టాభి సీతారామయ్య, పండిత పరిశోధకుడు వేటూరి ప్రభాకరశాస్త్రి, సాహిత్యం ద్వారా సాంఘిక విప్లవాన్ని తీసుకొచ్చిన గుడిపాటి వెంకటాచలం, పత్రికా సంపాదకులుగ ఆంధ్రజాతికి వైతాళిక గీతాలు పాడిన ముట్నూరి కృష్ణారావు, నార్ల వెంకటేశ్వరరావు, శివవెంకశంభు ప్రసాదులు గ్రంథాలయోద్యమ పితామహుడు అయ్యంకి వెంకట రమణయ్య, ఆయుర్వేదోద్ధారకుడు పండిత దీవి గోపాలాచార్లు, మహాకవులు పింగళి, కాటూరి, వేటూరి, కొండాలి, పువ్వాడ, నాదెళ్ల, ప్రభృతులు నవలాకారులు మల్లాది రామకృష్ణ శాస్త్రి, తెన్నేటి హేమలత, మునిమాణిక్యం నరసింహారావు నడిచిన నేల ఇది.

వారి వారసత్వాన్ని కొనసాగిస్తూ "కృష్ణాజిల్లా రచయితల సంఘం" గత నాలుగు దశాబ్దాలుగా విశేష సాహితీ సేవలందిస్తోంది.

ఇప్పుడు ఆంధ్రప్రదేశ్ అవతరణ స్వర్ణోత్సవ నేపథ్యంలో 'తెలుగుభాష' సంస్కృతి, సాహిత్య వికాస పరిణామాల సమీక్షగా ఈ రెండు రోజుల మహాసభల్ని మనం "కృష్ణాజిల్లా రచయితల సంఘం" ఆధ్వర్యంలో జరుపుకొంటున్నాం. ఏభై ఏళ్ళ తెలుగు సాహిత్యాన్ని, భాషాప్రగతిని, సాహిత్యోద్యమాన్ని, తెలుగు కళారంగాన్ని, ఇంకా వివిధ ప్రాధాన్యతారంగాల్లో తెలుగు భాషాసంస్కృతుల వికాసపరిణామాల్ని మూల్యాంకనం చేస్తున్నాం. ఇందుకు లిఖితరూపంగా "తెలుగుపసిడి" అనే అపురూప గ్రంథాన్ని కూడా ఈ సభలో మనం ఆవిష్కరించుకోబోతున్నాం.

ఆధునిక తెలుగుయుగంలో తెలుగుభాషా సాహిత్యాలు వికసించడానికి కారణమైన గిడుగు రామమూర్తి పంతులు గారి వ్యావహారిక భాషోద్యమాన్ని గురించి ఇక్కడ మనం చెప్పుకొని తీరాలి. ఆయనతో పాటు కందుకూరి, గురజాడలను కూడా స్మరించాలి. ఆ వరుసను కొనసాగించి, తెలుగు పత్రికా రచనను వ్యావహారికంలోకి తేవడానికి పట్టుదలతో కృషిచేసిన తాపీ ధర్మారావు గారినీ తలచుకోవాలి.

కీర్తిశేషులు గిడుగు తమ చివరి సందేశంలో ఇలా అన్నారు. "జీవంతో ఉన్న ప్రతివస్తువూ మారుతూ ఉండడం సహజం. అన్ని జీవద్భాషలున్ను మారుతూ వచ్చినవి. మన తెలుగుభాషసైతము జీవద్భాష గనుక మారుతూ ఉంది. "చేసితివేనిన్" "చేస్తే" కావడం భాషలో కలిగిన పరిణామాన్ని చూపిస్తుంది, గాని నాశనము చూపించదు. నన్నయనాటి తెలుగు భాషే నేటికిన్ని ఏ మార్పూ లేకుండా ఉన్నదనడం అబద్ధం, ఉండాలనుకోవడం అవివేకం. నన్నయ నాటి గోదావరే ఈనాడూ ప్రవహిస్తూంది గాని ఆనాటి జలం ఈనాటిది కాదు"

"భాషలో ఎప్పటికీ రూపములు వాడుకలో నుండి పోయినవో అవి విడిచి, ఏవి వాడుకలోనికి వచ్చినవో అవి ప్రయోగిస్తూ గ్రంథాలు రచించడము సత్సంప్రదాయం"

"ఇంగ్లీషువారు తమ గ్రంథాలలో ఆధునిక ప్రయోగాలే చేస్తారు. చాసర్, షేక్స్పియర్, మిల్టన్ మొదలయిన మహాకవులు రచించిన గ్రంథాలు చదువుకొంటారు గాని, వాటిలో ఉన్న భాష తమనాటి వ్యవహారంలో లేకపోతే వాడరు. అలాగే తెలుగు వారు కూడా తమనాటి వ్యావహారిక భాషలో గ్రంథరచన సాగించవలెను". అన్నారాయన.

రచయితలనుద్దేశించి 1940 జనవరి 15న కీర్తిశేషులు గిడుగు చెప్పిన ఈ మాటల్ని మనం సదా గుర్తుంచుకోవలసిఉంది.

కాలమాన పరిస్థితుల్ని గమనిస్తూ సరైన మార్గాల్లో తెలుగుభాష కోసం సేవచేసిన వారిలో ప్రముఖులైన కీ॥శే॥ కొమర్రాజు లక్ష్మణరావు గారు, క్రీ॥ శ॥ 1906లో హైదారాబాదు నగరంలో విజ్ఞాన చంద్రికా గ్రంథమాలను స్థాపించారు. ఆ సంస్థ మొదటి ప్రచురణకు పీఠిక వ్రాస్తూ..

కొమర్రాజు వారు.......

"తెనుగు బాస యొక నాగరిక భాషయనిపించుకొనుటకు మనము చేయవలసిన ప్రయత్నములలో ఇప్పుడు జరిగియున్న ప్రయత్నమొక సహస్రాంశమయినను కాదని తెలిసికొనిన మనము నిద్రపోవుచున్నది మేల్కాంచినది తెలియగలదు..." అని అన్నారు.

1944లో ఓరుగల్లుల్లో నిజాం రాష్ట్రసాహిత్యపరిషత్తు రెండవ మహాసభలకు అధ్యక్షత వహించిన కీ॥శే॥ సురవరం ప్రతాపరెడ్డి గారు తమ అధ్యక్షోపన్యాసంలో - నాటి తెలుగు సాహిత్యాలు ఎంతటి దయనీయ స్థితిలో ఉన్నదీ వివరించారు. ఆ శతాబ్ది తొలి నలభై ఏళ్ల పరిస్థితినీ ఆయన విశ్లేషించారు. నాడు బెంగాలీ, మరాఠీ, హిందీ, ఉర్దూ భాషలు సర్వతోముఖంగా వికసించడాన్ని మనము అన్ని సాహితీ కళారూపాలలో బాగా వెనుకబడియుండడాన్ని ప్రస్తావించి, ఆయన ఇలా అన్నారు... "నలుదిక్కుల నాలుగుభాషల విజృంభణమును చూచి మరెంత ఆవేదన పడవలెనో ఆంధ్రులందరున్నూ గమనింతురు గాక. మనము వెనుకబడుటలో ముఖ్యకారణము మనకు మాతృభాషాభిమానము లేదని నిరూపించుకొనుచున్నాము. విద్యరానివాడు తోకా, కొమ్ములు లేని పసరమని మన పెద్దలనిరి. మాతృభాష నేర్వనివాణ్ని, తెలివిలేని పసరమని చెప్పవలెను. మనకు ఇంగ్లీషు, హిందీ భాషలపై కల వ్యామోహము మన మాతృభాషలపై లేదు." అని ఆయన అన్నారు. భావకవితలు, జానపద సాహిత్యం, కథాసాహిత్యం, విజ్ఞాన (సైన్స్) గ్రంథాలు, చరిత్ర, జీవితచరిత్రలు, బాలసాహిత్యం, స్త్రీలవాఙ్మయం, కళాసారస్వతం ఈ వివిధ రంగాల్లో మన దుస్థితిని ఆయన కళ్లకు కట్టినట్లు చెప్పారు. నిఘంటువుల విషయంలో మనం ఎంత వెనుకబడి ఉన్నామో వివరించారు. అనువాద సాహిత్యంలో, లిపిసంస్కరణలో మన అశ్రద్ధను ఎత్తిచూపారు. "ఆంధ్రులమగు మనకు మన భాషను కాపాడుకొనుట ప్రధానమైయుండును" అనీ, "శిష్టస్థానమాక్రమించిన మన నాయకులు భాషా విలక్షణతకు భాషాభివృద్ధికి బాధ్యులైయుందురు" అనీ ఆయన స్పష్టం చేశారు.

నాటికీ నేటికీ 62 ఏళ్లు గడిచిపోయాయి. భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చి, భాషాప్రాతిపదికన మనకు ప్రత్యేక రాష్ట్రం ఏర్పడింది. ఒక తెలుగు జాతిగా అందరం కలిసివుండి. భాషా సంస్కృతులను అన్ని విధాలుగా వృద్ధి చేసుకొంటూ ఆత్మగౌరవంతో వికసించాలనే ఆశయంతో మన పెద్దలు చేసిన కృషి, త్యాగాలు అంతా వృథా కావలసిందేనా? ముద్రణ, ప్రసార రంగాల్లో వచ్చిన సాంకేతిక పురోగతి ఫలితంగా కలిగిన విస్తృతి తప్ప, మౌలికంగా అన్నిరంగాల్లోనూ తెలుగుభాష వెనుకబడివుంది. పరిపాలన, విద్య-ఇవి




# ఆహ్వాన సంఘ అధ్యక్షుని ప్రసంగపాఠం

కె. నాగేశ్వరరావు
ఛైర్‌పర్సన్, జిల్లా పరిషత్, కృష్ణా.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రావతరణ స్వర్ణోత్సవ సంబరాలు కొద్ది రోజులలో జరుపుకోబోతున్నాము. మరో పక్క జిల్లాకే గర్వకారణంగా కృష్ణాజిల్లా రచయితల సంఘం ఆధ్వర్యంలో తెలుగు భాష, సంస్కృతి, సాహిత్య వికాస పరిణామాల సమీక్షగా, విజయవాడలో జాతీయ తెలుగు రచయితల మహాసభలను అక్టోబరు 27, 28 తేదీలలో మనం నిర్వహించుకుంటున్నాము.

కవి సామ్రాట్ విశ్వనాధ సత్యనారాయణ సభాప్రాంగణగా పేరు పెట్టబడిన ఈ రెండు రోజుల సభలలో, అనేక సభావేదికలపై ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పడిన నాటినుండి ఒక కొండ గుర్తుగా ఏర్పరచుకుని గత యాభై ఏళ్ళలో తెలుగు సాహిత్యం ఎలా పలురంగాలలో ముందంజ వేసిందీ, వికాస మార్గంలో ఎటువంటి ధోరణులు ప్రస్ఫుటం అయ్యాయి, ఈ యాభయ్యేళ్ళలో తమ అసమాన ప్రతిభా విశేషాల వలన తెలుగుసాహితీ, సాంస్కృతిక రంగాలను ప్రభావితం చేసిన వారి రూపు రేఖల చర్చ, ఇవన్నీ ఒకసారి పరికించుకోవడానికి, విహంగ వీక్షణంగా అటుప్రపంచ సాహిత్యాలతో పోలిస్తే, మన తెలుగు సాహిత్య స్థితి గతులుఎఆవున్నదీ, మన పరిణామ క్రమం ముందు ముందు ఎలా వుండాలీ అన్న దిశా నిర్దేశం చేసుకునేందుకూ ఈ రెండు రోజుల జాతీయ తెలుగురచయితల మహాసభలు నిర్మాణాత్మకమయిన కార్యక్రమాలు నిర్వహిచగలవని ఆశిస్తూ, ఈ మహాసభలకు ఆహ్వాన సంఘం అధ్యక్షునిగా విచ్చేసిన ప్రముఖ భారతీయ భాషా రచయితలకు, తెలుగు సాహితీ లోకంలో ఎన్నో ఏళ్ళుగా కృషిచేస్తున్న వారికీ, నా హృదయ పూర్వక స్వాగతం తెలుపుతున్నాను.

ఆది నుంచీ మన కృష్ణా జిల్లా జాతీయ చైతన్యానికీ, ఉద్యమాల వికాసానికీ పెట్టింది పేరు. ఉత్తర దక్షిణ భారత ప్రాంతాలను అనుసంధించే ప్రధాన రహదారిలో నెలకొని వున్న విజయవాడ రాజకీయ పరాణామాల కేంద్రం, పత్రికా రాజధానిగా ఎంత పేరు పొందిందో అంతకుమించిన పేరు, ప్రత్యేక సాహితీ, సాంస్కృతిక, విద్యా కేంద్రంగా మచిలీపట్నం, ఎంతో గురుత్వాన్ని కల్గి వుండడం మనకు గర్వ కారణం, బ్రహ్మసమాజ ప్రభావం, స్వాతంత్ర్య ఉద్యమ జాగృతిగీతాలు, జాతీయ కళాశాల, శ్రీ భోగరాజు పట్టాభి సీతారామయ్య, శ్రీ పింగళి వెంకయ్య, శ్రీ ముట్నూరు కృష్ణారావు, శ్రీ మల్లాది రామకృష్ణశాస్త్రి, ఘంటసాల, కొన్నాళ్ళు కవిసామ్రాట్ విశ్వనాధ, వారి గురు వర్యులు చెళ్ళపిళ్ళవారు వంటి మహనీయులు నడయాడిన దివ్య భూమి మన మచిలీపట్నం. మహీధర రామమోహనరావు గారు, మండలి వెంకట కృష్ణారావుగారు, కవి సామ్రాట్ పైడిపాటి సుబ్బరామ శాస్త్రి, శ్రీ ముక్కామల నాగభూషణం, కళాప్రపూర్ణ తెన్నేటి హేమలతాదేవి, అవిభక్త కృష్ణాజిల్లాలోనే జనియించిన మహాకవి జాషువా, ఇప్పటి పెద్దిభొట్ల సుబ్బరామయ్య, కవి, ఆంగ్లానువాద ప్రతిభాశాలి వేగుంట మోహన ప్రసాద్, ఈనాడు రామోజీరావు వంటి ఇంకా ఎందరో అలంకరించిన విజయవాడ, కృష్ణా సాహిత్య సాంస్కృతిక రంగ దీప్తులు ఉజ్వలమయినవి.

ఆంగ్ల అనువాదాల ద్వారా మన తెలుగు సాహిత్యాన్ని ఇతర భాషా ప్రాంతీయలకు పరిచయం చేసేందుకు కొన్ని వ్యక్తిగతస్థాయి ప్రయత్నాన్ని తొలిసారిగా నిర్వహిస్తూ ఆంగ్లంలో మొజాయిక్ జర్నల్‌ను ప్రచురిస్తున్నాయి. సచేతనమూ, సార్వకాలికమూ, సార్వజనీనమూ అయిన సాహిత్య సాంస్కృతిక విలువల నిర్మాణంలో ఈ మహాసభల్లో క్రియాశీలకంగా పాల్గొని, మీ విలువయిన సలహాలూ, సూచనలూ అందించగలరని ఆశిస్తున్నాను. నాకీ విలువయిన అవకాశం ఇచ్చిన నిర్మాహకులకు నా ధన్యవాదాలు.

ప్రధాన రంగాలు. ఈ రెండు రంగాల్లోనూ తెలుగు స్థితి, స్థాయి రోజురోజుకూ దిగజారిపోతున్నాయి. అందువల్ల సాహితీరంగం కుదేలై పడిపోతున్నది. ప్రజలకు భ్రమల్ని కల్పిస్తున్న విద్యావ్యాపారరంగానికి పాలనారంగం దాసోహమంటున్నది. ప్రజల్లో భాష పట్ల ప్రేమ ఉంటే చాలదు. భాషను రక్షించుకోవడం పట్ల, సాహిత్యాన్ని పెంపుచేసుకోవడంపట్ల శ్రద్ధ ఉండాలి. ఇది స్వాభిమానానికి, ఒక జాతిగా ముందడుగు వెయ్యడానికి కావలసిన లక్షణం. తరతరాలుగా, చరిత్ర తెలిసినప్పటి నుండి - రచయితలే, కవులే జాతిలో ఈ లక్షణాన్ని పెంచుతూ, ప్రాణవాయువుల్ని నింపుతూవున్నారు. ఇప్పుడీ అవసరం మరింతగా మన ముందుకు వచ్చింది.

మీకందరికీ తెలుసు-తెలుగుకు కూడా సంపన్న ప్రాచీన భాషాప్రతిపత్తి (Classical Status) ఇవ్వాలని గత రెండేళ్లుగా మనం ఆందోళన చేస్తున్నాం. అత్యంత ప్రాచీన భాషగా భావించబడుతున్న సంస్కృతానికి కూడా లేని ప్రతిపత్తిని తమిళానికి తమిళనాడు రాజకీయ నేతలు సాధించుకున్నారు. దానితో కన్నడ సోదరులు, మనమూ ఆందోళన చేశాం. త్వరలోనే ఆ ప్రతిపత్తి మన భాషక్కూడా వస్తుందనే ఆశాభావంతో ఉన్నారు. ఆ సంగతి అలా ఉంచండి. మనకీ దుస్థితి ఎందుకొచ్చిందో మనం ఆలోచించాలి. అసలు భాషాభివృద్ధి పట్ల ఏ మాత్రం శ్రద్ధలేని విధంగా మన జాతి ఎందుకు తయారయింది?

దీనికి రచయితల బాధ్యత ఎంతవరకు? ఇది మనం ఆలోచించాలి. మనిషి ప్రత్యేకత భాషా సాహిత్యాలను కలిగివుండడం. సమాజాలు భాషా జాతులుగా విలసిల్లుతుండడానికి కారణం ఇదే. భాషా సాహిత్యాలకు రక్షకులు, పోషకులు, అభివృద్ధికర్తలు ఒకవైపు ప్రభుత్వం, విద్యారంగమూ అయితే మరొకవైపు రచయితలున్నారు. ప్రభుత్వం, విద్యారంగం తమ బాధ్యతల్ని విస్మరిస్తున్నపుడు వారిని చైతన్యపరచవలసిన బాధ్యత కూడా రచయితలకే ఉంది. ఎందుకంటే ఈ భాషా సమాజానికి మనం ఊపిరి గనుక. మనం తగిన విధంగా స్పందించడం లేదంటే ఊపిరాడడం ఆగిపోతున్నదన్నమాట.

పొరుగున ఉన్న తమిళనాడు, కర్ణాటక, మహారాష్ట్ర, ఒరిస్సాలతో మన పరిస్థితిని పోల్చి చూసుకుంటే దుఃఖం కల్గుతుంది అక్కడి రచయితలు ఎంతో చైతన్యవంతులుగా ఉన్నారు. వాళ్ల సమాజంలోని అన్ని రంగాలను ప్రభావితం చేస్తున్నారు. రాజకీయాల్ని శాసించగలుగుతున్నారు. అందువల్ల ప్రభుత్వాలు భాషా సంస్కృతులకు సాహిత్యానికి సంబంధించిన అంశాలలో బాధ్యతతో చురుగ్గా పనిచేస్తున్నాయి. తమిళ, కన్నడ రచయితలు, కవులు, భాషకోసం ఉద్యమాలు చేస్తున్నారు. మరి, మనం ఎక్కడున్నాం? ఆలోచించండి.

భాషల మధ్య ఆదానప్రదానాలు-ఇచ్చి పుచ్చుకోవడం ఉండాలి. ఇతర భాషల్లో వచ్చే మంచి రచనల్ని మన భాషలోకి అనువాదం చేసుకోవడంతో పాటు మన భాషలో వచ్చిన ఉత్తమ రచనల్ని ఇతర భాషల్లోకి కూడా అనువాదం అయ్యేట్లుచూడాలి. ఈ రంగంలో మనం బాగా వెనుకబడివున్నాం. అలాగే ఈ ఇంటర్నెట్ యుగంలో ఖండాంతరాలకు కూడా చేరగల విధంగా తెలుగును అభివృద్ధిచేస్తున్నామా? మన సాహిత్యం ఈ ఎలక్ట్రానిక్ సాధనాల ఉపయోగంలో విస్తృతమవుతోందా? మన రచయితలు ప్రపంచవ్యాప్తమవుతున్నారా? ఇవి ముఖ్యమైన అంశాలు.

మన రచయితలెందరో పరిశోధకులుగా తమంతటతాముగా కృషిచేసి, భాషాచరిత్రకు సంబంధించిన అంశాలను వెలికి తెచ్చారు. శాసనాలపై పరిశోధన చేశారు. మల్లంపల్లి వారి నుండి తిరుమల రామచంద్రగారి దాకా ఎందరో చేసిన కృషి ఫలితాలు మన కళ్లముందున్నాయి. వారిలో చాలామందికి పెద్ద డిగ్రీలు లేవు. విశ్వవిద్యాలయాల దన్నులేదు. మరి, నేటి పరిశోధకులకు అవన్నీ ఉన్నాయి. కాని, భాషా చరిత్రను, తెలుగువారి చరిత్రను సమగ్రంగా రూపొందించడంలో, నిఘంటువుల నిర్మాణంలో, లిపి ఆధునికీకరణలో, వారేం చేశారో, చేస్తున్నారో ఆత్మపరిశీలన చేసుకోవలసి ఉంది.

మిత్రులారా, ముగించబోయే ముందు-మరి రెండు మాటలు మనవి చేస్తాను. ఇప్పుడు భాషా సాహిత్యాల పరంగా మన భవిష్యత్తు ప్రశ్నార్థకం అవుతున్నది. ఈ పరిస్థితి నుంచి బయటపడడానికి మనం ఏంచెయ్యాలో ఆలోచిద్దాం. గత 50 సంవత్సరాలలో భాషా సాహిత్యాల్లో, కళారంగాల్లో మనం ఎక్కడున్నామనే మూల్యాంకనం చేసుకొనే ఉద్దేశ్యం ఇందుకే. ఇందులోంచి సాత్వికమైన, ప్రగతిశీలమైన ఉద్యమ సంకల్పం పుట్టుకురావాలి. లేకుంటే ఇదంతా వృథాప్రయాసే అవుతుంది.

కనుక-మనసు పెట్టి ఈ రెండు రోజుల్లో మనం పెద్దల, మిత్రుల ప్రసంగాల్ని విందాం, చర్చిద్దాం, ఉద్యమ స్ఫూర్తిని నింపుకుందాం. తెలుగుతల్లిని మనసారా అర్చించడం కోసం, తెలుగుసమాజాన్ని భాషా సాహిత్యాల విశ్వవేదిక మీద గౌరవమర్యాదలతో ప్రతిఫలింపజేయడానికి కృషి చేద్దాం.

జైహింద్

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర అవతరణ స్వర్ణోత్సవాల సందర్భంగా

50 ఏళ్ళ తెలుగుభాష, సంస్కృతి, సాహిత్యం

పరిణామ, వికాసాల సమీక్షగా

**జాతీయ తెలుగు రచయితల మహాసభలు**

నిర్వహణకు ఆర్థికంగా చేయూతనందించిన

**ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సాంస్కృతిక వ్యవహారాలశాఖ**

వారికి



కృతజ్ఞతాభివందనాలతో...

కృష్ణాజిల్లా రచయితల సంఘం




# కృష్ణాజిల్లా రచయితల సంఘం
# జాతీయ తెలుగు రచయితల మహాసభ

**ది.27-10-2006 ఉదయం ప్రారంభసభలో**

## ప్రధానపత్రం

సమర్పణ : డా॥ జి.వి.పూర్ణచంద్

ప్రధానకార్యదర్శి, కృష్ణాజిల్లా రచయితల సంఘం

భాషాప్రయుక్త రాష్ట్రాల విభజనకు ప్రేరణ కారణం కూడా తెలుగువారే కావడం గర్వించదగిన విషయం. కానీ, అమరజీవి పొట్టిశ్రీరాములు ప్రాణాలతోపాటు, ఎంతో తెలుగుదనాన్ని ఇతర రాష్ట్రాలకు ధారపోసుకుని, ఎట్టకేలకు ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాన్ని సాధించుకోగలిగాం..

ఆంధ్రప్రదేశ్ అవతరణ స్వర్ణోత్సవాల నేపథ్యంలో ఈ యాభైఏళ్ళ తెలుగు భాష, సంస్కృతి సాహిత్య వికాస పరిణామాల సమీక్షగా జరుగుతున్న ఈ జాతీయ తెలుగు రచయితల మహాసభలలో తెలుగువారి త్యాగనిరతి సాధించిన ఫలితాలను విశ్లేషించడానికి తరలి వచ్చిన ఆయా ప్రక్రియలలోని నిష్ణాతులైన రచయితలు, సమీక్షకులు, పరిశోధకులు సాహితీ ప్రియులందరికి స్వాగతం పలుకుతున్నాను.

ఈ యాభై ఏళ్ళ తెలుగు సాహిత్యచరిత్రని స్థూలంగా పరిశీలిస్తే, రాష్ట్ర ప్రగతి కన్న, సాహిత్య ప్రగతి చాలా వేగవంతంగా పరుగులిడిందని చెప్పాలి. కాలానుగుణంగా తెలుగుసాహిత్యం తాను మారుతూ, ఎన్నో అభివృద్ధి నిరోధకాలను ఏమారుతూ ఎదుగుదలే ధ్యేయంగా సాగింది. తెలుగుసాహితి జీవనది నిరంతరం తన దశనీ, దిశనీ నిర్దేశించుకుంటూ, గతులు మార్చుకొంటూ, ప్రగతులు కూర్చుకొంటూ, ప్రవహిస్తూనే వుంది. ఇదిసజీవ సాహిత్య లక్ష్యం! లక్షణంకూడా!

ఆంధ్రప్రదేశ్ అవతరణ నాటికే అభ్యుదయ సాహిత్య ఉద్యమం ఉధృతి నడుస్తోంది. ఆనాటికే సాహిత్యంలో వస్తువుగా సామాన్యుడు స్థిరపడ్డాడు. అభ్యుదయభావజాలం అందరిలోనూ నెలకొనివుంది.

దిగంబర విప్లవకవితా ఉద్యమాలు కొందరికే పరిమితమైనా తిరుగుబాటు ధోరణి సాహిత్యానికి సహజ లక్షణం కావడానికి ఈ ఉద్యమాలు ఎంతో సహకరించాయి.

1975 నుంచీ తెలుగు సాహిత్యం కొత్త బాటలు వేసుకొంది. సంచలనాలకు ద్వారాలు తెరిచింది. ఈ క్రమంలోనే స్త్రీవాద దళితవాద ధోరణులు బలంగా వెలువడ్డాయి. సమాజంలో కొత్తకోణాలు ఆవిష్కృత మయ్యాయి. అదే ఒరవడిలో బీసీ వాదం ముస్లిం మైనారిటీ వాదాలు కూడా బలమైన ధోరణులుగా అంకురించాయి. ఇస్లాం వాదం వచ్చిందిగాని మరిన్ని మారాకులు తొడగాల్సిన స్థితిలో ఉంది.

ఇవన్నీ ఇట్లా వుండగా ప్రత్యేక రాష్ట్రనేపథ్యంలో ప్రాంతీయ అస్తిత్వ వాదం వెలువడింది. ప్రముఖంగా తెలంగాణాలో ఈ వాదం ఉధృతంగా బలపడింది. ఉత్తరాంధ్రరాయల సీమల్లో కూడా అడపాదడపా ప్రాంతీయ వాదాలు కనిపిస్తూనేవున్నాయి.

తిలాపాపం తలాపిడికెడుగా ఈ రాష్ట్రాన్ని అన్ని ప్రాంతాలవారూ పాలించినా కేవలం ఒక ప్రాంతప్రజల్ని నేరస్తులుగా చూపించే ధోరణులూ పొటమరిస్తున్నాయి.

ఇవి సాహిత్య ధోరణులా? ఉద్యమాలా? అనే మీమాంస అలా వుండగా పద్యకవిత ప్రాణం పోసుకుని రక్తమాంసాలు అలదుకొని మళ్ళీ పూర్వ సోయగాలను సంతరించుకొనేందుకు ఉవ్విళ్ళూరుతోంది. అవధానులు పెరిగారు. అవధానాలకు శ్రోతలు పెరిగారు. ఇదంతా చూస్తే దుడ్డుకర్రలే విరిగాయిగాని పద్యాలు క్షేమంగానే ఉన్నాయనిపిస్తుంది.

"సాహిత్యం" అనగానే కవిత – కథ అగ్రతాంబూలంగా నిలుస్తాయి. నవలలు ఒక దశలో వెలుగు వెలిగి టీవీ వెలుతురుముందు నేడు కొవ్వొత్తులుగా మిగిలాయి. తెలుగువారికి ప్రతిదీ ఒక వేలం వెర్రిగా ఉంటుంది ! టీవీ మీడియా వచ్చేసరికి రేడియోలు మూసేసారు. టీవీ సీరియల్స్‌ను వెర్రెత్తి చూస్తూ నవలా సాహిత్యాన్ని మరిచిపోయారు. వీటన్నింటి మధ్య "నాటకరంగం" నిస్తేజం అయిపోయింది.

21వ శతాబ్దం కొత్త ఆలోచనలకు శుభారంభం పలికింది. సాహిత్యానికి పాఠకులతో పాటు శ్రోతలు, ప్రేక్షకులు కూడా పెరగడం కొత్తగా మొదలయ్యింది. నంది అవార్డు ఇచ్చి నాటికలను ప్రోత్సహిస్తున్నట్లు ప్రభుత్వం చేతులు దులుపుకున్నా నాటకరంగాన్ని ప్రేక్షకులే ఆదరిస్తున్నారు. ఇది ఆహ్వానించదగిన పరిణామం !

ఇంక కవిత్వం గురించి ప్రత్యేకంగా ప్రస్తావించు అంశాలు ఉన్నాయి. మినీ కవిత ఉద్యమ రూపం సంతరించుకొని కవిత్వంలో "సంక్షిప్తత" ని ఒక భూషణంగా తీసుకొచ్చింది. మొదటిసారిగా మినీ కవిత్వానికి ప్రదర్శనలు కూడా ఏర్పాటయ్యాయి. యువతరం చాలామంది కవిత్వంవైపు దూసుకురావటానికి మినీ కవిత ఉపకరించింది. పర్యవసానంగా విదేశీయమైన హైకూలు, నానీలు ఇంకా ఇతర లఘురూపాలు జనం నోళ్ళలో నానడం మొదలుపెట్టాయి.

"గజల్"ను తెలుగు వారి సొత్తుగా మార్చి నారాయణరెడ్డి కొత్తభావాలను కవితీకరించడానికి ... కవులకు చేతినిండా పనిపెట్టారు. వచన కవిత్వంలో సంక్షిప్త శబ్దచిత్రాలు రావాలని కలలుగన్న కుందుర్తి ఆశలు సాకారమయ్యాయి. అనేక దీర్ఘకవితా కావ్యాలు రూపుదిద్దుకున్నాయి. దండిచెప్పిన అష్టాదశ లక్షణ సమన్వితమైన వచన కవితలు వెలువడ్డాయి.

నేటికవి తన ఉనికిని ప్రశ్నించుకుంటూనే భవిష్యత్తువైపు ఆశగా చూస్తున్నాడు. ఆ చూపులోతుల్లో ప్రపంచీకరణ "దుష్ప్రభావం" స్పష్టంగా కనిపిస్తోంది. రేపటి తెలుగు జాతి మనుగడ పట్ల, తెలుగు భాష అస్థిత్వం పట్ల ఆందోళన, దిగులు, భయం, ఆవేశం ఆగ్రహం ఈ నాటి రచనల్లో ప్రస్ఫుటమౌతున్నాయి. ధ్వంసం కానున్న మానవ సంబంధాల మనుగడకోసం కలమెత్తి నిలుస్తున్నాడు నేటి కవి.

ఈ యాభై కాలంలో కాలక్షేపసాహిత్యం, క్షుద్ర సాహిత్యం వ్యాపార సాహిత్యం చిచ్చుబుడ్డిలా ఎగిరి చచ్చుపడ్డాయి. నేటి సాహిత్యానికి వాటి బెడద తప్పింది. టి.వి. ప్రేక్షకులు తప్ప, పుస్తకాలు కొని చదివే పాఠకులు అర్థరహిత సాహిత్య విన్యాసాన్ని అంగీకరించే స్థితి దాటి పోయింది. ఇది ఆనందించదగిన పరిణామం.

ఇప్పుడు నడుస్తున్నది తెలుగు భాష పరిరక్షణ ఉద్యమం. అందరూ అనుకొనేట్లు తెలుగు భాషకు ప్రత్యేకత సాధించటం కోసం ఈ ఉద్యమం అనేది సరయిన అంచనా కాదు. తెలుగుభాషకు సంపన్న ప్రాచీనతా ప్రతిపత్తి అవసరమే ! అలాగే ప్రభుత్వపరంగా ప్రజాసంబంధమైన అన్ని రంగాలలోను తెలుగు వినియోగం విధిగా అమలు జరిపేలా ప్రతినిత్యం అందరిమీదా ఒత్తిడి తేవడం కూడా ముఖ్యం. అంతకన్నా ముఖ్యమైంది, తెలుగు ప్రజలు తెలుగు భాషని మనసారా వినియోగించేలా ప్రోత్సహించడం. ఇవన్నీ ఒక ఉద్యమంగా చేపట్టవలసిన అవసరాన్ని గుర్తించి అనేక సంస్థలు ముందుకు వచ్చాయి. కృష్ణాజిల్లా రచయితల సంఘం ఈ దిశగా ఇప్పటికే ఊరూరా తెలుగు భాషా సదస్సులు నిర్వహించి తనదైన కృషిచేస్తోంది.

చివరిగా ఒక మాట

తెలుగు భాష సహజంగా మాండలికాలలోనే ఉంది. మాండలిక రచనలకు సాహిత్య గౌరవం దక్కేలాచేసిన రచయితలు గిడుగు వ్యావహారిక భాషా ఉద్యమానికి నిజమైన వారసులనిపించుకున్నారు.

ఆత్మావలోకనం చేసుకుంటే, తెలుగు సాహిత్యం తెలుగు ప్రజలకు మరింత సన్నిహితం అయ్యేందుకు ఈ యాభైఏళ్ళకాలం సద్వినియోగం చేసుకొందనే చెప్పాలి. ఇవన్నీ ఒక్కసారి మననం చేసుకొని ముందుకు సాగేందుకు దిశానిర్దేశం కోసం మూల్యాంకనం చేసుకొని ముందుకు సాగటానికి ఈ సభలు తోడ్పడతాయని ఆకాంక్ష ! ఆశంస !

# మహా సభల దృశ్యాలు



జ్యోతిని వెలిగించి సభలను ప్రారంభిస్తున్న తమిళ రచయిత్రి శ్రీమతి శివశంకరి, డా॥ గూటాల కృష్ణమూర్తి, శ్రీ మండలి బుద్ధప్రసాద్, శ్రీ కుక్కల నాగేశ్వరరావు, శ్రీ గుత్తికొండ సుబ్బారావు.



కృష్ణాజిల్లా రచయితల సంఘం గౌరవాధ్యక్షులు శ్రీ మండలి బుద్ధ ప్రసాద్ అధ్యక్షోపన్యాసం.



ముఖ్యఅతిథి, ప్రముఖ తమిళ రచయిత్రి శ్రీమతి శివశంకరి ప్రసంగం.



మహాసభలను ప్రారంభిస్తున్న డా॥ గూటాల కృష్ణమూర్తి (విదేశాంధ్ర ప్రచురణలు - లండన్)



ఆహ్వాన సంఘాధ్యక్షులు శ్రీ కుక్కల నాగేశ్వరరావు స్వాగత వచనాలు.



తెలుగు భాష-సంస్కృతి-సాహిత్య పరిణామ వికాసాల సమీక్షగా వెయ్యి పుటల - నూట పన్నెండు వ్యాసాల అపురూప సంకలనం "తెలుగు పసిడి" గ్రంథావిష్కరణ.

# మహా సభల దృశ్యాలు



కృష్ణాజిల్లా రచయితల సంఘం అధ్యక్షులు శ్రీ గుత్తికొండ సుబ్బారావు ఉపక్రమ నివేదిక.



కృష్ణాజిల్లా రచయితల సంఘం ప్రధాన కార్యదర్శి డా॥ జి.వి.పూర్ణచంద్ ప్రధానపత్ర సమర్పణ.



నాలుగు దశాబ్దాలుగా కృష్ణాజిల్లా రచయితల సంఘానికి విశేష సేవలందిస్తున్న శ్రీ కాలనాథభట్ట వీరభద్ర శాస్త్రి గారికి సాభిమాన సత్కారం.



కృష్ణాజిల్లా రచయితల సంఘం కోశాధికారి శ్రీ తాతా రమేష్‌బాబు "అత్యాధునిక పదచిత్ర కళాప్రదర్శన"ను ప్రారంభిస్తున్న ఆచార్య కొలకలూరి ఇనాక్.




రెండవ సభ : ఆచార్య బేతవోలు రామబ్రహ్మం, డా॥ వెలగా వెంకటప్పయ్య, శ్రీ రాపాక ఏకాంబరాచార్యులు, ఆచార్య పేర్వారం జగన్నాథం, డా॥ కత్తి పద్మారావు, శ్రీ మండలి బుద్ధప్రసాద్, డా॥ తూమాటి సంజీవరావు.




మూడవ సభ : శ్రీ కొత్తపల్లి రవిబాబు, శ్రీ తెలకపల్లి రవి, ఆచార్య చందు సుబ్బారావు, డా॥ అద్దేపల్లి రామమోహనరావు, ఆచార్య కొలకలూరి ఇనాక్, శ్రీ మాజేటి పాపారావు, శ్రీ చొక్కాపు వెంకటరమణ.

# మహా సభల దృశ్యాలు



నాల్గవ సభ : డా॥ మాదిరాజు రామలింగేశ్వరరావు,
శ్రీ పెనుగొండ లక్ష్మీనారాయణ.




ఐదవ సభ : శ్రీ నగ్నముని, డా॥ కె.రామమోహనరాయ్,
డా॥ ఎస్.గంగప్ప, శ్రీ ఎం.డి.వి.ఎస్.ఆర్. పున్నంరాజు.




ఆరవ సభ : శ్రీ సుధామ, డా॥ ఎన్. అనంతలక్ష్మి,
శ్రీ పెద్దిభొట్ల సుబ్బరామయ్య, డా॥ సామల రమేష్‌బాబు,
శ్రీ విహారి, ఆచార్య వి.సిమ్మన్న, శ్రీ పిరాట్ల వెంకటేశ్వరరావు,
డా॥ కసిరెడ్డి వెంకటరెడ్డి, శ్రీ ఉప్పులూరి మల్లికార్జునశర్మ.




ఏడవ సభ : డా॥ వెలుదండ నిత్యానందరావు,
డా॥ వి.నాగరాజ్యలక్ష్మి, శ్రీ సి.రఘోత్తమరావు, డా॥ ద్వానాశాస్త్రి,
శ్రీ బి.హనుమారెడ్డి, డా॥ పాపినేని శివశంకర్, డా॥ తుర్లపాటి రాజేశ్వరి.



ఎనిమిదవ సభ : శ్రీ జ్వాలాముఖి, డా॥ రావి రంగారావు




ముగింపు సభ : ఆచార్య వంగపల్లి విశ్వనాథం,
డా॥ రాళ్లబండి కవితా ప్రసాద్, శ్రీ మండలి బుద్ధప్రసాద్,
శ్రీ వేటూరి సుందర రామమూర్తి, శ్రీ ఆనంద్ కూచిభొట్ల,
శ్రీ వల్లూరి వెంకట బసవయ్య, శ్రీ ఐలాపురం వెంకయ్య.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రావతరణ స్వర్ణోత్సవాల నేపథ్యంలో కృష్ణాజిల్లా రచయితల సంఘం 27,28 అక్టోబర్, 2006 న విజయవాడలో నిర్వహిస్తున్న జాతీయ తెలుగు రచయితల మహాసభలు దిగ్విజయం కావాలన్న శుభాకాంక్షలందచేస్తూ అభినందనలు తెలుపుతున్నాము.




AGENCY SERVICES | STEVEDORING | C&F AGENTS | LOGISTICS | OFFSHORE SUPPORT | AVIATION SUPPORT



# ESSKAY
## SHIPPING (P) LTD






**Head office:**

**ESSKAY HOUSE, D.No. 25-40-40, GANGULAVARI STREET, VISAKHAPATNAM 530 001**

PH (O) 91 891 2568403 to 06 / 2549487 FAX: + 91 891 2565133, e-mail: info@esskayshipping.com

**KOLKATA**
(O)91-33 247 90756 Mob:098300 49099 Email : kolkata@esskayshipping.com

**HALDIA**
(O)+91 32 24 276727 Mob:098300 69301 Email : haldia@esskayshipping.com

**PARADIP**
(O) +91 67 22 222876 Mob:094375 77859 Email: paradip@esskayshipping.com,

**KAKINADA**
(O) +91 884 2348711 2370064 Mob:0984890 33919 Email: kakinada@esskayshipping.com

**RAJAHMUNDRY**
(O) + 91 883 2438 134 Mob: 098483 04124 Email: rajahmundry@esskayshipping.com & esskayrjy@yahoo.co.uk

**MACHILIPATNAM**
(O) 08672 - 228129, Cell : 98666 11567 E-mail : machilipatnam@esskayshipping.com

**KRISHNAPATNAM**
(O) +91 861 23 77 029 Mob: 099497 15358 Email: krishnapatnam@esskayshipping.com

**HYDERABAD**
(O) 91 40 2337 6441, FAX: 91 40 2337 6442 E-mail : hyderabad@esskayshipping.com

**CHENNAI**
(O) +9 44 25352837 Mob: 098400 52414 Email : chennai@esskayshipping.com

**TUTICORIN**
(O) + 91 461 2375074 Mob : 093633 13216 Email : tuticorin@esskayshipping.com

**COCHIN**
(O) +91 484 2668634 Mob: 093886 16720 Email: cochin@esskayshipping.com

**NEW MANGALORE**
(O) 91 824 2452193 Mob: 094465 12193 Email: mangalore@esskayshipping.com

**MUMBAI**
(O) Mob: 098203 02398 Email: mumbai@esskayshipping.com

**KANDLA**
(O) + 91 2836 229764 Mob: 098252 29722 Email: kandla@esskayshipping.com

**MORMUGAO**
(O): +91 832 2519933 Mob: 094465 12193 Email: goa@esskayshipping.com

**JAM NAGAR**
(O) + 91 2836 229764 Mob: 098252 29722 Email: kandla@esskayshipping.com

# జాతీయ తెలుగు రచయితల మహాసభల నివేదిక

"సుప్రసిద్ధ కవులు, పండితులు, భాషావేత్తలతో కూడిన సభాప్రాంగణం కృష్ణదేవరాయలనాటి భువనవిజయంను తలపించింది. ఆంధ్రుల చారిత్రక వైభవాన్ని కనులారా దర్శించి నట్లైంది. ఎంతో ఆనందించినాం." ఇవి సంతుష్టాంతరంగులైన ఆచార్య పేర్వారం జగన్నాథం గారిమాటలు, దేశం నలుమూలల నుంచి విశేషంగా తరలివచ్చిన కవిపండితులు, సాహితీవేత్తలు వివిధ విశ్వవిద్యాలయాల ఆచార్యులు, పరిశోధకులు, విమర్శకులు ఎంతో ఆనందంతో ప్రతి ఒక్కరూ చెప్పిన అభిప్రాయం ఇదే!

ఆంధ్రప్రదేశ్ ఆవరణ స్వర్ణోత్సవాలను జాతీయ స్థాయిలో జరుపుకోవడానికి కృష్ణాజిల్లా రచయితల సంఘం ఒక వేదిక కావడం ఈ సభల ప్రత్యేకత !

కృష్ణాజిల్లా రచయితలసంఘం 2006 అక్టోబర్ 27,28 తేదీలలో విజయవాడలో నిర్వహించిన జాతీయ తెలుగు రచయితల మహాసభలు దేశంలో తెలుగువారిని ఒక్కసారి తట్టిలేపి పలకరించాయి. తెలుగు భాష ప్రాచీనతని, దాని ఔన్నత్యాన్ని, తెలుగు ప్రజల మీద అది కల్పించిన ప్రభావాన్ని ఈ సభలు సమీక్షించాయి. తెలుగు సాహిత్యంలో ఏర్పడిన అనేక పరిణామాలు, చోటుచేసుకున్న ఉద్యమాలు, చేకూర్చిన సామాజిక ప్రయోజనాల్ని కూడా ఈ సభలు సమీక్షించాయి. ఒక వినూత్న సాహితీ వైభవానికి ఈ సభలు అంకురారోపణ చేశాయి. ఆంధ్రప్రదేశ్ అవతరణ స్వర్ణోత్సవ నేపథ్యంలో గతయాభైఏళ్ళ తెలుగుభాష సంస్కృతి సాహిత్యాల పరిణామ వికాసాలను రచయితలు వివిధ కోణాల్లొంచి పరిశీలన చేశారు.

**ప్రారంభసభ 27-10-2006 శుక్రవారం ఉదయం 10-00 లకు**

**మండలి వెంకట కృష్ణారావు సభవేదిక**

జాతీయ మహాసభలు సకాలంలో ప్రారంభం కావడం, సభ మొదలయిన కొద్దిసేపటిలోనే రమారమీ ఏడువందల మంది సాహితీవేత్తలు ఆ చలువమందిరాన్ని అలంకరించడం విశేషం.

ప్రారంభసభకు కృష్ణాజిల్లా రచయితలసంఘం గౌరవాధ్యక్షులు, అవనిగడ్డ శాసనసభ్యులు శ్రీ మండలి బుద్ధప్రసాద్ అధ్యక్షత వహించారు. తెలుగుభాష పరిరక్షణ కోసం పోరాడటానికి సిద్ధంగా వుండవలసిందిగా ఆయన రచయితలకు పిలుపునిచ్చారు. తెలుగునాట పరిశోధనారంగం వెనకబడి ఉండడటం పట్ల ఆయన ఆందోళన వెలిబుచ్చారు. తెలుగురచనలు ఇతర భాషల్లోకి అనువాదం కాకపోవడాన తెలుగురచయితలకు తగిన గుర్తింపు లభించడం లేదని అన్నారు. అనువాదాలకోసం విశ్వవిద్యాలయాలలో అనువాద పీఠాలను నెలకొల్పాలని ఆయన కోరారు.

ఆహ్వాన సంఘాధ్యక్షులు, కృష్ణాజిల్లా పరిషత్ ఛైర్మన్ శ్రీ కుక్కల నాగేశ్వరరావు స్వాగత వచనాలు పలికారు. సంస్థ అధ్యక్షులు శ్రీ గుత్తికొండ సుబ్బారావు సభల ఉపక్రమ నివేదికను అందించారు. ప్రధాన కార్యదర్శి డా॥ జి.వి. పూర్ణచంద్ యాభైఏళ్ళ తెలుగు సాహిత్యాన్ని విశ్లేషిస్తూ ప్రధానపత్రం సమర్పించారు.

లండన్ నుంచి విచ్చేసిన డా॥ గూటాల కృష్ణమూర్తి ఈ జాతీయ తెలుగు రచయితల మహాసభలను ప్రారంభించారు. తెలుగుభాష పట్ల, తెలుగుదనం పట్ల మక్కువ పెరిగేలా ఒక ఉద్యమాన్ని రచయితలే ప్రారంభించాలని ఆయన పిలుపు నిచ్చారు. ప్రముఖ తమిళరచయిత్రి శ్రీమతి శివశంకరి ముఖ్యఅతిధిగా విచ్చేశారు. తాను తమిళభాషకు చెందిన రచయిత్రినైనప్పటికీ తనను ఆహ్వానించడం ద్వారా తెలుగువారు తమ జాతీయ దృక్పథాన్నిచాటుకున్నారని ఆమె ప్రశంసించారు. "దృష్టి - సృష్టి" అనే అంశంమీద ఆమె ఆంగ్లభాషలో చేసిన ప్రసంగం సభాసదులను ఆకట్టుకుంది.

సభల సందర్భంగా, యాభైఏళ్ల కాలంలో తెలుగు సాహిత్యపరిణామ వికాసాల్ని సమీక్షిస్తూ. కృష్ణాజిల్లా రచయితల సంఘం ప్రచురించిన వెయ్యి పుటలు - 112 వ్యాసాల అపురూప గ్రంథం "తెలుగుపసిడి" ని డా॥ గూటాల కృష్ణమూర్తి ఆవిష్కరించారు. ఈ గ్రంథప్రచురణకు సౌజన్యంతో ముందుకు వచ్చిన శ్రీ ఇమ్మడిశెట్టి రామకుమార్, (ఇమ్మడిశెట్టి అక్కేశ్వరరావు చారిటబుల్ ట్రస్ట్ మేనేజింగ్ ట్రస్టీ) ను సభాముఖంగా అభినందిచారు. సభకు శ్రీ డి. చంద్రశేఖర్ స్వాగతం పలుకగా, శ్రీమతి భమిడిపాటి బాలాత్రిపుర సుందరి వందన సమర్పణచేశారు.

తొలుత సంస్థ కోశాధికారి శ్రీ తాతారమేష్ బాబు "అత్యాధునిక పదచిత్ర కళాప్రదర్శన" ని ఆచార్య కొలకలూరి ఇనాక్ ప్రారంభించారు. సభలో శ్రీ రామతీర్థ నిర్వహణలోని మొజాయిక్ ఆంగ్ల అనువాద సంచికని శ్రీ కుక్కల నాగేశ్వరరావు, శ్రీమతి పూజిత రచించిన నవలను శ్రీమతి శివశంకరి, శ్రీ పెరుగు రామకృష్ణ కవితల సి.డిని శ్రీ బుద్ధప్రసాద్ ఆవిష్కరించారు.

కవిసమ్రాట్ పైడిపాటి సుబ్బరామశాస్త్రి రచన "త్రిలింగదేశం మనదేనోయ్" గీతాన్ని శ్రీమతి దివాకర్ల కనకదుర్గ ఆలపించారు. 40 సంవత్సరాలుగా కృష్ణాజిల్లా రచయితల సంఘానికి విశేషసేవలందిస్తున్న శ్రీ కాలనాథభట్ట వీరభద్రశాస్త్రి గారికి ఆత్మీయసత్కారాన్ని అందించారు.

పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం వారి ఆర్థిక సహకారంతో ఈ సదస్సును నిర్వహించారు.

**రెండవ సభ : 27-10-2006 మధ్యాహ్నం 2-00 గంటల నుండి 4-30 వరకు**

**కవిసమ్రాట్ పైడి పాటి సుబ్బారామ శాస్త్రి సభావేదిక**

భోజన విరామానంతరం మధ్యాహ్నం 2 గంటలకు ప్రారంభమైన రెండవ సభకు ఆచార్య పేర్వారం జగన్నాథం అధ్యక్షత వహించారు. యాభైఏళ్ళ పద్యకవితపై ఆచార్య బేతవోలు రామబ్రహ్మం, ఆధునిక కవితా ధోరణులపై కత్తి పద్మారావు, అవధాన సాహిత్యంపై రాపాక ఏకాంబరాచార్యులు, పుస్తక ప్రచురణ – సాధక బాధకాలు అనే అంశంపై డా॥ వెలగా వెంకటప్పయ్య, తెలుగుభాషలో మెళకువలపై డా॥ తూమాటి సంజీవరావు ప్రసంగించారు. శ్రీ చింతపల్లి వెంకటనారాయణ స్వాగతంపలికారు. శ్రీ జె. సాయిరాం ప్రసాద్ వందన సమర్పణ చేశారు.

ఈ సదస్సు నిర్వహణ సన్‌ఫ్లవర్ గ్రూప్ విద్యా సంస్థలు చల్లపల్లి వారి సౌజన్యంతో జరిగింది.

**మూడవసభ : 27-10-2006 సాయంత్రం 4-45 ని॥ నుండి 7-15 ని॥ల వరకు**

**శ్రీ ముక్కామల నాగభూషణం సభావేదిక**

టీ విరామానంతరం మూడవసభ సరిగ్గా 4-45 ని॥లకు ప్రారంభమయ్యింది. డా॥ అద్దేపల్లి రామమోహనరావు సభకు అధ్యక్షత వహించారు. డా॥ కొలకలూరి ఇనాక్ ముఖ్యఅతిథిగా పాల్గొన్నారు. క్రేన్ వక్కపొడి అధినేత శ్రీ మాజేటి పాపారావు ఆత్మీయ అతిథిగా విచ్చేశారు.

డా॥ చందు సుబ్బారావు తెలుగు సాహిత్య విమర్శపైన, శ్రీ తెలకపల్లి రవి ప్రపంచీకరణ ప్రభావంపైన, శ్రీ కొత్తపల్లి రవిబాబు సమకాలిన సాహిత్యంపైన, శ్రీ రామతీర్థ అనువాద సాహిత్యంపైన, శ్రీ చొక్కాపు వెంకట రమణ వ్యక్తిత్వవికాస సాహిత్యంపైన ప్రసంగించారు.

డా॥ గుమ్మా సాంబశివరావు సభకు స్వాగతం పలుకగా, శ్రీ వి.యల్. నరసారెడ్డి వందన సమర్పణ చేశారు.

ఈ సదస్సు శ్రీ వల్లూరు వెంకట బసవయ్య గారి సౌజన్యంతో నిర్వహించబడింది.

**నాల్గవసభ : 27-10-2006 సాయంత్రం గం. 7-15 ని॥ నుండి 9-00 వరకు**

**కళాప్రపూర్ణ తెన్నేటి హేమలత సభావేదిక**

ఇది "కవిసమ్మేళనం" సభావేదిక : డా॥ మాదిరాజు రామలింగేశ్వరరావు సభాధ్యక్షులుగా దాదాపు 60 మంది కవులతో కవితాగానం చేయించారు. శ్రీ పెనుగొండ లక్ష్మీనారాయణ ఆత్మీయ అతిథిగా పాల్గొన్నారు. శ్రీమతి కోకా విమల కుమారి స్వాగతం పలికారు. శ్రీమతి వి. శ్రీ ఉమామహేశ్వరి వందన సమర్పణ చేశారు.

ఈ సదస్సు ఆంధ్రాబ్యాంక్ వారి ఆర్థిక సహాయంతో నిర్వహించబడింది.

**ఐదవ సభ : 28-10-2006 ఉదయం గం. 9-00 నుండి 10-45 ని॥ల వరకు**

**మైత్రేయ సభావేదిక**

రెండవరోజు కార్యక్రమాలు ఉదయం గం. 9-00 లకే నిండుసభగా ప్రారంభం అయ్యాయి. డా॥ బోయిన వెంకటేశ్వరరావు, ఐ.ఎ.ఎస్. సభకు అధ్యక్షత వహించారు.

శ్రీ వీరాజీ ముఖ్యఅతిథిగా పాల్గొన్నారు. శ్రీ యం.డి.వి.యస్.ఆర్. పున్నంరాజు ఆత్మీయఅతిథిగా విచ్చేశారు.

డా॥ యస్ గంగప్ప తెలుగు నాటకరంగంపైన, డా॥కె. రామమోహనరాయ్ తెలుగు నవలపైన, శ్రీ నగ్నముని సాహిత్యోద్యమాలపైన, శ్రీ సుధామ ప్రసారమాధ్యమాలపైన ప్రసంగించారు. రాజ్యసభసభ్యులు డా॥ యార్లగడ్డ లక్ష్మీప్రసాద్ గౌరవ అతిథిగా సందేశం ఇచ్చారు. దుబాయి (యు.ఎ.ఇ.) లోని "రసమయి" ఆంధ్ర సాంస్కృతిక సదస్సువారు ఈ సదస్సు నిర్వాహణకు చేయూత నిచ్చారు. డా॥ జి. రెజీనా స్వాగతం పలుకగా – శ్రీమతి వేలూరి సుధారాణి వందన సమర్పణ చేశారు.

**ఆరవ సభ 28-10-2006 ఉదయం 11-00 నుంచి 1-15 వరకు**

**డా॥ త్రిపురనేని వెంకటేశ్వరరావు సభావేదిక**

శ్రీ విహారి అధ్యక్షత వహించిన ఆరవ సభకు శ్రీ పిరాట్ల వెంకటేశ్వర్లు ముఖ్యఅతిథిగా, డా॥ సామల రమేష్‌బాబు ఆత్మీయ అతిథిగా విచ్చేశారు.

శ్రీ పెద్దిభొట్ల సుబ్బరామయ్య తెలుగుకథపైన, ఆచార్య వి.సిమ్మన్న తెలుగుభాష పరిణామాలపైన, డా॥ కసిరెడ్డి వెంకటరెడ్డి జానపద కళారూపాలపైన, డా॥ యన్.అనంతలక్ష్మి ఆధ్యాత్మిక సాహిత్యం పైన ప్రసంగించారు. తెలుగు భాషోద్యమ సమాఖ్య అధ్యక్షులు శ్రీ సి.ధర్మరావు ప్రభుత్వం తెలుగుభాష పట్ల వ్యవహరిస్తున్నతీరుని దుయ్యబట్టారు. శ్రీ ఉప్పులూరి మల్లికార్జున శర్మ తెలుగుభాష ఔన్నత్యాన్ని కీర్తించారు.

తొలుత శ్రీ తాతా రమేశ్‌బాబు స్వాగతం పలికారు. డా॥ వేదాంతం రామకృష్ణమాచార్యులు వందన సమర్పణ చేశారు. డా॥ జటావల్లభుల కృష్ణమోహన్, శ్రీమతి పూర్ణ (కాలి ఫోర్నియా) వారు ఈ సదస్సు నిర్వహణకు తోడ్పడ్డారు.

**ఏడవసభ 28-10-2006 సా॥3-5 వరకు**

**సుంకర-వాసిరెడ్డి సభావేదిక**

డా॥ ద్వానా శాస్త్రి అధ్యక్షతన జరిగిన ఏడవసభలో శ్రీ బుడ్డిగ సుబ్బరాయన్ ముఖ్యఅతిథిగా పాల్గొన్నారు. శ్రీ బి.హనుమారెడ్డి ఆత్మీయఅతిథిగా విచ్చేశారు. డా॥ పాపినేని శివశంకర్ తెలుగుసాహిత్యంలో తెలుగుదనం గురించి, డా॥ తుర్లపాటి రాజేశ్వరి తెలుగు సాహిత్యంలో ప్రసిద్ధ పాత్రలు గురించి, శ్రీ సి.రఘోత్తమ రావు, ఇంటర్నెట్‌లో తెలుగు గురించి, డా॥వి.నాగరాజ్యలక్ష్మి తెలుగుసాహిత్యంలో మహిళా చైతన్యం గురించి ప్రసంగించారు. డా॥ వెలుదండ నిత్యానందరావు తెలుగు పరిశోధనల పైన, ఆశావాది ప్రకాశరావు తెలుగు పద్యం మీద విశ్లేషణ చేశారు.

శ్రీ గుడిసేవ విష్ణుప్రసాద్ తొలుత సభకు స్వాగతం పలికారు. శ్రీ పులవర్తి కొర్నేలియస్ వందన సమర్పణ చేశారు. శ్రీ ఇమ్మడిశెట్టి అక్కేశ్వరరావు చారిటబుల్‌ట్రస్ట్, విజయవాడ వారు ఈ సదస్సు నిర్వహణకు సాయపడ్డారు.

**ఎనిమిదవ సభ 28-10-2006 సాయంత్రం**

**కవిపాదుషా పువ్వాడ శేషగిరిరావు సభావేదిక**

ఇది కవిసమ్మేళనం సభ ! డా॥ రావిరంగారావు అధ్యక్షతన యాభైమందికిపైగా కవులు కవితా పఠనం చేశారు. ముఖ్యఅతిథిగా శ్రీ జ్వాలాముఖి పాల్గొన్నారు. డా॥ పాలపర్తి శ్యామలానంద ప్రసాద్ సభకు స్వాగతం పలికారు. శ్రీ బూదరాజు శ్యామసుందర్ వందనసమర్పణ చేశారు.

**ముగింపు సభ : 28-10-2006 సాయంత్రం**

**ఎం.ఆర్. అప్పారావు సభావేదిక**

ఆంధ్రప్రదేశ్ సాంస్కృతిక శాఖవారి సౌజన్యంతో నిర్వహించిన ముగింపు సభకు శ్రీ మండలి బుద్ధప్రసాద్ అధ్యక్షత వహించారు. ముఖ్యఅతిథి శ్రీ వేటూరి సుందరరామమూర్తి సభల ప్రత్యేక సంచికను ఆవిష్కరించారు. తెలుగు నేలను పంచుకోగలరు గాని, తెలుగుభాషని పంచుకోలేరంటూ సంకుచిత రాజకీయ ధోరణులను ఆయన నిరసించారు. శ్రీ వంగపల్లి విశ్వనాథం ప్రత్యేక ఆహ్వానితులుగా విచ్చేసారు. "తెలుగుపసిడి" గ్రంథప్రచురణను ప్రశంసిస్తూ ఈ శతాబ్దపు ఉత్తమ గ్రంథాలలో ఒకటిగా ఆయన పేర్కొన్నారు.

సభకు శ్రీ విడియాల చక్రవర్తి స్వాగతం పలికారు. డా॥ జి. వి. పూర్ణచంద్ వందన సమర్పణచేశారు.

ఎంతో క్రమశిక్షణాయుతంగా ఈ సభలు కలకాలం మిగిలిపోయే తీపిగుర్తులుగా జరిగాయి. దేశంనలుమూలల నుంచి ప్రతినిధులుగా విచ్చేసిన సాహితీ వేత్తలే ఈ సభలు విజయవంతం కావడానికి కారకులన్న డా॥ ద్వానా శాస్త్రి మాటలు అక్షరసత్యాలు. ఆచార్య సిమ్మన్న, డా॥ ద్వానా శాస్త్రి, డా॥ గుమ్మా సాంబశివరావు, శ్రీ దామోదరం గణపతిరావు, శ్రీ సత్రీ, శ్రీ జె. సాయిరాం ప్రసాద్, శ్రీ డి.యన్. అప్పారావు, శ్రీ సి. ప్రభాకరరావు, శ్రీ యస్.వి. రత్నారావు తదితర ప్రముఖులు ఎలాంటి భేషజం ప్రదర్శించకుండా సాధారణ కార్యకర్తల్లా పనిచేశారు. వారికి మా నమోవాకాలు. ఎందరో సౌజన్యవంతులైన సాహితీమూర్తులు, వదాన్యులూ, సాహితీ ప్రియులూ అందించిన చేయూతలే ఈ సభలు విజయంతంగా జరగడానికి ప్రధాన కారణాలు.

## మహాసభల దృశ్యమాలిక



జ్యోతి ప్రజ్వలన



విశేషసంఖ్యలో తరలివచ్చిన సాహితీమూర్తులు




మొజాయిక్ ఆంగ్ల అనువాద సంచిక ఆవిష్కరణ




ఆత్మీయ అతిథి డా॥ రాళ్ళబండి కవితా ప్రసాద్



శ్రీ పెరుగు రామకృష్ణ కవితల సి.డి. ఆవిష్కరణ



శ్రీమతి పూజిత నవల ఆవిష్కరణ



శ్రీ కాలనాథభట్ట వీరభద్రశాస్త్రిగారికి ఆత్మీయ సత్కారం




"తెలుగు పసిడి" ఆవిష్కరణ



ఆచార్య వెలమల సిమ్మన్న




శ్రీ సుధామ



డా॥ సామల రమేష్ బాబు



శ్రీ పిరాట్ల వెంకటేశ్వర్లు



శ్రీ నగ్నముని



డా॥ కడియాల రామమ్మోహనరాయ్



ఆచార్య ఎస్. గంగప్ప



డా॥ యార్లగడ్డ లక్ష్మి ప్రసాద్, శ్రీ మండలి బుద్ధప్రసాద్



శ్రీ కొత్తపల్లి రవిబాబు




శ్రీ బంగారరాజు (రారాజు) రచన ఆవిష్కరణ




స్వచ్ఛంద సేవలందించిన శ్రీ శారదా రామకృష్ణ విద్యాలయ విద్యార్థులు



శ్రీ పెద్దిభొట్ల సుబ్బరామయ్య



డా॥ వి. నాగరాజ్యలక్ష్మి



డా॥ బోయిన వెంకటేశ్వరరావు, IAS



శ్రీ బుడ్డిగ సుబ్బరాయన్



శ్రీ చొక్కాపు వెంకటరమణ




ఆచార్య వంగపల్లి విశ్వనాథం




శ్రీ సి. రఘోత్తమరావు, తెలుగు పీపుల్ డాట్ కామ్




డా॥ తుర్లపాటి రాజేశ్వరి



డా॥ పాపినేని శివశంకర్




డా॥ ఆశావాది ప్రకాశరావు




డా॥ వెలుదండ నిత్యానందరావు



శ్రీ బి. హనుమారెడ్డి, శ్రీ పొన్నూరి శ్రీనివాసులు, ప్రకాశంజిల్లా రచయితల సంఘం




డా॥ ఎన్. ఆనంతలక్ష్మి




శ్రీ సి. హెచ్. అజయ్ కుమార్ "సత్యభామ" నృత్యప్రదర్శన



ఆచార్య కొలకలూరి ఇనాక్



శ్రీ రామతీర్థ




శ్రీ తెలకపల్లి రవి




ఆచార్య చందు సుబ్బారావు



శ్రీ జ్వాలాముఖి



శ్రీ వీరాజీ



శ్రీ కూచిభొట్ల ఆనంద్

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర అవతరణ స్వర్ణోత్సవాల సందర్భంగా

50 ఏళ్ళ తెలుగుభాష, సంస్కృతి, సాహిత్యం

పరిణామ, వికాసాల సమీక్షగా

విజయవాడలో జరుగుతున్న

# జాతీయ తెలుగు రచయితల మహాసభలు

నిర్వహణకు ఆర్థికంగా చేయూతనందించిన

# పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం

వారి సౌజన్యానికి



మనఃపూర్వక ధన్యవాదాలతో....

**కృష్ణాజిల్లా రచయితల సంఘం**



సరస సంగీత, సాహిత్య, కళాస్వరూపిణి,

సర్వ విద్యా ప్రదాయిని,

మాతృరూపిణి,

శ్రీ శారదాంబకు నమస్సుమాంజలితో

సాహితీ మిత్రులందరకూ

హార్థిక శుభాకాంక్షలతో...

- అజ్ఞాత సాహితీ బంధువు







**శ్రీ తుర్లపాటి శ్రీనివాస్**
అమెరికా

**శ్రీ యలమంచిలి బాలాజి,**
**శ్రీమతి కిరణ్మయి**
అమెరికా

**శ్రీ శాఖా జానకిరామయ్యగారు**
మతుకుమిల్లి
తూ॥గోదావరిజిల్లా

## జాతీయ తెలుగు రచయితల మహాసభల నిర్వహణకు ఆర్థిక సహకారం అందించిన దాతలకు అభివాదములు

XXVIb





## SUNFLOWER GROUP

*... Inspiring People*

**M.D.V.S.R. PUNNAM RAJU**
Chairman
Sunflower Group of Institutions

## తెలుగు తీపి

**డా॥ రాధశ్రీ, హైదారాబాద్**

నన్నయ్య మనములో నాట్యమారంభించి
తిక్కన్న కలములో తీపి గురుతుగమారి
పోతన్న చేతిలో భాగవత గ్రంధమై
కవిరాజు శిరముపై కనకాభిషేకమై
పెద్దన్న పాదాన గండ పెండేరమై
తిమ్మన్న లేఖనీ సుమ పారిజాతమై
రామకృష్ణుని నోట రాణించు హాస్యమై
సూరనార్యుని కళా పూర్ణోదయమ్మగుచు
ధూర్జటి మహాకవికి ఆర్జింపగాయశము
కాళహస్తీశునకు కమ్మని నివేదనై
ముద్దులొలికెడి భట్టుమూర్తి గిరికగమారి
విష్ణుచిత్తుండైన కృష్ణరాయని మదిని
కవితా తటిద్వల్లి ఆముక్తమాల్యదై
పావులూరి మల్లన్న పఠనీయ గణితమై
వేమనార్యుని ఆటవెలదిగా భాసించి
పాల్కురికి సోమనగ పండితారాధ్యమై
చక్కనగు త్యాగరాజస్వామికీర్తనై
మానసము లూగించు జానపదగీతమై
పరవస్తు చిన్నయ్య బాల వ్యాకరణమై
శ్రీశ్రీ మహాకవికి శేముషీధనమిడిన
రసభరితమగు మహాప్రస్థానకావ్యమై
విశ్వనాధుని కల్పవృక్షమై శోభించి
విదుడగు సి. నా రె. మది విశ్వంభరగమారి
ఆరుద్రగళములో అంత్యప్రాసగనిలచి
దాశరథిగా అగ్నిధారలను వర్షించి
జాషువా యగుచు సెహభాషు అనిపించుకొని
కీర్తితో చెలువొందు కృష్ణ శాస్త్రీయమై
ఆత్మీయ మైనట్టి - అక్షరము నా తెలుగు

వాసము విడి వారాశిని
కోసులు కోసులుగ మీరు కొల్వుల గొన్నన్
వేసములే విధివేసిన
బాసకు **మధురాల తెల్గు** పలికెదనన్నా

**శ్రీ అధిభట్ల కామేశ్వరశర్మ, అబుదబి (UAE)**

## ఖాకీ బ్రతుకు

**-వసుధ, గుడివాడ**

కరుకయిన ముఖం ... కటువైన కంఠం..
కాఠిన్యం పులుము కున్న ఆయుధం..
కరకరమనే పాదం..
గరుకుతేలిన తనువును కప్పే
నిఖార్సయిన ఖాకీ యూనిఫారం...
వీటి అన్నిటి వెనకాల
మిణుకు మిణుకు మనే మానవత్వాన్ని
మమకారాన్ని నింపుకున్న హృదయాన్ని
ఎప్పుడైనా చూశారా ?



మండుటెండలోనూ, వణికించే చలిలోనూ
జడివానలోనూ నిర్మానుష్యపర్వతశ్రేణుల్లో
దేశరక్షణ చేసే వీర సైనికుల్లానే
జనారణ్యంలో మానవ మృగాల మధ్య చరిస్తూ
అధికారం చేతిలో పావులవుతూ
అధికారులకు సలాము చేస్తూ గులాములంటూ
దొరల రక్షణలో తమ రక్షణను మరిచే ఖాకీలను
ఎప్పుడైనా చూశారా ?



ఇల్లువాకిలీ ఎలావున్నా పట్టించుకోక
సొంత సమస్య లెన్నున్నా ఖాతరుచేయక
పెళ్ళాంబిడ్డలతో ఆనందిస్తున్నా
మరోవంక
అధికారుల మెరుపు పిలుపు కోసం
ఎదురుచూసే చకోర పక్షుల్ని
విధి నిర్వహణలోనే తనువునూ, తలపునూ బలిచేసి
అధికారుల 'సెల్యూట్' ని అంతిమ కానుకగా అందుకునే
మూగపీనుగల్ని ఎప్పుడైనా చూశారా ?



వాళ్ళే పోలీసులు
పోరాటాల చెంత, వివాదాల నడుమ బతుకీడుస్తూ
సెలవెరుగని కూలీలు...
సమైక్యగళాన్ని విప్పలేని గరళ కంఠులు
'విధి' పంజరంలోనే రోజంతా బందీలయ్యే
స్వేచ్ఛా విహీన పక్షులు....

**అక్టోబరు 21 పోలీసు అమరవీరుల దినోత్సవం సందర్భంగా**

# గోరుకొయ్యలు

జ్వాలాముఖి, హైదరాబాద్

ప్ర పంచీకరణ పట్టాభిషేకం
దొరలపగటివేషాల సమావేశం
రాజకీయ నిష్పత్తిలో రచ్చబండ
చరిత్రను వెనక్కితిప్పే హస్తలాఘవం

బందగీసమాధి గగుర్పాటు
దొడ్డికొమరయ్య జలదరింపు
కడివెండిలో గాయపడిన పల్లె
చెదిరిన పల్లివి వల్ల కాటిలో సంతాపం

దొరలచరణాలు భూస్వామ్యతోరణాలు
జమ్మిచెట్టుమీది ఆయుధాల పీడకలలు
"వెట్టిచాకిరీ", గుత్పలసంఘాలై ఢీకొన్నాయి.
"ఖబర్దార్" అంటూ చెలరేగాయి
"నీ బాన్చను దొరా! లు", నిప్పులు చెరిగాయి
"భూమి కోసం" భగ్గుమన్న సాయుధపర్వం
"భుక్తికోసం" కలలుపేనిన వేకువకాలం
"విముక్తి కోసం" వ్యవసాయ విప్లవం

కాశపోసిన యాసకామ్రేడై గర్జించింది
"విశాలాంధ్రలో ప్రజారాజ్యం" తెలుగుకల
"అధికారమార్పిడి" ని కాజేసిన కామందులు
"భూసంస్కరణలు" భూస్వాముల ఆటపట్టు
మినహాయింపుల్లో మొలిచిన షేర్ మీసాలు
ప్రణాళికల పందేరంలో పాతకాపులు
ధృతరాష్ట్రుని సభలో సాపేక్ష ప్రజాస్వామ్యం
ధర్మకర్తల న్యాయంలో ధర్మం కుంటికాలు
అపస్మారక దశలో "అభివృద్ధి" విషజ్వరం
రాజ్యందలారీ! రాజ్యహింసతలారీ!

దొరలు కుబుసాలువదిలారు
కారట్లకు పడగలెత్తారు
"వన్స్‌మోర్" లో కాటిసీను"
శ్మశాన వైరాగ్యంలో చావుపన్ను
సత్యహరిశ్చంద్రుడు త్రిశంకుబాకీదారు
పీనుగులలెక్కల్లో పాలుపోని కాటికాపరి
నిత్యవలసల నిష్ఠూరంలో ఆత్మహత్యలు
మట్టిమనుషులు కీర్తిశేషులు
నరకం తరచు చుట్టపుచూపు
బేరగాళ్ల చదరంగంలో నేరగాళ్లు
అగ్రరాజ్యాల గాలం పట్టులో
గిలగిలకొట్టుకునే చిన్నరాష్ట్రాలు
బ్రహ్మరాక్షసి కేంద్రం కింద
పిల్లరాకాసుల ఇష్టారాజ్యం
సాలెగూడులో సంక్షేమరాజ్యం
దొరల తెలంగాణా ఊరేగడాలు
ప్రజల తెలంగాణా భేరిపోరాటాలు
కలవారికాంక్షల్లో కష్టజీవి శాపగ్రస్తం

అడ్డగోచీ అడ్డపోగ శ్రీకాకుళమూగజీవులు
ఏనాడూ పాలమూరు వడ్డెరుల పొట్టగొట్టలేదు.
పండని ప్రకాశం పత్తిరైతులు ఏనాడు
తెలంగాణాలంబాడీల నెత్తురు తాగలేదు
కడప బాంబులు కరీంనగర్‌లో పేల లేదు
గుంటూరు పొగాకుకు ఓరుగల్లు నసాళం
ఎక్కలేదు.

కాకపోగా అందరూ కలిసి బిల్డింగులు కట్టి
రాజధానిని, భాగ్యనగరంగా మార్చి వేశారు.
జీతాలతో బతుకుజీవుడా అన్నారు.
కంట్రాక్టర్లు కొల్లగొట్టినా కిమ్మనలేదు.
కాకతీయుల ఫ్యూడల్ దర్పాలు
పద్మనాయకుల పులి తేన్పులు
రియల్ ఎస్టేట్ల భూమి దొంగలు
ఎలక్షన్లను ఆడించే ఫ్యాక్షన్ దాదాలు
సినీమాయల కొత్తకుబేరులు
ప్రాజెక్టుల పురుషార్థంలో కాకిలెక్కలు
ప్రపంచీకరణ ఏరివేతలో మాతృభాష
చెల్లని భాషరాష్ట్రంలో తెలుగులెస్స"?

తరతరాలుగా దరిద్రనారాయణులు
వానల్లో తడిసారు వరదల్లోతేలారు
ఎండల్లో మాడారు చలికి వణికారు.
గంజికేంద్రాల ఎదుట పడిగాపులు కాశారు.

అనామకులుగా పుట్టి శ్రామికులుగా మెట్టి
నాగరికతకు అన్న వస్త్రాలిచ్చి వేమనలయ్యారు
కులమతాలచిచ్చుల్లో బూడిదరాసులయ్యారు
చెమట వారిచిరునామా చావుపంచనామా

అర్ధాకలి ఆశ్రయం! ఆకాశం ఆచ్ఛాదన
అకాలమరణం అన్నది ఆశీర్వాదం
తెలుగు దారిద్ర్యం వెలగని విప్లవం
తిరుగాడే తెలుగు పామరం తెల్లవారింది
సంఘటిత తెలుగుజాతి, అనాది స్వప్నం
నిర్మల సంఘీభావం నక్షత్రాల దీక్ష
ఇప్పుడు నిధుల సాగర మధనం
పీనుగ మీద అంబారీ సేవ సాగుతోంది
అస్మదీయుల ఆరాటం తస్మదీయుల కోలాటం
అంతటా వాటాల తొక్కిసలాట

అందరి నోట్లో మట్టిగొట్టే మోహిని
ప్రపంచీకరణలో వశీకరణ జాణ
బహుళజాతికంపెనీల వేరుపురుగు

స్వచ్ఛంద బాటలు చాపకింద బీటలు
వైరస్ వ్యాపించిన కాలర్ రోగాలు
ప్రాంతీయ జ్వరంగా కోటి రత్నాలవీణ
ప్రాసుల పలుకుబడి నివాసుల రాబడి
ఆత్మప్రదక్షిణలో సర్వం జగన్నాథం

మెదడు వాపు వ్యాధిలో విచక్షణా వివేకం
ఎయిడ్స్ గుప్పిట్లో కాందిశీకుల గుడారాలు
గాయపడిన వేలాది ఆశల అంతిమయాత్ర
తూర్పుగాలి మార్పుగాలికాలేక గాలి మార్పు
మనిషిని మనిషిగా ప్రేమించిన మట్టిమనిషి
ఆగమయ్యాడు ఆందోళనలో పరాధీనం

తాకట్టులో భారతదేశం తాజాపర్వం
దేశానికే వేలంపాట కత్తిగాటు
వాటాల కూటములుగా నయావలసలు
అభద్రతలో అతి జాగ్రతస్థానిక వక్రత

చెత్తకుండీలో రొచ్చుగుంట బాల్యం
రెడ్‌లైట్ ఏరియాలో చిక్కుపడ్డయవ్వనం
అంత్యక్రియల ఆరాటంలో నిర్వేదం వృద్ధాప్యం
స్వగతాల ఆవేదన ప్రకాశాల రావణకాష్టం

బతుకు ఈడ్వలేని అనిశ్చితి
చావు సాధ్యంకాని వికృతి
ముంచుకొస్తున్న ప్రళయంలో
దృష్టి దోషంలో కొత్తతరం
సామ్రాజ్యవాద ఖడ్గ మృగాన్ని పట్టే
రాజకీయ వేటలో వీర తెలంగాణా
సంఘటిత తెలుగుజాతి ఆయుధం
శ్రీ కాకుళగిరిజనుడు తెలంగాణా హరిజనుడను
రాయలసీమ సుగాలీలు పిడికిళ్లు బిగించేకాలం

గాలిదుమారాన్ని తుఫానులో వంచి
జైత్రయాత్ర సంధించిన సంధికాలం
తెలంగాణా వీరులతో కోస్తాధీరులతో
సీమ శూరులు కలిసికదిలే గోరుకొయ్యలు

ఇకదొరల తెలంగాణాకు సమాధి
ప్రజల తెలంగాణా కోస్తా సారధి
పెన్నేటిపాటి చరిత్రమేలుకొలుపు
కృష్ణమ్మ కెరటం శ్రమజీవుల కిరీటం
గోదావరి బాట ఆగని తిరుగుబాటు
శ్రీకాకుళం శతాబ్దాల తెలుగు వెలుగు.

***With best Compliments from :***



*M. Anjaneya Rao*
MANAGING DIRECTOR

# Ravi Publishers

**EDUCATIONAL PUBLISHERS**

**P.B. No. 799, Kala Nagar, Near Benz Circle,**
**VIJAYAWADA - 520 010**

**Cell : 9440 666 333 Res.: 0866 - 2479329**
**Off. : 0866 - 2483799, 2476363, Fax : 0866 - 2483799**



***Branches***

| | | |
|---|---|---|
| **BANGALORE-27** 22240491 | **TRICHY-18** 2760106 | **HYDERABAD-38** 55916972 |

# ఏకాంతం

అరసవిల్లి కృష్ణ, విజయవాడ

మనసుల చలనంలో ఏకాంతం
శబ్దరుతువులో వాలిన, ఏకాంతం
మనషుల అల్లికలో వొదిగిన ఏకాంతం
ఏకాంతం ఒంటరిస్వరం
ఎవడి ఏకాంతం వాడిదే !
ఎవడి మౌన ప్రపంచం వాడిదే
మంచు కౌగిలిలో
దుఃఖం పగిలిన రాత్రి ఏకాంతం
సంధ్యను చీల్చుకుంటూ
రైలు దూసుకుపోతుంది
చివరి కరచాలనంలో
రైలు పట్టాల మధ్య నలిగిన ఏకాంతం
అమ్మ అంబలి అరక చేసి
ఇత్తడి గిన్నెలో వేశాక
పొట్టలోకి జారిన అంబలి ప్రవాహంలో
ఏకాంతం
గొస్తనీ నదిని దాటి బంగాళాఖాతం దగ్గర
కూర్చొని
డార్విన్ పరిణామ సిద్ధాంతాన్ని
అనుభవించడం ఏకాంతం
భీమ్లీ సాగర తీరంలో కూలిన
డచ్చి బంగళాల మధ్య ఒలికిన, ఏకాంతం
ఏకాంతం నాదేనా !
ఏకాంతం అందరిదా !
గురజాడ పూర్ణమ్మను ఏకాంతంలో
బంధించాను.
బాల్యస్నేహితురాలి బలవన్మరణం
ఏకాంతంలో ఉంది
పురాతన భవనాలు కూల్చి
చదును చేసిన రాకాసిబల్లికి
జ్ఞాపకాల జాడలు తెలియవు
ఆకాశం, నేల, నది
ఏకాంతానికి ప్రతీకలు
నగరం వలస జీవుల్నీ పడేసుకుంది
బరువెక్కిన శరీరంతో నగరం
ఏకాంతాన్ని గొంతులో దాచుకుంది
ఉదయపు నిద్ర వదిలినవాడు
సాయంకాలానికి శాశ్వత నిద్రలోకి
జారుకుంటాడు !
ఏకాంతం బహిరంగమవుతుంది
చావుల మదుం, దగ్గర లేచిన
చావు మంటను చూస్తే
ఏకాంతం సజీవస్వప్నం
మృత్యువు చివరి వీడ్కోలులో
విరిగిన హృదయం ఏకాంతం
భూగోళ ముఖంపై
రెండుతలలు మొలిచాయి
రెండు చెవులు మొలిచాయి
ఏకాంతాన్ని వింటున్నాయి. చూస్తున్నాయి
ఏకాంతం నాలోపలికి ప్రవహిస్తుంది
ప్రవాహం నన్నుచూచి ఏడుస్తుంది
నెమలిలా విరిసేవల్ని ఆకాశదీపాన్ని చూచి
ప్రియురాలి కంటి భాషలా
ఏకాంతాన్ని భద్రపరచుకోవాలి
ఒంటరిపాత్ర రంగస్థలంపై నటిస్తుంది.
ఆ పాత్ర ఏడుస్తుంది నవ్వుతుంది
నృత్యం చేస్తుంది.
మాటలు లేని మూకీనాటకం
చప్పట్ల మోతలేని కళాప్రాంగణం
ఏకాంతంలో మనుషుల్ని గుర్తించేలోపే
చత్వారం
విత్తనం నుండి మొలకదాకా
మొలక నుండి మహావృక్షం దాకా
ఏకాంతం ఓ నిరీక్షణ
ఓ సారి వర్షం వస్తే బావుణ్ణు
ఏకాంతాన్ని శుభ్రపరుచుకోవాలి.

## అన్నదాత

వడ్డాది లక్ష్మీసుభద్ర విజయవాడ

హాలికుల జీవనాధార మ
యిన సుక్షేత్రములు పరులపాల
వ్వగా నిజదార సుశోద్ధర
ణ ఎట్లు జరుగునని కలంనె పాల

కుల స్వార్ధరాక్షసత్వములే
పరాకాష్టయిన వేళరక్షిం
చే వారే భక్షించే వారైతే
రైతులునికి కనుమరుగైపోయె

## అక్షరాల పెట్టె

శింగిశెట్టి సంజీవరావు, జైపూర్, ఒరిస్సా

రాజేశ్వరికి అపురూపంగా పుట్టిన మొదటి సంతానం అరుణ్‌కి గోరుముద్దలు పెట్టే సమయం వచ్చేసింది. 'అరు', వీడి 'షార్ట్ కట్ క్రాఫింగ్' లా ముద్దు పేరు.

ఇంటి వీధి గుమ్మం ద్వారానికి పైన ఆకు పచ్చన, క్రింద ద్వార బంధానికి పసుపు పచ్చన, రెండూ పచ్చులే. పసుపు నేపథ్యంలో ఎరుపు తెలుపు చుక్కలు చెట్టాపట్టాలేసుకొని వచ్చేవారికి స్వాగతం పలుకుతున్నా, అంతటితో ఆగక, వాటిని మట్టి వచ్చిన కాళ్లని, చిన్ననక పెద్దనక కుదేస్తున్నాయి.

'అరు' అమ్మ వైపు, నాన్న వైపు వంశ వృక్షాల్లో వాళ్లతో ఇల్లు సందడిగానే వుంది. ఇరుగు పొరుగు, ఇంకా స్నేహితులు, ఆ సమయానికి జైయకొట్టేందుకు హాజరుకాక మానరు.

'అరు' నాన్న రాజారావు మితభాషి, ఏర్పాట్లని 'ట్రాఫిక్ పోలీసు' లా సంజ్ఞలతోనే జరిపిస్తున్నాడు. ఆ మాటకొస్తే ఆయన ఇందులో చేసేదేముంది. అంతా ఆడవారు చేయాల్సిన పని.

రాజేశ్వరి అమ్మ, అత్తగారు సరేసరి. తమ పెత్తనానికి ఏ మాట రాకుండా జాగ్రత్త పడుతున్నారు. పుల్లగూర మాటేగాని దాని తీపిశాతం ఎక్కువన్నట్టు.

'అరు', ఇద్దరు తాతయ్యల చేతుల్లోకి మారుతూ, కాళ్లూ చేతుల్తో పోరుతున్నాడు. సంకెళ్లలో బందీని విడిచి పెట్టేస్తే, దేశానికి స్వాతంత్రం వచ్చినంత సంబరం వాడికి

'ఆ, కుదరదు, అంతే, అమర్చి పెట్టిన తర్వాతనే మనమణ్ణి నేల వదిలేది. అంత వరకూ సముదాయించండి. వీడేం కళ్లల్లో నీటి కుండలు పెట్టుకొని ఏడ్చే రకం కాదులే. 'అరు' ముఖమంతా బోసినోరే నవ్వుల్తో" రాజేశ్వరి అమ్మ అంది.

'అరు' ముత్తాతయ్య వాడిన "ఫౌంటెన్ పెన్" ఇప్పుడు 'జెల్ పెన్' లు 'బాల్ పెన్' ల ముందు వెలవెలబోయి కనపడినా, 'ఏంటిక్' ప్రాముఖ్యత ఇచ్చి రాజేశ్వరి వెలుపలికి తీసింది, అత్తగారు పదిలపర్చిన బీరువా నుండి. మొత్తానికి రాజేశ్వరి అమ్మ, అత్తగారు పూర్తి బాధ్యత తీసుకుంటేనేకాని అనుకొన్న పని పూర్తి కాలేదు.

"అమ్మయ్య" రాజేశ్వరి అరు ని తనచేతుల్లోకి తీసుకొని, తాతయ్యలకు ఆటవిడుపు ఇచ్చింది. ముహూర్తానికి వాణ్ణి క్రిందకు దించింది.

"ఈ కాలప్పిల్లలు బాలక్రిష్ణుడిలా ఎంచక్కా 'బంగరురా' అంటే పొట్టపైన పాకుతారు" నోరు విరిచింది 'అరు' అమ్మమ్మ.

"చప్పట్లు చతిచి వీడి దృష్టి ప్రక్కలకు మరల్చకండి", అంటోంది రాజేశ్వరి అత్తగారు. అటువైపూ ఇటువైపూ 'రేసు' చూచే వారిలా నిల్చున్నారు వాడి ఇద్దరు తాతయ్యలు.

అక్కడ చేరిన బంధువుల పిల్లలు ఊరుకొనే బాపతు కాదు. 'అరు'ని ఆటపట్టిస్తునే వున్నారు, అది ముట్టుకో, ఇది పట్టుకో అని, "ఆ, వద్దు 'మ్యాచ్‌ఫిక్సంగ్'", అన్నాడు రాజారావు కొందరు ఆడ, మగ పిల్లలు పందాలాడుతుంటే, నడుం సాగదీసి ప్రాకుతుంటే 'అరు'ని మట్టి ఎర్రండర్రా అని ఎవరో వేసిన జోకుకి అందరి పకాల్న నవ్వులు చెవిలో పడ్డందుకు, సగం దూరం సాగిపోయినవాడు ఆగిపోయి, అటు యిటు పరకాయించాడు, మెడెత్తి పెద్ద మగాడిలా.

'లాఫింగ్ క్లబ్', మరింకెవరో అంటే నవ్వులు దొంతరలు చేసుకొన్నాయి.

అందరివీ చిరునవ్వుల్లోకి మారితే 'అరు' దృష్టి ముందుకి మరలింది వరుసవైపు. చిన్ని గుండె నేలనానకుండా ముందుకి సాగింది. అంతా నిశ్శబ్దం.

విప్పారిన 'అరు' రెండు కళ్లూ పడ్డాయి దగ్గరగా. "ఫౌంటెన్ పెన్' రాజేశ్వరి అన్నంతలోనే, చిట్టి చేయి వెంట్రుక వాసిలో దాటిపోయింది. "నోట్లు, నోట్లు, వెయిరూపాయల నోట్లకట్టరా మనమడా" రాజేశ్వరి తండ్రి అన్నంతలో అక్కడా అదే జరిగింది. 'పుష్టి, పుష్టి' రాజారావు నాన్న అన్నాడో లేదో 'అరు' వెండి గిన్నెని ఒడిసి పట్టుకొన్నాడు, రెండు చేతుల్తో.

రాజేశ్వరి కడుపులో 'అరు' ప్రాణం రూపు దిద్దుకోనారంభించిన నుండి, కోడలికి పుష్టిగా తినిపించమని పురమాయించింది కాక, బిడ్డడు పుట్టింతర్వాత అదే పాట రాజారావు నాన్నది, ఈ సారి తల్లీ బిడ్డలకోసం.

'మరీ అంత పెద్ద నగిషీ వెండి గిన్నెలో గుమగుమలాడిస్తూ ఆత్తెసరు తీపి పాలన్నం అంచుల కాడికి పెట్టాలా?" రాజేశ్వరి విసుక్కుంది, పొరపాటు తనది కాదన్నట్లు.

'అరు' నోరు, ముక్కు, కళ్లు, బుగ్గలన్నీ ఏకమయ్యాయి.

కోణంగి పిల్లలు 'అరు' చుట్టూచేరి, బుగ్గలు నుండి కాసింత కాసింత వ్రేళ్లతో తీసి చప్పరించారు 'ఎంత బాగుందో' అంటూ.

"గోరు ముద్దలకేం కర్మ అన్నం పిడసలు తినేయగలడు మా మనమడు" అంటూ రాజారావు నాన్న ఉత్సాహానికి అంతులేదు. జయోత్సవం జరుపుకొనేందుకు నగారా సంకేతం పలికాడు.

'అరు' అన్న ప్రాసనం ముగిసింది.

రాజేశ్వరి మామగారు కోరుకున్నట్లే ఆరుణ్ పొట్టి బుడంకాయలా పెరగనారంభించాడు.

నాలుగు సంవత్సరాలు, నాలుగు నెలల, నాలుగు రోజుల ముహూర్తానికి 'అరు' కి విద్యాభ్యాసం కావాలని రాజేశ్వరి సంకల్పం. 'అరు' ని తండ్రి మూడేళ్లు నిండిన వెంటనే 'ఇంగ్లీషు నర్సరీ' లోనే చేర్పించాలన్నందుకు, రాజేష్ కోణంలో ఇది నెగెటివ్ సంకల్పం. తక్కిన కుటుంబ సభ్యుల నెగెటివ్ సంకల్పాలు తోడై, వెరసి రాజేష్ సంకల్పం 'మైనస్' అయింది.

రాజేశ్వరి రాజీ పడక తప్పలేదు. ఆ మూడేళ్ల వయస్సులోనే కనీసం 'అరు' బియ్యంలో పసుపు కొమ్ముతో 'ఓనమా'లు శ్రీకారం చుట్టేందుకు రాజారావు తన వంతు రాజీకొచ్చాడు.

అక్షరాభ్యాసం ఘనంగా జరిగింది. అప్పుడు 'అరు' సిద్ధి వినాయకుడిలా దర్శనమిచ్చాడు.

'అరు' కోసం 'ప్లాస్టిక్' ఇంగ్లీషు అక్షరం బిళ్లలు కూడ కొని తెండి, సొమ్మేమి అయిపోదులే' రాజేశ్వరి అంది భర్తతో.

రాజారావు అందుకు అంగీకరించి, రాజీ పద్ధతిలో, బిళ్లల కోసం ఊరల్లా వెతికాడు. పల్లెటూరి బైతన్నట్టు దుకాణం వాళ్లు రాజారావుని ఎగాదిగా చూసి, మూతి విర్చినందుకు మనస్సులో భార్యపై ఆమాత్రం కోపగించినా, తన ఉద్యమం ఆపలేదు.

"తెలుగుకి కాటకం వచ్చింది" రాజేశ్వరి నిష్ఠూరంగా మాట్లాడింది.

వెతికి వెతికి రాజారావు ఒక 'ప్లాస్టిక్' కుటీర పరిశ్రమని కనుగొన్నాడు. చిన్నవైతేనేం బిళ్లల 'డై' లు తయారు చేయించి, 'ప్లాస్టిక్ బీడ్స్' కరిగింపించి అచ్చు పోయించాడు. వందల సంఖ్యలో చేయించాల్సిన దానికవసరమైన రొక్కం చెల్లించాడు. ఒకే 'సెట్' పోతపోయించడం వల్ల 'ప్లాస్టిక్ బీడ్స్' ఖర్చు ఆ శాతానికి తగ్గింది.

'అరు' అక్షరాల పెట్టెలోకి తెలుగు బిళ్లలు చేరాయి ఇంగ్లీషుకి తోడు రంగు, రంగుల్లో 'అరు'కి అక్షరం బిళ్లలైతే బలేగా ఉన్నాయి.

నెల ఇంక కాలేదు 'అరు'కి కడుపు నొప్పడం ప్రారంభించింది.

'తిండిపోతు కడుపుకి నొప్పిరాక మరేమవుతుంది', రాజేశ్వరి మామగారి ముందు అంది.

'ఛ, అదేంకాదు. కడుపులో పాములు చేరినట్లున్నాయి' మామగారు అన్నారు.

'పాముల మందుపట్టిస్తే అవే పోతాయి' రాజారావు అన్నాడు.

'అరు'ని వైద్య పరీక్షలకి తీసుకెళ్లక తప్పలేదు.

'కడుపు చీరినా నాలుగు తెలుగక్షరాలు వచ్చినట్లు కనిపించదు" రాజేశ్వరిది అదే ధోరణి.

'ఎక్స్‌రే' తీయడమయింది. శస్త్రచికిత్స చేసి అరుణ్ కడుపులోంచి తీశాడు 'సర్జరు' 'ఫారెన్ బాడీ'ని.

నాలుగు చిన్న తెలుగక్షరం ముక్కలు.

అంతక్రితం అక్షరాల పెట్టెలోంచి కనిపించకుండా పోయినవే.

...

## సూర్యక్రీడలు

రాజు, హైదరాబాదు

తెల్లవారు తున్నట్లుంది - హరిత మందిరాల్లో
సామగానం సరంభం!
కుల గురువు వేదమూర్తికి స్వాగతం పలుకుతున్న
పక్షుల సంబరం !!
కంట్లకాలు పదిలంగా పేర్చి తాడిచెట్టు మొగలో
కాకి గూడు కట్టుకొంది
అది, పాట్టై ఎప్పుడు తనమీద వాలుతుందోనని
చిగురుటాకుల వేదిక సిద్ధంచేసి మామిడి చెట్టు
ఎదురు చూస్తోంది.
ఒక జల్లు పడింది
చెట్లన్నీ నిగారిస్తున్నాయి
అభ్యంగన స్నాతల్లా, జ్ఞాతల్లా !!
పచ్చని ఫందిళ్ళ విందులో
సుమ పాత్రికలతో అందించిన మధువును సేవించి
వనలక్ష్మిని సంతానలక్ష్మిగా దీవించి పోయాయి తుమ్మెదలు
నిపుణుడైన "క్రికెట్" వీరుడు కొట్టిన బంతిలా
నింగిలా దూసుకొస్తున్నాడు చంద్రుడు
మైదానంలో ఆటగాళ్ళలా నక్షత్రాలు వెలవెల పోతున్నాయి.

## తొలి స్పర్శ

నిషిగంధ యలమంచి, అమెరికా

చుట్టూ అర్థం కాని సందడి
ఇవాళ నువ్వొస్తున్నావంట కదా!

మల్లెలా? కనకాంబరాలా??
నిర్ణయాలు తీసుకోవడం
కష్టమే సుమా!

ఎక్కడా నిలువని
నా చూపులు
అస్థిరత్వానికి నిర్వచనంలా...

నిన్ను చూస్తూనే
గడపని దాచేసిన
చమత్కారం
చీర కుచ్చిళ్ళదా!?

నేల మీదుండాల్సిన నేను
నీ చేతుల్లో..
నీ తాలూకు పరిమళం
నా ఊపిరిలో..
నింగి వంగి
నుదుటిపై ముద్దు పెట్టినట్లు !

# ఎదురీత

అక్కల సరస్వతీ బాబురావ్, మచిలీపట్నం

ఆ రోజు అమ్మ వచ్చిందని ఆనందపడిపోతూ గబగబ పిండివంటలతో సహా వంటముగించిన సుధ హాల్లోకి వస్తుండగ తలుపు తట్టిన శబ్దం వినిపించింది. తలుపు తీసిన సుధ రెండు క్షణాలు బొమ్మలా బిగిసి పోయింది నోట మాట రాక! తర్వాత తెలివితప్పి పడిపోతున్న సుధను లలితమ్మ రెండు చేతుల్లో పట్టుకొని గుమ్మం వైపు చూసింది. క్రొత్త బట్టలతో, పూలదండలతో అల్లుడు రవి, అప్రక్కనే కళ్యాణం బొట్టుతో క్రొత్తపెళ్లి కూతురిలా వున్నమరో అమ్మాయి ! విషయం అర్థంచేసికొన్న లలితమ్మ తెల్లబోయింది.

సుధకు తెలివి వచ్చేసరికి మంచం మీద వుంది. ప్రక్కనే తల్లి. ఒక్కక్షణం తను చూసింది కలా! నిజమా! అనే భ్రాంతిలో పడిందిసుధ. నిజమేనని నిర్ధారణ చేసికొన్న తర్వాత ఆమెకు దుఃఖం కలుగ లేదు సరిగదాభర్త పట్ల అసహ్యం కలిగింది. మాటా పలుకూ లేకుండా పిచ్చిగపైకి చూస్తూ పడుకొన్న సుధను చూస్తే లలితమ్మకు జాలికలిగింది.

ఇతగాడికి పెళ్లయిందని ఆ అమ్మాయికి తెలియదేమో? నెమ్మదిగా మాటల్లోకి దింపింది కూతుర్ని.

"తెలుసమ్మా" అంది సుధ

'తెలిసీ పెళ్లైన వాడిని, ఇద్దరు బిడ్డల తండ్రిని ఎలా చేసికొందే? అయినా ఈ కాలం ఆడపిల్లలకు మరీ హద్దు లేకుండాపోయింది" విసుగ్గా అంది.

"మన బంగారం మంచిదయితే ఒకరిని అనుకోవలసిన దేముంటి" అంది సుధ దిగులుగ.

"ఆ అమ్మాయి నీకు తెలుసా?" తల్లి అనుమానంగ అడిగింది.

"తెలుసు"

"అలాటప్పుడు భర్తను ఒక కంట కనిపెట్టి చూడటం కూడ చేత కాలేదా నీకు ?"

లలితమ్మ నిష్ఠూరానికి సుధకోపంగా లేచి కూర్చుంది. "నా భర్త ఇంత ఘనకార్యం చేస్తాడనే అనుమానం నాకెప్పడూ రాలేదు. అసలు రమను, ఆయన్నునేనలా యెప్పడూ ఊహించలేక పోయాను. మా కుటుంబంలో కలిసిపోయినట్లున్న ఆ అమ్మాయిపట్ల నా కెలాటి అనుమానం లేకపోయింది.

కొంచెం సేపటి వరకు ఇద్దరూ మాట్లాడలేదు. తర్వాత సుధలేచి తనవీ, పిల్లలివీ బట్టలు సూట్‌కేస్‌లో సర్దటం మొదలుపెట్టింది. భయపడుతున్నట్లుగా అటువచ్చిన రవి నన్ను క్షమించు సుధా, మొదట నీకు చెప్పాలనే అనుకున్నాను. కాని..." అంటూ ఏదో చెప్పబోయాడు.

అతడి మాట పూర్తి కాకుండానే గది తలుపులు అతడి ముఖం మీదే మూస్తూ సుధ చూసిన చూపులోని భావం "క్షమించగలిగిన తప్పనే నువ్వు చేశావా?" అని అడిగినట్లుంది.

బట్టలుసర్ది పిల్లలకోసం యెదురుచూస్తూ అలాగే గదిలో కూర్చుంది. సుధ.

"అమ్మా పిల్లలిద్దరూ ఆటలకు వెళ్లి నట్లున్నారు. పిలువమ్మా నేనింకొక్క క్షణం యిక్కడ వుండలేను." అంది అప్పడే వచ్చిన తల్లితో.

"సుధా తొందర పడకు తల్లీ నీ బాధ నాకు తెలుసు. కాని మనం స్త్రీలం కొంచెం ముందు చూపూ, ఆలోచనా వుండాలి. ఆవేశం మనకు పనికి రాదమ్మా. మనకు కావల్సింది ఓర్పు" నచ్చచెప్పబోయింది లలితమ్మ "అమ్మా నా భర్త హృదయంలో నాకు స్థానం లేకుండ పోయినప్పడు అతడి ఇంట్లో నేనెలా వుండగలను? అలాటి ఓర్పు నాకులేదు. వద్దు కూడ" దృఢంగ అంది సుధ. "అతడు చేసిన పనికి చాల బాధపడుతున్నాడు. నువ్వంటే ఎంతో ప్రేమా, గౌరవం వున్నవని, నిన్ను వెనుకటి మాదిరిగానే చూసుకొంటాననీ అంటున్నాడు" "ఇక ఆపమ్మా. ఆ రకం మాటలు నాకు చెప్పకు నాకూ ఆత్మాభిమానం, ఆత్మగౌరవం వున్నాయి. ఆయన దయాభిక్ష నాకు అక్కర్లేదు." విసురుగ అందిసుధ.

"జీవితాంతం మళ్లీ అతడి దగ్గరకు రాకుండ ఉండగలననే అనుకొంటున్నావా ? అతడింకా మంచి వాడు కాబట్టి నిన్ను బాగా చూసుకొంటానని అంటున్నాడు. మనం ఆడవాళ్లం తల్లీ, అన్నిటికీ అణిగిపడి వుండాలి. మగవాడు ఏది చేసినా చెల్లుతుంది" అనుభవంతో చెప్పింది తల్లి.

"అమ్మా ప్రతి విషయంలోను 'మనం స్త్రీలం' అని కించపరచుకొంటూ, స్త్రీని స్త్రీయే చులకన చేసికొంటూ పోతే యిక మన స్త్రీజాతికి ముక్తేలేదు. నేనొక్క మాట అడుగుతాను. చెప్పు ఆయన. చేసిన పనే నేను చేసి వుంటే ఆయన నన్ను క్షమించేవారా ?" ప్రశ్నించింది సుధ "ఆవేం మాటలే. మగవాడితో మనకు పోటీయా?" నీతి, న్యాయం అనేవి పురుషుల కొకటీ, స్త్రీల కొకటీ వుండవమ్మా".

"అయితే ఏంచేయాలని నీ నిర్ణయం? సమాజం నిన్ను ఒంటరిగ బ్రతక నిస్తుందనే అనుకొంటున్నావా? నీవా... తండ్రిలేని పిల్లవు. నీ కాళ్లమీద నిలబడడానికి నీకు ఒక డిగ్రీ కూడ లేదు" ముందు చూపుతో అంది.

"దేశంలో డిగ్రీలు లేకుండ బ్రతికేవారు చాల మంది వున్నారు. నా శరీరంలో శక్తి వున్నంత వరకు శ్రమించి నా పిల్లలను ఈ సమాజానికి ఎదురీదేటట్లు పెంచుతాను. ముందుగ కోర్టు కెళ్లి నా భర్త లాంటివారికి గుణపాఠం నేర్పుతాను". దృఢంగా అంది సుధ.

"మనకు కోర్టులూ, గొడవలూ ఎందుకే తల్లీ" "నువ్వలా పిరికిపాలు పోయకు దొంగతనం చేసే వారికీ హత్యలు చేసేవారికీ శిక్షపడేటప్పడు వీళ్లకెందుకు పడకూడదు? ఇది మాత్రం బ్రతికున్న భార్యను హత్య చేయటం కాదా? ఈ తరం స్త్రీలంతా కొన్ని త్యాగాలు చేసి ఇలాటి భర్తలకు, సమాజానికి భయపడకుండ నిలబడగలిగితే ముందుతరం స్త్రీలన్నా సుఖపడతారు. అమ్మా ఎన్ని కుటుంబాలు యిలా నాశన మయ్యాయి? ఎందరు భార్యలు ఇలా అణగద్రొక్కబడ్డారు ? రాబోయే పరిస్థితులకు భయపడకుండ ఆత్మస్థైర్యంతో ఎదుర్కొంటూపోవాలి. బ్రతుకు అన్యాయమై పోతున్నప్పడు బానిసగా బ్రతికే కంటే ధైర్యంగా ముందుకే కదలాలి. అందుకే ఈ సమాజానికి నేను భయపడను! నన్ను ఆపకమ్మా" ఆవేశంగా సూట్‌కేస్ చేతిలోకి తీసికొంది సుధ.

# మునలివాని ప్రేమలేఖ

బి.హెచ్. కామేశ్వరరావు, మద్రాసు

శ్రీ యమగు భార్య సన్నిధికి ప్రేమగ నీ పతి వ్రాయు లేఖ, ఆ
దయగల దైవమే మనల దారుణరీతిని వేరు జేసె, ఈ వయసున
నొంటిగా బ్రతుకుభారము నీడ్చుట కష్టమే సుమీ!
అయినను నీదు జ్ఞాపకములందున కాలము నెట్టుచుంటిలే

చూచి యేండ్లు దాటె నీచిన్న కొడుకుని
పక్షమయ్యె పెద్దవాని గలసి
ఎవరి బ్రతుకు వారి దీతండ్రి కోసమై
సమయమీయ నెవరి సాధ్యమగును!

కన్నకొడుకులు నన్నింత కనికరించి
వృద్ధ శరణాలయమ్మున వేసినారు
నెలకి చెరి ఐదువందల నిచ్చుచుండి
రింతయైనను చేయువారెంతమంది?

ఐన నదేమొగాని హృదయమ్మున నొక్క విషాదరేఖ, దుః
ఖానల తప్తమైనటుల ఆత్మ దహింపగసాగె, గుండెలో
యే నరమో కలుక్కుమను నే గత జీవిత జ్ఞాపకమ్ములో
మానస వీధిలో నిలిచి మాటికి మాటికి గేలిసేయగా!

ప్రక్కచూపులు చూడ పసిగట్టి ఒక మొట్టి
కాయను నెత్తిపై వేయు చేయి
గోరుచుట్టైనప్పు కొసరి గోర్ముద్దలు
ప్రేమ మీరగ తినిపించు చేయి
పొలమారినంతనె తలచెనెవరొ యంచు
తలపైని పలుమార్లు తట్టు చేయి
నడిరేయి దడబుట్టి తడబాటుతో లేచి
నప్పుడు గుండెల నద్దు చేయి

పట్టి వీడననుచు నొట్టు పెట్టిన చేయి
పట్టు దప్పె, బ్రతుకు వట్టి పోయె!
ఒక్క చేయి రాదె ఓదార్పు నీయగా
మోడులేమొ! యెదలు బీడులేమొ

నీడవైన నీవె నను వీడినావు
ఆదరింతురె నన్నింక ఐనవారు?
కట్టె ముట్టించుటకె వేచె కన్న కొడుకు
లయ్యయో యేల జీవిత మారిపోదు!

ప్రతి ఉదయము సూర్యుడు నను,
'బ్రతికే ఉన్నావ!' అనుచు ప్రశ్నించినటుల్
మతి దోచును! సతి వీడిన
పతి జీవన్మృతుడు శుష్కవాక్యము రీతిన్

ఇచట నావంటి వారలనేకమంది
యంత్ర జీవితమనెడి బకాసురునకు
కన్న బిడ్డల బలిజేసి ఖిన్నులగుచు
మూగ మనసుల రోదించు ముసలి వారు

ఆదివారము అనుమతింతురు అతిథిజనులను లోనికిన్
ఎదురుజూతుము, ఎదురుజూతుము ఎదురుజూతుము ఆశతో
చెదరిపోవును ఆశ కాటుక చీకటుల్ చెలరేగగా
ముదిమి మనసుల మరలమరలిటుమోసపుచ్చుట న్యాయమే?

కాటికి కాలుసాచియు నకారణ మీ మమకార బంధముల్
ఏటికి సెప్పు? కాని మనసే వినదాయెను, నాది నాదనున్
పూటకి పూట కష్టమయి పోయెను లోకపు చీకటింట యీ
నాటక మింక చాలు, తుది నా గదితల్పులు తట్టుటెన్నడో?

వెతలు వెళ్ళగ్రక్కి వేదన రగిలించ
వేడ్క కాదు, కాని వెఱ్ఱిమనసు
ఊరుకోదు! బాధ నోరార జెప్పగా
నెవరు గలరు నాకు నీవు తప్ప ?

ఇప్పటికే నా బాధలు
చెప్పీ చెప్పీ మనస్సు చెడగొట్టితినా!
చప్పున నిక ముగియించక
తప్పదు.... మరి సెలవు.
నీ సదా హృదయశ్రీ

## చిన్న పువ్వు

మంతా జ్యోత్స్న, అమెరికా

కురిసే ప్రతి వర్షపు చినుకులోనూ
నీ ప్రతిబింబమే నాకు కనిపిస్తోంది
చిరుగాలి రూపంలో స్పృశించేదీ
నీ అమృత హస్తమేననీ తెలుస్తోంది

ఒకరోజు ఈ దేహం
తన అలంకారాలన్నీ విసర్జించి
ఒక చిన్ని పువ్వులా
నీ పాదాల చెంత చేరుతుంది

వానబొట్టు
తన ఆల్చిప్పని
వెతుక్కుంటుంది.

# ఆ నలుగురు

సోమంచి రామం, మచిలీపట్నం

అనుకోకుండా కాశీ ప్రయాణం తగిలింది జగన్నాథం గారికి ఆయనకైతే ఆ ప్రయాణం ఇష్టంలేదు ! అంటే, కాశీకెళ్లడం ఇష్టం లేదని కాదు.

ఈ టైములో అంత దూరం ప్రయాణం పెట్టుకోవటం ఆయనకు నచ్చలేదు అందుకు కారణం వేరే ఏమీ లేదు. –ఆయన టీచరుగా పనిచేసి రిటైరయ్యారు అప్పుడు వచ్చిన పైకంతోనే ఇల్లు కట్టుకున్నారు ఈ మధ్యే! అంచేత చేతిలో అంతగా పైకం అడడంలేదు ప్రస్తుతం ఆ వచ్చే పెన్షనుతోనే గుట్టుగా కాలక్షేపం చేస్తున్నారు.

సర్వీసులో ఉండగానే, ఆడపిల్లల పెళ్లిళ్లు, అబ్బాయి పెళ్లి – అన్నీ పూర్తిచేసేశారు. అప్పట్లోనే కొన్న స్థలమొకటి మాత్రం మిగిలి ఉంది. దాన్నమ్మేస్తే నాలుగు డబ్బులు చేతికొస్తాయని ఆయన ఆశ. అప్పుడు మొక్కుబడిగా కాకుండా, హాయిగా, తీరుబడిగా అన్ని పుణ్యక్షేత్రాలు చూడచ్చునని ఆయన భావన! కానీ, భార్యధోరణి అలా లేదే! కాస్త కాలు చెయ్యి కదిల్చే ఓపికుండగానే కాశీ, రామేశ్వరాలు చూసి రావాలని అవిడగారి అభిలాష, ఆకాంక్ష! అందుకని భార్య మాటకెదురు చెప్పలేకపోయారు. అసలా మాటకొస్తే ఎంత వయసొస్తే మాత్రం – ఏ మగాడు భార్య మాటకెదురు చెప్పగలడు? అందుకనే – ఆయనందుకు తలొంచేశాడు. ఆవిడగారి కోరిక మేరకే కాశీ చేరాడు. అక్కడ గంగాస్నానం, విశ్వేశ్వరుని సందర్శనంతోపాటు కాలభైరవుడ్ని కూడా చూసి, తిరుగు ప్రయాణం ప్రారంభించారు. అదిగో ఆ తిరుగు ప్రయాణం తాలూకు కథా కమామిషు ఇది !

కాశీ నుంచే బయలుదేరే గంగా – కావేరి ఎక్స్‌ప్రెస్ ట్రెయిన్‌లో జగన్నాథం దంపతులకు చెరొక బెర్తు దొరికాయి. జగన్నాథం గారికేమో త్రీ టైర్‌లో అప్పర్ బెర్తు. ఆయన భార్యకేమో సైడులో లోయర్ బెర్తు వచ్చాయి. వారణాశిలో ట్రెన్ ప్లాట్‌ఫారమ్‌మీద కొచ్చేసరికే పావుగంట లేటయింది. బోగీ నంబరు ఎస్.ఫోర్. చూసుకుని దంపతులిద్దరూ ట్రెనెక్కారు. సైడు లోయర్ బెర్తుమీద అప్పటికే ఓ పంజాబీ యువకుడు కూర్చుని ఉన్నాడు. మనిషి ఆజానుబాహుడు. 6 అడుగుల 3 అంగుళాలు ఎత్తుంటాడు. గుండ్రని ముఖం. ఒత్తయిన జుట్టు. లేడీ కారెక్టర్ వేయిస్తే అలనాటి స్థానంవారిలా అచ్చం ఆడపిల్లలా ఉంటాడు. హిందూ కల్చర్‌పై పి. హెచ్‌డి. చేస్తున్నాడట. మద్రాసుకు ప్రయాణం. తనకు ఎలాటయిన సైడు అప్పర్ బెర్తుకేసి. తనకేసి చూసుకుంటున్నాడు. పదే పదే ! జగన్నాథంగారు అతని మనోభావాల్ని పసిగట్టేశాడు! ఎంతైనా రిటైర్డ్ టీచరు కదా! కానీ అతనితో ఏ భాషలో మాట్లాడాలో తెలియక కాస్త తటపటాయించారు. చివరకు ధైర్యం చేసి – "ఇఫ్ యు డోంట్‌మైండ్ .. ఆఫ్ ఉస్ అప్పర్ బెర్తు.. " అంటూ ఆ తర్వాత ఏమనాలో తోచక, మూకాభినయంతో తన భావాన్ని అతనికి అందచేశారు.

ఆ యువకుడికి అర్థమయింది. అతని కళ్లల్లో ఆనందం తొంగి చూసింది. "ష్యూర్! ష్యూర్!" అంటూ తన బాగేజి తీసుకుని చెంగుమంటూ అప్పర్ బెర్తు ఎక్కేశాడు. 'హమ్మయ్య!' అనుకుంటూ హాయిగా ఊపిరి పీల్చారు జగన్నాథంగారు.

అసలిలాంటి దూరప్రయాణాలు చేసేటప్పుడు – అందులోనూ భార్యభర్తలిద్దరే (ముసలాళ్లయినా సరే) ప్రయాణం చేసేప్పుడు వాళ్లిద్దరికీ తప్పనిసరిగా సైడు బెర్తులు రెండూ కేటాయించాలని ఆయన చిరకాల వాంఛ! అవసరమైతే 'రిజర్వేషన్ ఫర్ లేడీస్' అని బస్సుల్లో సీట్ల వెనుక రాసినట్లు. ఈ సైడు బెర్తులమీద 'రిజర్వేషన్ ఫర్ కపుల్ వితౌట్ చిల్డ్రన్' అని రైల్వే వాళ్లు ఓ రూలు పాస్‌చేయాలని ఆయన ఐడియా. ఏమైతేనేం, ఆయనగారి కోర్కె ఈనాటికి ఈడేరింది. అందుకనే ఆనందంగా ఆ సైడు లోయర్ బెర్తుమీద భార్యాభర్తలిద్దరూ ఒకరికెదురుగా ఒకరు కూర్చున్నారు. అప్పటికే ట్రెయిను వారణాశిని వదిలేసి అర్ధగంట దాటింది. టైము అరున్నరయింది. ప్రయాణీకులందరూ సామాన్లు సర్దుకుని స్థిమితపడుతున్నారు. అదిగో అప్పుడు చూశారు జగన్నాథంగారు ఓ ముస్లిం దాదాని రెండు లోయర్ బెర్తుల మధ్య ఓ చిన్న జంపఖానా పరుస్తున్నాడు అతను. నమాజు చేయడానికి సిద్ధమవుతున్నాడు. అతనికి ఇబ్బంది. కలగకుండా తక్కిన ప్రయాణికులు పక్కకి సర్దుకుంటున్నారు. మళ్లీ దృష్టి మళ్లించుకున్నారు జగన్నాథంగారు. ఎదురుగా కూర్చున్న భార్యతో కబుర్లు మొదలెట్టారు. ఎన్నెన్ని ఊసులాడుకున్నారో! మధ్య మధ్యలో టిఫిను తినడం. జోకులేసుకోవడం – ఎన్నెన్నో సంగతులు చెప్పుకున్నారు. పెళ్లయిన తొలిరోజుల తహతహలు, కాపరానికొచ్చిన కొత్తలో కవ్వింపులు, ముచ్చట్లు, మధురోహాలు అన్నీ నెమరేసుకోగాసాగారిద్దరూ! పెళ్లినాటి సాయంకాలం ముత్తయిదువలు అందరూ చేరి ఆడించిన బంతులాట వేడుక గుర్తొచ్చింది. ఇద్దరూ ఒకేసారి పగలబడి నవ్వుకున్నారు. అలా మధురస్మృతులను నెమరేసుకుంటూ ఆనందలోకంలో విహరిస్తుంటే టైమెంత గడిచిందో వాళ్లకే తెలియలేదు. తీరా ఈ లోకంలోకి వచ్చినట్లుగా, పక్కలకు చూస్తే – అప్పుడే చాలా మంది పక్కలేసుకుని నిద్రకుపక్ర మించేస్తున్నారు. అప్పటికి టైము రాత్రి 11.30 గంటలయింది. భార్యను లోయర్ బెర్తుమీద పడుకోబెట్టి, పై బెర్తు ఎక్కారు జగన్నాథంగారు, వీళ్ల బెర్తులకు రెండు మూడు బెర్తుల అవల ఎవరున్నారో తెలీదుగాని, రాత్రంతా ఎవరెవరో కొంతమంది అక్కడకు వెళ్లడం, అటూ ఇటూ తిరగడం జగన్నాథం చూస్తూనే ఉన్నారు. అక్కడేం జరుగుతోందో చూడాలన్న ఆసక్తి కలిగినా, బెర్తుదిగి, చూసివచ్చి, మళ్లీ బెర్తు ఎక్కే ఓపిక లేక నిద్రకుపక్రమించాడాయన.

❖ ❖ ❖

"అమ్మో .. .ఎన్నా ! ... మామ ...! నాన్ హేండ్ బాగ్ ఇక్కడదా పూడిస్తిని! వేరే హౌజ్ ఇట్ గాన్? సమ్‌బడీ హేజ్‌స్టోలెన్!" అంటూ. బావురుమంటూ అరువులు, ఏడువులు వినపడేసరికి అందరూ గబగబా లేచేశారు. లైట్లన్నీ వేశారు. జగన్నాథంగారి బెర్తు పక్క బెర్తుల్లో మద్రాసు వెడుతున్న ఆరుగురు తమిళ కుటుంబీకుల గందరగోళమది. వాళ్లల్లో వాళ్లే గొడవపడుతున్నారు. అంతా కంగాళీమేళంగా ఉంది. అరవంలోనూ, మధ్యమధ్య ఇంగ్లీషులోనూ తర్జన భర్జనలు, ఏడుపులు... బోగీ బోగీ అంతా కదలివచ్చింది వాళ్లదగ్గరకు! జగన్నాథంగారికి విషయం అర్థమయింది. ఓ తమిళ తంబిది హేండ్ బేగ్ ఎవరో



తాను మొలకవేసిపెంచిన

కృష్ణా జిల్లా రచయితల సంఘం

నిర్వహిస్తున్న సభలను

దివిజ కవివరులతో కలిసి

వీక్షిస్తోన్న

మా నాన్న గారు -

కృష్ణాజిల్లా రచయితల సంఘం

వ్యవస్థాపక అధ్యక్షులు,

శ్రీ ముక్కామల నాగభూషణం గారి

దివ్యస్మృతులతో....



డా॥ యన్. ప్రతిభ

విశ్రాంత ఆచార్యులు

ఆంధ్ర విశ్వవిద్యాలయం

విశాఖపట్నం

కొట్టేశారట ! అందులో ఆయన డైరీ, స్పెక్ట్స్, వాళ్లావిడ స్పెక్ట్స్ బ్రీఫ్‌కేస్ కీస్, ట్రెయిన్ రిజర్వేషన్ టిక్కెట్లు ఉన్నాయట!

"వాట్ యామై టు డు నౌ? హౌ కెన్ ఐ రీచ్ మద్రాస్?" అంటూ చంటిపిల్లాడిలా ఒకటే ఏడుపు. ఈలోగా ఇద్దరు లేడీస్ వాళ్ల హేండ్ బాగ్‌లు ఓపెన్‌చేసి ఉన్నాయంటూ కెవ్వుమని అరిచారు. వాటిల్లో కాష్ – అయిదారు వందలదాకా పోయిందిట! ఈ దొంగతనం ఎలా జరిగిందంటే ఎలా జరిగిందని తర్జన భర్జనలు పద్దారంతా! కాటరింగ్ వాళ్లు కాకుండా ఎవడో కుర్రాడు మధ్యలో చాయ్ తెచ్చాడు. వాడి పనే ఇదని అంతా తేల్చేశారు. ఏమైతేనేం ? ఈ గందరగోళ మంతా సర్దుమణిగేసరికి సూర్యోదయమయింది. చేసేదేం లేక అందరూ లేచి ముఖాలు కడుక్కున్నారు. కాఫీలు తాగారు. కేటరింగు వాళ్లు మద్రాసు వాళ్లే కావడంచేత, వాళ్లతో తమకొచ్చిన కష్టం అంతా చెప్పుకున్నారు.

ఈ హడావుడిలో తన సామానేమన్నా పోయిందోనని, జగన్నాథంగారు సీటుకింద పెట్టిన సామానంతా సరిచూసుకున్నారు. అదృష్టవశాత్తు ఏం చెక్కుచెదరలేదు. ఇంతలో బ్రేక్‌పాస్టు వచ్చింది. కావాల్సినవాళ్లు తీసుకున్నారు. క్రమంగా మళ్లీ అంతా కబుర్లలోకి దిగారు. తమిళ తంబులు, ముస్లిం దాదా, పంజాబీ యువకుడు, ఓ కేరళ క్రిస్టియను – అంతా చేరి సంభాషణ ప్రారంభించారు. రైలు ప్రయాణాలు, రిజర్వేషన్లు అందులో అవకతవకలు, రిజర్వ్‌డ్ బోగీల్లోకి ఇతరుల ప్రవేశం, దొంగతనాలు, ప్రభుత్వ అసమర్థత గురించి ఎవరి అభిప్రాయాలు వాళ్లు ఏకధాటిగా చెప్పేస్తున్నారు. ఆ అభిప్రాయాలతో పాటు తమతమ అనుభవాల్ని కూడా జోడించి మరీ కథలు కథలుగా చెప్పేస్తున్నారు. దేశంలో నీతి నియమాలు నశించిపోయాయన్నారు. స్వతంత్రం రాకముందే దేశం ఎంతో బాగుండేదని, దేశవిభజనతోనే సమస్యలు పుట్టుకొచ్చాయని, అసలు దేశ విభజనకు ముస్లిములే కారకులని, బాబ్రీ మసీదు ధ్వంసానికి హిందువులే కారణమని.. ఇలా ఒకదాంట్లోంచి ఇంకోదాన్లోకి సంభాషణ దారితప్పింది. దాంతో వాళ్లలో వాళ్లకి ఆవేశకావేశాలు పెరిగాయి. కొట్టుకుంటారేమోనన్నంత తారా స్థాయిలోకి మారింది వాతావరణం.

జగన్నాథంగారికక్కడ, నోరు విప్పి తన భావాలు చెప్పాలనిపించింది. ఎక్కడ చూసినా, ఈనాడు ప్రజల్లో బాధ్యతా రాహిత్యం, సోమరితనం, నిర్లిప్తత పెచ్చు పెరిగిపోతున్నాయని, అలనాటి రాజకీయ స్వాతంత్ర్యోద్యమంలా ఈనాడు మానసిక సంస్కరణోద్యమంలాంటిదేదైనా వస్తే కానీ, దేశం బాగుపడదని చెప్పాలనుకున్నారు. కానీ వాళ్లు మాట్లాడే భాషల్లో తనకు తెలిసిందల్లా ఒక్క ఇంగ్లీషే ఆ ఇంగ్లీషే నా వాళ్లు మాట్లాడుతుంటే, భావం అర్థమవుతోంది కానీ, వాక్యనిర్మాణంలోనూ, గ్రామరులోనూ అంతా తప్పుల తడికే! జగన్నాథంగారు ఓల్డ్ మెట్రిక్యులేట్! ఎప్పుడో స్వతంత్రం రాకముందు 1946లో మెట్రిక్యులేషన్ పాసయ్యారు. ఆ రోజుల్లో ఆయన తాతగారు ఆయనచేత రెన్ అండ్ మార్టిన్ గ్రామరును ఔపోసన పట్టించారు. ఆ పుస్తకంలో ఏ పేజీలో ఎక్సర్‌సైజయినా ఒక్క తప్పు లేకుండా చేయగలిగిన సామర్థ్యం సంపాదించాడాయన. అందంతా వాళ్ల తాతగారు పెట్టిన భిక్షని ఇప్పటికీ వినయంగా చెప్పుకుంటారు. అలాంటి జగన్నాథంగారు, తప్పొప్పులతో వాళ్లంతా సంభాషిస్తున్న ఆ ఆంగ్లాన్ని సహించలేక, వాళ్లతో సమానం కాలేక మాట్లాడే ప్రయత్నం విరమించుకుని, కేవలం శ్రోతగానే ఉండిపోయాడు. వాళ్ల వాదోపవాదాలు వింటుంటే మాత్రం ఆయనకెంతో ఆనందం కలిగింది. ఎవరి భాషలో వాళ్లు మాట్లాడినా, తప్పనిసరి పరిస్థితుల్లో అంతా ఇంగ్లీషులోనే అర్థమయ్యేలా చెప్పుకోసాగారు. మనదేశంలో ఎన్ని భాషలున్నా, సంధానకర్తగా వ్యవహారాలనన్నిటినీ నడిపిస్తున్నది ఈనాటికీ ఆంగ్లభాషే! అదే ఆశ్చర్యం! ఈ విషయంలో జగన్నాథంగారికి ఓ పక్క ఆనందంగానూ ఉంది. ఆంగ్లేయులు మనల్ని వదలి ఏళ్లు గడిచిపోతున్నా ఇంకా ఈ ఆంగ్లభాషవాసన పోలేదేమని ఓ పక్క బాధగానూ ఉంది. అంతేకాదు. ఆయన్ని ఆశ్చర్యపరిచిన విషయం ఇంకోటి ఉంది. తమిళ సోదరులు అరవంలోను, ముస్లిందాదా ఉర్దూలోను, కేరళైట్ మళయాళంలోను, పంజాబీ యువకుడు పంజాబీ లేక హిందీలోనూ మాట్లాడుతున్నా, మన తెలుగాయన ఒకరు మాత్రం ఇంగ్లీషులోనే దంచేస్తున్నాడు సంభాషణంతా! మధ్య మధ్యలో ఆయనకూ పౌరుషమొచ్చింది కాబోలు ! యూ హౌమచ్ అంటే, య్యై హౌమచ్ అన్నట్లుగా తమిళతంబితో వాగ్యుద్ధానికి దిగాడు.

ఆహా ! భరతదేశమా! ఇదే కదా నీ ప్రత్యేకత! ఇన్ని జాతులవాళ్లను, ఇన్ని మతాలవాళ్లను, ఇన్ని భాషల వాళ్లను – వీళ్లందర్ని నీవెంత సహనంతో భరిస్తున్నావో కదా! నిజంగా ధన్యురాలివమ్మా నీవు, భరతమాతా! అని మనసులో అనుకున్నాడాయన.

ఈ గొడవిక్కడిలా జరుగుతూండగానే, రెండు మూడు బెర్తుల అవతల జనం సందడి పెరిగింది. ఏమిటి ఏమిటన్నట్లు ఈ బృందమంతా అక్కడకు చేరారు. ఈ సారి జగన్నాథంగారు కూడా అక్కడికెళ్లారు. ఓ తల్లి ఒళ్లో ఓ పదేళ్ల కుర్రాడు పడుకుని ఉన్నాడు. రాత్రి నుండి ఆ కుర్రాడికి వాంతులు అవుతున్నాయట! ఆ తండ్రి బిక్కమొహంతో పక్కనే ఉన్నాడు. వాళ్లు కేరళ రాష్ట్రానికి చెందిన క్రిస్టియన్లు. ఆ పక్కబోగీలో వాళ్లకు తెలిసిన వాళ్లెవరో ఉంటే వచ్చి చూస్తున్నారు. అందులో ఒకమ్మాయి నర్సు ట్రెయినింగయిందిట. పిల్లాడ్ని చూసింది. తన హేండ్ బాగ్‌లోంచి ఓ మాత్ర తీసి వేసింది. మళ్లీ వాంతయిపోయింది. ఏదిచ్చినప్పటికీ వాంతయిపోతోంది. వాంతులు ఆగడంలేదు. పిల్లాడు నీరసించిపోతున్నాడు. ఏం చేయాలో ఎవరికీ ఏమీ తోచడంలేదు. అంతా ప్రేక్షకుల్లా చూస్తూండడమే తప్ప, ఎరికీ ఏమీ పాలుపోవడంలేదు. దీనికి తోడు క్రమంగా ఎండ తీవ్రత పెరిగింది. పిల్లాడి ఒంటికి వేడొచ్చింది. అంతా కంగారు కంగారుగా ఉంది పరిస్థితి! ఈ లోగా ఎవరో వెళ్లి, నాలుగైదు బోగీలు దాటుకుంటూ వాకబు చేయగా, ఎవరో ఒక డాక్టరుగారు అదే ట్రెయిన్‌లో ప్రయాణం చేస్తున్నట్లు తెలుసుకున్నారు. ఆయన్ను తీసుకొచ్చారు. తన దగ్గరున్న మెడికల్ కిట్ సహాయంతో ఆయన పిల్లాడ్ని టెస్ట్ చేశాడు. వెంటనే ఏదో ఇంజక్షనుంటే చేశాడు. పిల్లాడింకా నీరసించిపోతున్నాడు. సెలైన్ ఎక్కించాల్సిందేనన్నాడు డాక్టరు. ఈసారి ట్రెయిన్ ఆగగానే స్టేషన్‌లో సెలైన్ కోసం ప్రయత్నిద్దామన్నాడాయనే ! పక్కబోగీలోకెళ్లి ఎవరి దగ్గరో ఉంటే గ్లూకోజు, ఎలక్ట్రాల్ తీసుకొచ్చి ఇచ్చారు. కానీ వాంతి అయిపోయింది.

అంతవరకు వాగ్యుద్ధం చేసిన తమిళ, కేరళ, పంజాబీ, ముస్లిం పాసెంజర్లు ముందుకొచ్చి తలో సపర్యచేయసాగారు. ఆ తల్లిదండ్రులకు

ఆ పిల్లాడు ఒక్కడే కొడుకుట! మధ్య తరగతి సంసారం. టిక్కెట్లు కొన్నాక దారి ఖర్చులకు రెండు మూడు వందలుంచుకున్నాడట. అసలే కంగారు. దానికితోడు చేతిలో పైకం తక్కువగా ఉండెనని బాధ! కళ్లల్లో భయం, కాళ్లల్లో వణుకు ప్రారంభమయ్యాయి ఆ తండ్రికి! తన దీనావస్థ చెప్పుకున్నాడు. ఇక ఆ తల్లి ఆవేదనకు, ఆక్రందనకు అంతే లేదు. తోటి ప్రయాణీకులంతా ధైర్యం చెప్పడం మొదలెట్టారు. డాక్టరుగారు దగ్గరే ఉండి ఎప్పటికప్పుడు పల్స్ చూస్తూనే ఉన్నాడు. ఆయన ముఖంలోనూ ఆందోళన కనిపిస్తోంది. రైలు ఎంత వేగంగా పరుగెత్తినా టైము గడుస్తున్నట్లనిపించడంలేదు. క్షణమొక యుగంలా ఉంది అందరికీ. ఏం చేయాలన్నా, ఏం కావాలన్నా, ఏ స్టేషనన్నా రావాలి కదా! రైలు ఆగాలి కదా! పైగా ఇలాంటప్పుడు దండిగా డబ్బుండాలి కదా! ఆ తండ్రి బాధ అది. అప్పటికి టైము పన్నెండు గంటలయింది. తమిళ తంబి కళ్లు మూసుకుని మురుగా! మురుగా! కాపాడు మురుగా! అన్నట్లు ఏదో అస్పష్టంగా గొణుగుతున్నాడు. ముస్లిం దాదా నమాజుకోసం టైము చూస్తున్నాడు. మళ్లా బెర్తులమధ్య బెడ్‌షీట్ పరిచి సిద్ధం చేసుకుంటున్నాడు. ఈలోగా కేరళ క్రిస్టియన్లు కుడిచేత్తో నుదుటిమీద, రొమ్ములమీద తాకుతూ, కళ్లు మూసుకుని ప్రభువును ప్రార్థిస్తున్నారు. పరిశుద్ధగ్రంథం బైబిలులోని వాక్యాలు చదువుకుంటున్నారు! అందరి మనసుల్లోను, ముఖాల్లోను బిడ్డ ఆరోగ్యం గురించిన ఆందోళనే స్పష్టంగా కనిపిస్తోంది.

ఈ బిడ్డ పరిస్థితి డ్రైవరుక్కూడా తెలిసిందన్నట్లుగాను, దాంతో ట్రైనును వేగం పెంచాడన్నట్లుగాను రైలు మరింత వేగం పుంజుకుంది. దాదాపు మధ్యాహ్నం ఒంటిగంటకావస్తోంది.

"నాగపూరొచ్చేస్తోంది! ఎవరైనా దిగి గబగబా వెళ్లి దగ్గర్లో ఉండే డిస్పెన్సరీ నుంచి నాలుగు సెలైన్ బాటిల్సు, ఇంజక్షన్లు, ఈ టాబ్లెట్లు పట్రావాలి! సెలైన్ ఎక్కిస్తేనే కానీ ఏమీ చెప్పలేను!" అంటూ చీటీ రాసిచ్చాడు డాక్టరు. ఆ చీటీనందుకుని ఆ తండ్రి బావురుమన్నాడు.

"డోంట్ వర్రీ మాన్! డోండ్ వర్రీ! వియ్‌షల్ బ్రింగ్ దెమ్"! అంటూ పర్సులోంచి ఓ హండ్రెడ్ రుపీస్ నోట్ తీస్తూ ఆ చీటీని అందుకున్నాడు. హేండ్ బాగ్ పోగొట్టుకున్న తమిళ తంబి. దాన్ని చూడగానే పంజాబీ యువకుడు తన జీన్స్ బాక్ పాకెట్‌లోంచి ఓ వంద కాగితం తీసిచ్చాడు. ముస్లిం దాదా తన షర్వాణీలోంచి గుడ్డసంచీ మూట తీసి పది కాగితాలు ఓ పది ఇస్తూ, "అల్లా! యే బేటాకో బచావో!" అంటూ గబగబా నమాజు చేసుకునేందుకు వెళ్లబోయి ఆగాడు.

"ఏడుకొండలవాడా! వెంకటరమణా! పసివాడి ప్రాణాలు కాపాడు తండ్రీ!" అని మనసులో అనుకుంటూ జగన్నాథంగారి భార్య తన రింగుకున్న వేంకటేశ్వరస్వామిని కళ్లకద్దుకుంది. ఇంతలో ట్రెయిన్ వేగం క్రమంగా తగ్గసాగింది. కొద్దిసెకన్లలో నాగపూర్ స్టేషనులో ట్రెయిను ఆగింది అంతే! ఆ చీటీ పుచ్చుకుని ఆ నలుగురు పాసెంజర్లు బండి దిగారు. గబగబా పరుగెట్టుకుంటూ గార్డు దగ్గరకెళ్లారు. ఏదో మాట్లాడారు. గార్డు ప్లాట్‌ఫారమ్‌మీద దూరంగా చూపిస్తూ సౌంజ్ఞ చేస్తూ ఏదో సలహా ఇచ్చాడు. ప్లాట్‌ఫారమ్ జనంతో క్రిక్కిరిసిపోయి ఉంది. ఆ నలుగురూ గార్డు చెప్పినవైపుకు పరుగెత్తసాగారు. అంతవరకే చూడగలిగారు. జగన్నాథం. అంతే! ఆ పైన ఆ నలుగురు ఆ జనంలో కలిసిపోయారు.

క్షణాలు గడుస్తున్నాయి. నిముషాలు గడుస్తున్నాయి. నాగపూర్‌లో ట్రెయిన్ ఆగేది ఇరవై నిముషాలే! అప్పుడే పదిహేను నిముషాలు గడిచిపోయాయి. అయిదారొంద లుచ్చుకుని మందులకోసం వెళ్లిన ఆ నలుగురు ఎక్కడ తిరుగుతున్నారో ? తీరా వాళ్లు రాకుండా ట్రెయిను కదిలిపోతే ... అమ్మో! ఇంకేమన్నా ఉందా? జగన్నాథంగారికి భయం! అదే జరిగితే పసివాడి ప్రాణం. వాళ్ల ప్రయాణం అంతా అస్తవ్యస్తమే! గడియారంలోని సెకన్ల ముల్లు, నిముషాల ముల్లు పోటీ పడుతున్నాయి. గార్డు కూడా ఆత్రుతగా, అసహనంగా చూస్తున్నాడు వాళ్లకోసం, వాళ్ల జాడ కనపడ్డంలేదు. అసలా జనసమ్మర్థంలో మనుషుల్ని గుర్తుపట్టడం సాధ్యమా! పిల్లాడి తల్లిదండ్రులకన్నా, జగన్నాథంగారి గుండెలు గబగబ కొట్టుకోసాగాయి. అసలాయన తత్వమే అంత! ఎవరైనా బాధపడుతున్నా, బాధల్లో ఉన్నా ఆయన చూడలేడు. విలవిల్లాడిపోతాడు. ఈ లోగా గార్డు విజిల్ వేశాడు చేసేదేమీ లేక! ఆకుపచ్చ జెండా కూడా ఊపుతున్నాడు. జగన్నాథంగారు టైము చూశాడు. అప్పటికే రైలాగి ముప్పై నిముషాలు గడిచాయి. ట్రెయిన్ నెమ్మదిగా స్టార్టయింది క్రమంగా వేగం పుంజుకుంటోంది. అందరి కళ్లూ ఆ నలుగురికోసమే ఎదురు చూస్తున్నాయి. తమిళతంబి ఫామిలీ లబోదిబోమంటూ గోలగోల చేయడం మొదలుపెట్టింది.

"పుల్ దచైయిన్! స్టాప్ ద ట్రెయిన్!" అంటూ అరుస్తున్నారు వాళ్లల్లో ఒకరు.

ఈ లోగా పంజాబీ యువకుడు సెలైన్ బాటిలుతో రొప్పుకుంటూ పక్కబోగీలోంచి ప్రత్యక్షమయ్యాడు! అందరి కళ్లూ ఆశ్చర్యంతోనూ, ఆనందంతోనూ మిలమిలలాడాయి. డాక్టరు క్షణం వృథా చేయకుండా సెలైన్ ఎక్కించేందుకు ఏర్పాట్లు మొదలెట్టాడు. అప్పటికే పల్స్ బాగా పడిపోయింది. తక్కినవాళ్ల సాయంతో క్షణాలమీద సెలైన్ బాటిలు ఎరేంజ్‌మెంటు జరిగింది.

"వేరీజ్ మై కజిన్?" అంటూ తమిళతంబి గురించి అడగటం మొదలైంది. ఈలోగా మిగిలిన ఆ ముగ్గురూ కూడా బోగీలు దాటుకుంటూ అక్కడికి చేరారు. కావల్సిన మందులు, సెలైన్ బాటిల్సు అన్నీ తెచ్చారు. గార్డు విజిల్ వేసేసరికి వాళ్లు ప్లాట్‌ఫారమ్ మీదకొచ్చారుట. వెంటనే ఆలస్యం చేయకుండా ఎదురుగా ఉన్న బోగీలో ఎక్కేసి, బోగీలు దాటుకుంటూ వచ్చారట, అదీ సంగతీ! "హమ్మయ్య!" అంటూ అందరూ ఒక్కసారి ఊపిరిపీల్చుకున్నారు.

నెమ్మది నెమ్మదిగా పిల్లాడి బాడీలోకి సెలైన్ ఎక్కడం మొదలైంది.

"ఇంకేం ఫర్వాలేదు!" అన్నట్లు విజయగర్వం తొణికిసలాడు తున్నట్లుంది డాక్టరుగారి ముఖం, కాస్త వికసించి. ఆ తల్లితండ్రులిద్దరూ దీనంగా అందరి ముఖాలకేసి మార్చి మార్చి చూస్తున్నారు. అంతకన్నా ఆ పరిస్థితిలో ఏం చేయలేక!

"ఏం పర్వాలేదు, గండం గడిచిపోయింది" అన్నట్లు అంతా కళ్లతోనే వాళ్లకి ధైర్యం చెప్పుతున్నారు. ఆ తల్లి అందరికీ నమస్కారాలు పెట్టేస్తోంది.

ఇంతలో ముస్లిం దాదా నమాజుకెళ్లిపోయాడు. పిల్లాడి ముఖం చూశాక ఆనందంతో నమాజుకు ముందే దోసిలి పట్టినట్టు అల్లాకు అభినందనలు చెప్పుకున్నాడు. నమాజుకుపక్రమించాడు.

మరో పాసెంజరు – సాయిబాబా భక్తురాలు. సంచిలోంచి బాబా ప్రసాదం, విబూది తీసి పిల్లాడి నుదుటిమీద పెట్టింది. అప్పటికే లంచ్ టైమవడంతో లంచ్ సర్వ్ చేస్తున్నారు. కేటరింగ్ వాళ్లు, ఆర్డరిచ్చిన వాళ్లు లంచ్ తీసుకుంటుంటే, తక్కినవాళ్లు ఏదో టిఫినులాంటిది తింటున్నారు. ఆ పిల్లాడి తల్లిదండ్రులు అంతవరకు ఏమీ నోట్లో పెట్టుకోలేదు. అందరూ బలవంతం చేసి వాళ్లచేత టిఫిను చేయించారు. ఓ గంట గడిచేసరికి పిల్లాడిలో కొంచెం కదలిక కనపడింది. డాక్టరుగారి ముఖంలో మరింత ప్రకాశవంతమైన చిరునవ్వు కనిపించింది. దాంతో అక్కడ చేరినవాళ్లంతా ఒక్కొక్కళ్లే నెమ్మదిగా తమతమ బెర్తులు కెళ్లిపోయారు.

మళ్లా యథాప్రకారం అంతా లోకాభిరామాయణంలో పడ్డారు. ప్రయాణాలు, రైలు ప్రయాణాలు, అందులోనూ దూరప్రయాణాలు, అవస్థలు.. ఇలా వివిధ విషయాలమీద సంభాషణ సాగిపోతోంది.

"పాంట్రీకారులాగే, ఇలాంటి లాంగ్ జర్నీలో ఓ కూపేలో డిస్పెన్సరీ, డాక్టరు, మందులు, కంపల్సరీగా ఉండే ఏర్పాటు చేస్తే బాగుంటుంది. దానికోసం ప్రతి టిక్కెట్టుపైన కొంత వసూలు చేయవచ్చు. ఆ సౌకర్యం ఉపయోగించుకున్న పాసెంజర్ల నుంచి ఛార్జీలు, మెడిసిన్స్ కాస్ట్ కలెక్ట్ చేయవచ్చును. ముఖ్యంగా సమ్మర్ మూడు నాలుగు నెలలు దీని అవసరం చాలా ఉంటుంది! జగన్నాథంగారి ఆలోచనలు ఇలా సాగిపోతున్నాయి.

మందులమీద, జబ్బులమీద, వైద్యసౌకర్యాలమీద చర్చలు ఇంకా జోరుగానే సాగిపోతున్నాయి పాసెంజర్లలో, టైము తెలీకుండానే గడిచిపోయిందీసారి. ట్రైను బలార్షాలో ఆగేసరికి సాయంత్రం ఆరయింది. అప్పటికి పిల్లాడు బాగా కోలుకున్నాడు. కళ్లు తెరచి చుట్టూ చూస్తున్నాడు. మళ్లీ వాంతికాలేదు.

"హల్లో బోయ్! హౌ ఆర్యూ?" అంటూ పలకరించాడు డాక్టరుగారు.

ఆ పిల్లాడు తలూపుతూ "ఫైన్సార్"! అంటూ నెమ్మదిగా, నీరసంగా పలికాడు.

అంతా కేరింతలు కొట్టినంత ఆనందంతో గంతులేయసాగారు. ఆ తల్లిదండ్రులిద్దరూ అమాంతం డాక్టరుగారి పాదాలమీద పడబోయారు. ఆయన వారించి వాళ్లను లేవదీశారు.

"డాక్టర్! యూ హేవ్ సేవ్డ్ మై చైల్డ్! హౌ కెన్ఐ పే యూ?" అంటూ కళ్లనీళ్లెట్టుకున్నాడా తండ్రి.

"డర్ న భయ్! డరో నా!.. నామ్ ఆప్కో మదత్ కర్తా హై!" అంటూ ముస్లిం దాదా ముందుకొచ్చి తన డబ్బుల సంచిలోంచి మళ్లీ చిల్లర నోట్లు తీసి ఇచ్చాడు. ఆ తల్లిదండ్రులు సిగ్గుతో కుంచించుకుపోతున్నారు. అయినా అది తప్పని పరిస్థితి.

## నవ్వుల పంట

అంధ్రుడు అంధ్రుడు, హైదరాబాద్

ఓ సారి నవ్వు...
అంతే !
కాలంతో పాటు చుక్కల్ని
లెక్కపెట్టడం ఎంత తేలికో
తెలుస్తుంది.

ఆ నవ్వులోనే మైమరపు
గుండెలో జల పాతం అంటే
ఏంటో తెలిసొస్తుంది.

మెత్తటి శాలువా కప్పుకుని
శీతా కాలం చెప్పే కబుర్లు విను
ఆ వెనకే నీ నవ్వుకు చిత్తైన
ఎండా కాలాన్ని పలకరించడానికి సిద్ధమవ్వు
అలాగే నవ్వు..
ఆపై వచ్చేది నీకు వసంత కాలమే

లాలన పాలన నీకు
ప్రకృతి నేర్పుతుంది
నీవు చేయాల్సిందల్లా
అందుకు ఇవ్వాల్సిందల్లా
నవ్వుల పంటను పండించడమే

రంగులద్దుకుంటూ
రంగంతా దిద్దుకుంటూ
ఎగురుతున్న రంగుల గాలి పటం లా నవ్వుతూవుండు
రామ చిలకలా నవ్వుతూనే ఉండు

నీ పేగు తెంచుకు వచ్చే
నీ ప్రాణానికి
నీ విచ్చే
నిండైన దీవెన
నీ నవ్వే

కూటికి గతిలేని పేదవాడు గంజి పోసి, కోటీశ్వరుని ప్రాణాలు కాపాడాల్సివచ్చినట్లుంది పరిస్థితి! విధి విలాసాలు ఇలాగే విచిత్రంగా ఉంటాయి కదా!

ఆ తండ్రి ఇల్లు చేరితే బాంకునుంచి డబ్బు తీసుకోవచ్చును. అతడేం కటిక పేదవాడు కాదు. మధ్య తరగతి వాడైనా అప్పర్ మిడిల్ క్లాసే! అయితే ఏం, ఇల్లు చేరాలిగా! అందుకనే ఆత్మాభిమానాన్ని చంపుకుని ఈ ఉదార సహాయాన్ని అందుకోక తప్పలేదు.

తోటి ప్రయాణీకులంతా ఇచ్చిన పైకంలో సగం పైగా తీసి డాక్టరు గార్కి ఇవ్వబోయాడా తండ్రి! డాక్టరు గారు ససేమిరా పుచ్చుకోనన్నాడు.

"ఇలాంటి క్రిటికల్ కండిషన్‌లో నా విద్యార్హత అనుభవం జోడించి

ఒక ప్రాణాన్ని నిలబెట్టగలిగాను. అంతే చాలు, అదే నాకు తృప్తి!" అంటూ తిరస్కరించాడు.

"ఐసా బాత్ మత్‌కరో సాబ్! ఆప్కో రూప్ మే అల్లా ఆయా! యే పైసా అల్లాకే నామ్ మే లేలో"! అన్నాడు దాదా.

"మా ప్రభువే మిమ్మల్ని మా కోసం పంపించాడు. ప్రభువే మిమ్మల్ని మా కోసం పంపించాడు. ప్రభువును నమ్ముకున్న మాకు శుభమే కలిగింది. ఇది ఫీజనుకోకండి, మా కృతజ్ఞత, సంతోషం, ఆనందం!" అంది ఆ తల్లి స్వచ్ఛమైన తెలుగులో.

"తీసుకో నాయనా, తీసుకో! ఆ ఏడుకొండలవాడే నిన్నిలా సహాయపడమన్నాడు. ఆ సామి దయ నీకెప్పుడూ తోడుంటుంది. ఆ సామికోసమైనా ఆ సొమ్ము తీసుకోవాలి!" అందో ముసలావిడ.

డాక్టరుగారు విధిలేక ఆ పైకాన్ని తీసుకున్నారు. ఈలోగా పంజాబీ యువకుడొచ్చాడు. మళ్లా కుర్రాడి నుదుటిమీద ముద్దెట్టుకున్నాడు. చిన్న క్రికెటు బాటు, బంతి ఉన్న పాకెట్ ఆ పిల్లాడికి ప్రెజెంట్ చేశాడు.

"థాంక్యూ అంకుల్!" అన్నాడు ఆ పిల్లాడు నీరసంగానే నవ్వుతూ.

వీళ్లందరిలో పెల్లుబికిన అనురాగం, ఆదరణ, ఆప్యాయత చూస్తూంటే జగన్నాథంగారి ఒళ్లు పులకరించిపోయింది. ఆయిన కళ్లవెంబడి ఆనంద భాష్పాలు జలజలా రాలిపడ్డాయి.

ఆ సమయంలో ఆ నలుగురూ నాలుగు వేదాల రూపాలుగాను, ధర్మం నాలుగు పాదాల చిహ్నాలుగాను, నాలుగు దిక్కులకు ప్రతీకలుగాను, పరిశుద్ధంగా, అతి పవిత్రంగా గోచరించసాగారు. అపత్సమయంలో ఆదుకుని ఆ బిడ్డ ప్రాణాలు కాపాడ్డానికి సహాయపడ్డ ఆ నలుగురు ధన్యులు! నిజానికి వీళ్ల పుట్టుపూర్వోత్తరాలేవో ఏ ఒక్కరికీ తెలీదు! ఎవరెక్కడ పుట్టారో, ఎక్కడ పెరిగారో ఎవరికీ తెలీదు. ఎవరేం చేస్తున్నారో, ఏం సంపాదిస్తున్నారో అసలే తెలీదు. అయినా వీళ్లందరిలోనూ ఒక్కటే కామన్ ఫాక్టర్ ఉంది. అదే భారతీయ తత్త్వం! వీళ్లంతా భారతీయులు, అదే భారతదేశపు ఔన్నత్యం! జాతులు వేరైనా, మతాలు వేరైనా, కులాలు వేరైనా, బాషలు వేరైనా - అంతా ఒకే జాతీయత! భారత జాతీయత! అంతా ఒకే ధర్మం.... సేవా ధర్మం - పరోపకార స్వభావం! ఆచార వ్యవహారాల్లో, ఆహార విహారాల్లో తేడాలున్నా, అప్పుడప్పుడూ ఆవేశకావేశాలతో వాదులాడుకున్నా, కీచులాడుకున్నా, పోట్లాడుకున్నా, ఆపత్సమయాల్లో అంతా ఒక్కటిగా నిలబడతారు! అదే భారతీయుల గొప్పతనం! వివిధ రకాల భూములు, శీతోష్ణస్థితులు, విభిన్న సంస్కృతులు, రకరకాల మనుషులు ఉన్నా, సప్తవర్ణాల ఇంద్రధనుస్సులా రంగులొలుకుతూ ముచ్చట గొలిపే సుందర దృశ్యాన్ని సృష్టిస్తారు ! భారతదేశ కీర్తి పతాకాన్ని ప్రపంచ వీధుల్లో సగర్వంగా తెలెత్తుకుని రెపరెపలాడేలా చేయగలిగేది వీళ్లే ! అందుకే, "మేరా భారత్ మహాన్!" అనుకుంటూ ఆనందాతిశయ భావనతో ఊహల్లో తేలిపోతున్న జగన్నాథంగారు, ఈ లోకంలో కొచ్చేసరికి, ట్రెయిను విజయవాడ చేరింది. అదిగో, అప్పుడు జగన్నాథంగారు ఆ తల్లితండ్రుల దగ్గరకెళ్లాడు, ట్రెయిన్ దిగేముందు. మెలకువగానే ఉన్న ఆ తల్లితండ్రులు జగన్నాథం గారికి నమస్కారం చేశారు.

"మీ బిడ్డ చిరంజీవమ్మా! మృత్యుంజయుడు! ఈ పిల్లాడికిక తిరుగు లేదు. అందుకనే మీ బాబు బాగా చదువుకుని ఈ దేశానికే పేరు తేవాలి! అందుకోసం అయ్యే ఖర్చంతా నేను భరిస్తాను. ఇదిగో నా అడ్రసు." అంటూ తన అడ్రసు కాగితం ఆ తండ్రికి అందించాడు.

ఆవేశంలోనే అన్నాడో, ఆనందంతోనే అన్నాడో గాని, ఆయన నిర్ణయం వినేసరికి ఆ తల్లిదండ్రులిద్దరూ అవాక్కయిపోయారు.

అటు పిమ్మట ఆయన భార్యతో సహా ట్రెయిను దిగిపోయాడు, మళ్లా ఏం గుర్తొచ్చిందో ఏమో, గబుక్కున ట్రెయినెక్కాడు జగన్నాథంగారు, ఆ నలుగుర్ని నిద్రలేపి, వాళ్లు చేసిన సహాయానికి తన ఆనందాన్ని వ్యక్తపరిచాడు. వాళ్ల దగ్గర సెలవు తీసుకుని ట్రైన్ దిగారు.

వృత్తిధర్మం నెరవేర్చిన డాక్టరు, బిడ్డ ప్రాణాల్ని కాపాడి ధన్యుడైనాడు. అలాగే వృత్తిధర్మంగా జగన్నాథంగారు ఆ బిడ్డకు చదువు చెప్పకపోయినా, విద్యాభివృద్ధికి దోహదపడతాననడం అంతే విలువైనది. అందుకే ఆయన తన స్థితిగతులు కూడా మర్చిపోయి, అయాచితంగా, అయత్నీకృతంగా అలా పలికారంటే, అదంతా దైవేచ్ఛ! విధివిలాసం! అందుకు ఆ తల్లిదండ్రులు, ఆ పసివాడు అదృష్టవంతులు ! ఆయన ధన్యులు!

అందుకే అంటున్నా, "హమారా భారత్ మహాన్!"

## తెలుగు తల్లికి వందనం

డాక్టర్. వి. రామకృష్ణమాచార్యులు, విజయవాడ

వం దనం తెలుగు తల్లీ నీకు అభివందనం,
గోదావరి కృష్ణాపెన్నా స్వర్ణముఖీనదులతో
గలగల పారుతూ తెలుగు నేలను
సస్యశ్యామలం చేసిన నీకిదే "వందనం"
వేదాద్రి శేషాద్రి నీలాద్రి గరుడాద్రి వృషాద్రి
వేంకటాద్రి ఇంద్రకీలాద్రి, మంగళాద్రి సింహాద్రి
నగముల శోభతో భక్తిని పండించే నీకిదే "వందనం"
శ్రీ శైలం, నాగార్జున, జూరాల, పోలవరం,
ప్రాజెక్టులతో తెలుగునేలను వెలుగుతో నింపే నీకిదే "వందనం"
ఆంధ్రనాట్యం, భామాకలాపం, ధింసా, లంబాడీనాట్య
రీతుల తెలుగుదనం విశ్వవ్యాప్తి చేసిన నీకిదే "వందనం"
అన్నమయ్య, త్యాగయ్య, క్షేత్రయ్య, పదసోయగాలు
ఆంధ్రుల రక్తిని భక్తిని చాటి చెప్పిన నీకిదే "వందనం"
నన్నయ్య, ఎర్రన్న,తిక్కన్న, పోతన్న, శ్రీనాథుల
భారత వాఙ్మయాన్ని తెలుగునాట చాటిన నీకిదే "వందనం"
కబీరు, రామదాసు, బాలయోగి, సత్యసాయిల
భక్తి సేవా సంస్కృతి నందించిన నీకిదే "వందనం"
తెలుగునాట తెలుగు కీర్తిని మల్లెమాలతీ
కదంబ పరిమళాలు వెదజల్లే నీకిదే "వందనం"

12a

# వేదాంతకవి - తెలుగు దర్బారు

**ఎ.వి.యస్.ఆర్. ఆంజనేయులు**, విజయవాడ

"తెలుగు దర్బారు" అనేసాహిత్య సంస్థ స్థాపకుడు క్రీ॥శే॥ వేదాంతకవిగా ప్రసిద్ధుడైన వేదాంతం సుబ్రమణ్యశర్మగారు. కొంతకాలం విలక్షణ కవిగా, రచయితగా, నాటక కర్తగా ప్రసిద్ధి పొందినవాడు శ్రీ వేదాంతకవి ఎవరినీ లెక్కచెయ్యనివాడు. ఏ ప్రలోభాలకు లొంగని సాహిత్యవేత్త.. అనేక మంది యువకవులకు, రచయితలకూ స్ఫూర్తినిచ్చినవాడు. తెలుగు సాహిత్య చరిత్రలో శాశ్వతుడు. స్వాతంత్ర్యంరాక ముందునుంచీ కవితా వ్యాసంగం ప్రారంభించి విజృంభించి వ్రాసినవాడు. విజయవాడలో ఒక సభలో నెహ్రూగారు మాట్లాడుతుండగా ఆసభలోనే ఒక చిన్న పుస్తకం అప్పటికప్పుడు వేదికమీదకు ఉరికి తనపుస్తకాన్ని నెహ్రూగారికి అంకితమిచ్చిన సాహసి. నెహ్రూగారి మెప్పుపొందిన తెలుగు కవి. సాధారణంగా నెహ్రూ తన ఉపన్యాసం సాగుతుంటే ఎలాంటి అవాంతరాలు అడ్డులూ సహించేవాడుకాదు. అలాంటిది వేదాంతకవిలో కన్పించిన ఆకర్షణ ఏమిటోగాని, ఉపన్యాసంమధ్యలో ఆపి, అంకితం స్వీకరించాడు చిరునవ్వుతో!

యీ మహాకవి, కేవలం కవి, రచయితయేగాక స్వాతంత్ర సమరయోధుడు, వీరగీతాలు పాడి జనాన్ని ఉఱ్ఱూతలూ గించినవాడు. అనేక పర్యాయాలు జైలు శిక్షననుభవించిన దేశాభిమాని.

అనేక ఘాటైన విమర్శనా గ్రంథాలు వ్రాసి తన తెలుగు దర్బారు తరపున ప్రచురించారు. సమకాలీన కవుల గుండెలు దడదడ లాడించాడు. విజయవాడ వీధుల్ని సాహిత్య వీధులుగా మార్చిన కవిబ్రహ్మ ఆయన.

వేదాంతకవి జన్మస్థానం గుంటూరు జిల్లా కొల్లూరు. విద్యాభ్యాసం మచిలీపట్నంలో జరిగింది. తిరుపతి వెంకట కవుల ప్రియశిష్యుడైనాడు. తరువాత బెజవాడకు వచ్చి నివాసమేర్పరుచుకుని యాభైసంవత్సరాలు తన నిర్జర కవితా వ్యాసంగం సాగించాడు.

వేదాంత కవిగారి తండ్రి వేదాంతం శంభుశాస్త్రి యీ యనను ఆధునిక ఋషిగా కీర్తించారు. ఆయన రూపం, వేషధారణ ప్రాచీన ఋషులను మరిపించేదని కృష్ణా పత్రిక వ్రాసింది. శంభుశాస్త్రి గారు సనాతన ఆధునికుడు. అయ్యదేవర కాళేశ్వరరావు పంతులుగారు విజయవాడలో స్థాపించిన జాతీయ పాఠశాలలో శంభుశాస్త్రిగారు ఉపాధ్యాయుడుగా పనిచేసారు. స్వర్గీయ వేముల కూర్మయ్య గారు ఆయన విద్యార్థి. కులభేదాలు పాటించనివాడు. ఆయన స్వాతంత్ర సంగ్రామకాలంలో అనేక పర్యాయాలు తన ముగ్గురు కుమారులతో పాటు లాఠీ దెబ్బలతో గాయపడి జైలుకు వెళ్లినాడు. వేదాంత కవి గారు కూడా తండ్రితో పాటు సోదరులతో పాటు దెబ్బలు తినటమే కాకుండా జైలులో అనేక పర్యాయాలు బంధింపబడిన వాడే. ఆనాడు ఆ కుటుంబం ఎదుర్కొన్న హింసని పార్లమెంటు కమిటీ వారు కూడా గర్హించారు. దుర్భర దరిద్రాన్ని అనుభవిస్తున్నా ఏ ప్రలోభాలకు లొంగని గొప్ప కుటుంబం వారిది! శంభుశాస్త్రిగారి పెద్దకుమారుడు లక్ష్మీకాంతంగారు కూడా కవే. దుగ్గిరాల గోపాలకృష్ణయ్య గారి ఆంతరంగిక కార్యదర్శిగా పనిచేసారు. రెండవ కుమారుడు పూర్ణానందంగారు జర్నలిస్టు. మూడవ వారు వేదాంతకవి.

వేదాంత కవిగారు ఏ ప్రభుత్వ ఉద్యోగంలో చేరకుండా స్వతంత్ర జీవనం ప్రారంభించి కవిగా చిరయశస్సు నార్జించారు. వారు రాసిన 'తెలుగు తల్లి నాటకం' ఆంధ్ర దేశంలో అన్నిప్రాంతాల్లోనూ ప్రదర్శింపబడింది. నట సామ్రాట్ అక్కినేని నాగేశ్వరరావు గారిని నటుడుగా చేసింది ఆనాటకమే. ఆనాటి కవులు తమనాటకరచనల ద్వారా దేశభక్తిని ప్రబోధించి అణువణునా ప్రతివారినీ దేశభక్తులుగా మార్చారు. స్వాతంత్ర సంగ్రామ కాలంలో తెలుగు దేశం స్వాతంత్ర సంగ్రామ కేంద్రంగా మారింది. ఆనాటి కవులు, రచయితలు, కళాకారులు ప్రతి వారినీ స్వాతంత్ర పిపాశులుగా మార్చారు. వారి రచనలలో పటుత్వం అటువంటిది.

వేదాంతకవిగారి రచనలలో ముఖ్యమైనవి. తెలుగుతల్లి, వన్యస్వరాజ్యం, చలోహైదరాబాదు. కాష్ఠకలం, ఆకలి మంటలు మొదలైనవి. వారి రచనలు యింకా చాలా అముద్రితాలుగానే ఉన్నాయి. వారికి అనేక సన్మానాలు జరిగినాయి. బిరుదులెన్నో వచ్చినాయి. ఆయన అనేక మంది రచయితల గ్రంథాలను నిశితంగా విమర్శించారు. ఆయన విమర్శలు చదివితే ఆయన తార్కిక స్వభావం ఎటువంటిదో తెలుస్తుంది. ఆయన జాషువా. తుమ్మల సీతారామమూర్తి చౌదరి గారిని బమ్మెరపోతన గారిని కూడా పంజాదెబ్బ అనే తమ పుస్తకంలో తీవ్రంగా విమర్శిస్తూ వ్రాసారు. అయితే, ఆవిమర్శనల్ని సహృదయంతోనే స్వీకరించారు అందరూ. ఆయనకు 1955 అక్టోబరు ఇరవై ఆరో తేదీన విజయవాడలో అఖండ సన్మానం జరిగింది. పురవీధులగుండా గజారోహణ చేయించి ఊరేగించారు. ఆ సభకు అనేక మంది కవులు, గాయకులు, రచయితలు, నటులు వచ్చారు. ముఖ్యంగా అక్కినేని నాగేశ్వరరావు గారు తన కవిగారికి తమ భక్తి శ్రద్ధలుచూపించారు. నవయుగ కవి చక్రవర్తి గుఱ్ఱం జాషువాగారు తమ కుమారుడు "వలరాజు" తో తరలివచ్చి కవిగారికి తమ శుభాకాంక్షలు అందచేసారు. చాలా మందికి జాషువా గారి కుమారుడు వలరాజును గురించి తెలిసి వుండదు. ఆ సందర్భంలో వలరాజు చదివిన సీసమాలిక చాలా ఆశ్చర్యపరిచింది పండితలోకానికి.

వేదాంత కవిగారు సంస్కరణాభిలాషి. తమ యింట ఒక ముస్లిమ్ కుఱ్ఱవాడిని. ఒక హరిజన బాలుణ్ణి పెంచిపెద్ద జేసి వివాహం జరిపించిన సంస్కరణాభిలాషి కేవలం మాటల్లోనేకాకుండా క్రియా రూపంలో చూపిన మహా నియమావ్రతుడు. నిత్యం శక్తి పూజచేసే వారు. వారి యింట శక్తి పూజా పీఠం నెలకొల్పారు. మనిషి మంచి రంగుకలిగి మందపాటి అద్దాల కళ్ళ జోడుతో నుదుట కుంకుమబొట్టుతో దర్శనమిచ్చేవాడు. ప్రతిరోజూ సాయంకాలం తన శిష్యవర్గంతో నడుచుకుంటూ గాంధీనగర్‌సెంటర్‌లోని వెల్‌కమ్ హోటల్ దగ్గర నిలబడి అందరినీ పలకరిస్తూ సంభాషించేవాడు. దుర్గాదేవి ఆయింటి దేవత ఆమెకు నిత్యపూజ జరగవలసిందే.

యీ మహాకవి ఏ కారణంచేతనో విజయవాడ వదలి సికింద్రాబాదుకు చేరి వామాచార సాంప్రదాయం ప్రచారం చేస్తూ ప్రపంచానికి కనుమరుగైనారు. విజయవాడ పాతబస్తీకి చెందిన ఆయన అనుచరులు ఎంతగానో విచారించారు, ఆయన విజయవాడ వదలి వెళ్ళినందుకు.

చివరగా చెప్పేదేమిటంటే ఆపాత తరం కవులు వదలివేసిన సమస్యలు, బాధలు నేటిరచయితలు తమకలాలకు పదునుపెట్టి వివిధ ప్రక్రియలు అందిపుచ్చుకొవాల్సిఉంది. గత యాభైసంవత్సరాలుగా జనంలో ఎన్నో మార్పులు వచ్చినాయి. యీ మార్పులకు ఆనాటి రచయతలు ప్రేరకులుగా భావించవచ్చును.

## తెలుగు - వెలుగు

**శ్రీమతి కోవిల, విశాఖపట్నం**

ఏ దేశ మేగినా, ఎందుకాలిడినా,
పొగడరా నీతల్లి భూమి భారతని
నిలుపురా నీ జాతీ నిండు గౌరవాన్ని,
ఇది భారతీయుల అభిమాన గీతిక
తెలుగుదేశానికీ తెలుగు జాతికి పేరు తెచ్చినది తెలుగుభాషే
శతాబ్దాల చరిత్రనింపుకొన్న తెలుగుభాష తీరనిదాహం
వేదకాలంనాటి భరతఖండ సాంస్కృతిక వారసత్వం
ప్రపంచ చరిత్రలోనే మకుటాయమానం
పూర్వకాలపు ఋషులు, తాత్వికులు, శిల్పులు,
వాగ్గేయకారులు, రచయితలు మొదలగు వారంతా
హిమపన్నగ మహోన్నతికి కారకులు.
అంతటి వైభవాన్ని మనము పరిరక్షించుకోవాలి.
ఆ మహనీయుల వారసులమని చెప్పుకోవటానికి
ఈ అఖిల భారతరచయితల సభలు ఒక జ్ఞాపిక
తెలుగుకవిత, మొనాటనీ నుంచి చైతన్యానికి
కల్పన నుండి వాస్తవానికి అడుగులు వేసింది,
పరుగులు తీసింది ఈ తెలుగు తోటలోనే
పద్యం పరిమళించి, కవితాసౌరభాలు
విరబూసింది ఈ తెలుగు తోటలోనే !
మహోత్కృష్టమైన భారతీయ సంస్కృతి వైభవోద్దీపనలో
మన తెలుగు కవుల పాత్ర అద్వితీయం, అనిర్వచనీయం.
తెలుగు భాషకి సంగీత కళలను మేళవించి,
సంగీత సాహిత్య అమృతతత్వాలను
ఆధ్యాత్మిక చింతనలో రంగరించి,
ఆ కళా జ్యోతిని మనకు కరదీపికగా అనుగ్రహించి
మోక్షసాధనా రాజమార్గాన్ని ప్రపంచానికందించిన మహాత్ములు కూడా
మన తెలుగువారే !
అందుకే తెలుగుజాతి హృదయాలు ఉవ్వెత్తున
పొంగే క్షీరసాగరాలవుతాయి.
మన తెలుగు గడ్డను విడిచి సుదూరతీరాలకు చేరినా
తెలుగు తనానికి మాత్రం దూరంకాలేదు.
వారంతా తెలుగు రసజ్ఞులు, సంప్రదాయజ్ఞులు
భారతీయ సంస్కృత బీజాలు నాటి
సంస్కృతీ కల్పవృక్ష ఫలాలను భారతీయులకందించి
లోక కళ్యాణంగా జరిపిస్తూ... తెలుగు జాతి
ఔన్నత్యాన్ని చాటి చెప్పే
కృష్ణాజిల్లా రచయితల సంఘాన్ని మనసారా అభినందిద్దాం.
విభిన్న కోణాలు, విభిన్న దృక్పదాలు
భిన్న భిన్న మనస్తత్వాల కవులతో కలబోసి
పండించిన నవరుచుల సమ్మేళనమే
ఈ అఖిల భారత రచయితల సభలు
ఈ రెండు రోజుల సభలు ఒక సాహితీ జగత్తుఅంటే అతిశయోక్తికాదు
ఈ వత్సరానికే ప్రస్ఫుటమైన జ్ఞాపకాల మైళరాళ్లుకూడా

## నేటి భారతం

**శ్రీ పులవర్తి కొర్నేలియస్, గుడివాడ**

భారతీయ సమాజముచ్చట్లు
భావదాస్యకులాల నిచ్చెనమెట్లు
సామాజిక ఎగుడు దిగుడు దొంతర్లు
సొంతం చేసుకొన్న కులదురహంకార్లు
ప్రాంతాల, భాషల సంకుచిత భావాలు
మతాల కులాల అంతరాల ఘర్షణలు
రాజకీయ నాయకులందు చేసే విన్యాసాలు
రాక్షస క్రీడల కవి చక్కటి మైదానాలు
ఏరులై పారే మానవరక్త ప్రవాహాలను
ఏపుగా పెరుగ, తమ రాజకీయ పైరుకు
తీరుబడిగ కాలువలేస్తు, అడ్లు తీస్తు
తరలిస్తు తనివిదీర దరహాసం చేస్తు
తమ రాజకీయ ఓట్లమాగాణిలో
దండిగ పంట పండిస్తున్న ప్రజాకంటకులు
నీతి లేని రాజకీయ పాపాలకు
నిలువునా బలౌతున్న నా దేశ ప్రజ
ఇదీ నేటి భారత రాజకీయ నీతి
ఇదవినీతి, హత్యల జమిలినాట్యరీతి
ప్రపంచీకరణ వ్యాఘ్రం పల్లవిస్తుంది
ప్రజల మెదడు తినే ప్రమాదం ముంచుకొస్తుంది
మానవీయ విలువలు దహించుకుపోతుంటే
మేధావులు మానసిక వికలాంగులై చరిస్తుంటే
మా దేశయువతా! "మందు" ప్రవాహంలో
మత్తుగా ముసుగుదన్నె, గాఢసుషుప్తిలో
యువతా ఓ యువతా నీ గమ్యం తెలుసుకో
నవసమాజ నిర్మాణానికి పెన్నిద్దర మేలుకో

దినమునకొక తెనుగుపదము
అనువుగ నీవరయు మంచునమ్మికి తెలుపన్
**"జననీ"** యని తల్లిపిలచి
**"జననా"** యని నన్నుపిలచు చందముగనుమా

**శ్రీ అభిభట్ల కామేశ్వరశర్మ, అబుదబి** (UAE)

14a

# కృష్ణాజిల్లా రచయితల సంఘం

ప్రతిష్ఠాత్మకంగా నిర్వహిస్తున్న

# జాతీయ తెలుగు మహాసభలు

## విజయవంతం కావాలని ఆకాంక్షిస్తూ .....

**శ్రీమతి గుత్తికొండ రామరత్నం** — మచిలీపట్నం

**శ్రీ కాటాబత్తుని బాల వెంకట రమణరావు**
**శ్రీమతి విజయ స్పందన**
**మాస్టర్ మహేంద్ర వంశి**
**బేబి శ్రేయ**
— పెన్‌శిల్వేనియా (U.S.A)

**శ్రీ మాగంటి ప్రణయ దీపక్**
**శ్రీమతి భారతి**
**బేబి తన్వి**
— కాలిఫోర్నియా (U.S.A)

**శ్రీ జొన్నాదుల రాజేంద్రబాబు**
**శ్రీమతి కవిత**
— మిచిగన్ (U.S.A)

# తెలుగు సాహిత్యంలో హాస్యం

బులుసు వెంకట కామేశ్వరరావు, మచిలీపట్నం

నవరసాల్లోనూ ఎక్కువమందిని అలరించే రసాలు రెండే రెండు, అవి శృంగారం - హాస్యం. మామూలుగానైతే శృంగారానిదే అగ్రతాంబూలమనాలి, ఆ తరువాతే హాస్యం. అయితే శృంగార మంటే సరిపడని ఋష్యశృంగులెవరైనా ఉండవచ్చునేమో గాని, హాస్యమంటే పెదవివిరిచేవారెవరూ ఉండరు. కనుక ఒక విధంగా హాస్యానికే పెద్దపేట వేయాల్సి ఉటుందేమో ! కాగా, సాహితీ ప్రక్రియలన్నిటిలోకి హాస్యం - బాలసాహిత్యం, ఈ రెండూ రాయడమనేది కత్తిమీద సాముమంటిదే. మరీముఖ్యంగా హాస్యం విషయానికొస్తే, ఏమాత్రం తూకం తప్పినా అది అపహాస్యమవుతుంది. పాఠకుడిని నవ్వించబోయి రచయిత నవ్వులపాలవుతాడు. ఎవరినైనా ఏడిపించడం తేలికేగాని, నవ్వించమే చాలా కష్టం ఏడ్చినప్పుడెలాగైతే కన్నీళ్ళు వస్తాయో, ఒక మంచి హాస్యరచన కూడా కంటినీరు తెప్పిస్తుంది. అలా చేయగలిగేదే గొప్ప హాస్యరచన కాగలుగుతుంది. ప్రాచీనుల నుంచి నవీనుల దాకా ఎందరో సాహితీవేత్తలు చక్కని, చిక్కని హాస్యాన్ని తమ రచనల్లో పండించి తెలుగువారిని నోరారాను, కడుపారాను నవ్వించారు.

ప్రాచీనులలో తెనాలి రామలింగడు ప్రాతఃస్మరణీయుడు, రాయలవారి అష్టదిగ్గజాలలో ఒకడిగా, వికటకవిగా పండిత పామరులిరువురినీ అలరించాడు. మేకతోకపై కవిత్వం చెప్పి కాదేదీ కవితకనర్హమని అనాడే నిరూపించాడు.

శృంగార కవి శ్రీనాథుడు చేవగల చాటువులెన్నో చెప్పాడు. పల్నాటిసీమలో పర్యటిస్తూ బాగా దాహంవేసి, నాలిక తడుపుకోడానికి ఎక్కడా చుక్కనీరు దొరక్క ఒకచోట శివుడి విగ్రహంచూసి చెప్పిన చాటువు ప్రసిద్ధమైనది. పదహారువేలమంది తరుణుల్ని పెళ్ళాడేందుకు నువ్వేమీ సిరిగలాడివి కాదు కదా, తిరిపమెత్తేవాడివి నీకు ఇద్దరు ఇల్లాళ్లెందుకు, పార్వతినొక్కదాన్ని అట్టిపెట్టుకొని గంగను విడిచిపెట్టేయమంటాడు. మేడిపండులా మెరిసే సంఘం గుట్టు విప్పిన వేమన అటవెలదులలో వలసినంత వ్యంగ్యముంది. పాలసాగరమీద పవళించే స్వామి గొల్లఇండ్లపాలు కోరడమెందుకో, ఎదుటివారి సొమ్ము ఎల్లవారికి తీపికదానని అంటాడు, కుందవరపు చౌడప్ప కవిది చీవాట్లబాణి, తిక్కన తర్వాత కందానికిలానే మొనగాడినని డబ్బా కొట్టుకున్న అతగాడు వేమన కంటే తీవ్రంగా, సూటిగా, చాలా పచ్చిగా కుహనా వ్యవస్థను కుళ్ళబొడిచాడు. అల్లసాని పెద్దనామాత్యులంటే అమితమైన ఆరాధనాభావం గలవాడనడంచేత పెద్దన వలె కృతిచెప్పలేని అల్పకవుల్ని ఎద్దుతోను, మొద్దుతోను, గద్దతోను పోల్చి ఎద్దేవాచేశాడు. వేవేల కాకులు ఒక్క తుపాకి రావం విని ఎలా ఉలికిపడ్తాయో, తన ధాకను విన్న కాకవులకు కూడా అలాగే జరుగుతుందని వివరించాడు. దాతృత్వం లేని అయ్యకు మీసాలెందుకు, రొయ్యకు లేవా అని వెటకారం చేశాడు. ఇలా ఎందరిపైనో అధిక్షేప బాణాలను సంధించాడు చౌడప్ప. అధిక్షేప కవులు ఇంకా మరి కొందరు కళాకారులుగాని, చౌడప్ప దాటికి వారెవ్వరూ నిలువలేకపోయారు. తిట్లు, శాపనార్థాలే కవితా వస్తువులై వెలుగొందినవాడు వేములవాడ భీమకవి. ద్రాక్షారామ భీమేశ్వరుని వరప్రసాదంగా జన్మించిన అతడి పుట్టుకను తప్పుపట్టి భోజనపంక్తిలో కూర్చోనివ్వకపోతే కోపించి అన్నం సున్నం కావాలని, అప్పాలు కప్పలు కావాలని శపిస్తాడు. అలాగే జరుగుతుంది. పాలకడలి హోరుకి, వేయిపడగల ఆదిశేషుని బుసలకు విష్ణుమూర్తులవారి కన్నులు నిద్రలాపడుతోందోనని ఆశ్చర్యపోయాడు కందుకూరి రుద్రకవి. శివుడద్రిని శయనించడం, రాజీవాక్షుడు శేషునిపై పవళించడం, రవిచంద్రులు మింటనుండటం నల్లుల బాధపడలేకేనని చమత్కరించాడు మరో కవిశ్రేష్ఠుడు.

ఆధునిక కవులలో శ్రీశ్రీ, ఆరుద్రలు ముందస్తుగా స్తవనీయులు, ఆనాడు, ఈనాడు హాస్యానికి విలువ కద్దు, సాహిత్య సభాంగణాన వ్యంగ్యానిదే తొలిపద్దు అని నుడివిన శ్రీశ్రీ తన సిరిసిరిమువ్వలు, ప్రాసక్రీడలు, రిమరిక్కులతో గిమ్మిక్కులెన్నో చూశాడు. "సిప్రాలి" పేరిట ఈ మూడు రచనలనూ ఒకే పుస్తకంగా వేశారు. "విశాలాంధ్ర" వారు మళ్ళీ ఇన్నాళ్ళకి, ఇన్నేళ్ళకి పద్యాలు రాయడమనేది పళ్ళూడిన ముసలిది కుచ్చిళ్ళు సవరించినట్లుగా ఉన్నదట. పెదబాలశిక్షచదివీ చదవడమే తడవుగా సాహిత్య విశారదులై పోయినట్లుగా భావిస్తారట కొంతమంది. మన తెలుగింట్లో కవిరాజులు, కవి వరాహగార్ధభ శునకాద్యవ మీరమూర్తులెందరో శివమెత్తినట్లు నటిస్తారట, త్రాగుబోతులలో ఉగ్గు, తాజ్‌మహల్ మునివాకిటిలో ముగ్గు, కృష్ణశాస్త్రికి విగ్గు, భావకవికి సిగ్గు ఎందుకన్నాడు. ఈ విధంగా శ్రీరంగంవారు వీరంగం తొక్కారు. అంత్యప్రాసలతో ఆడుకుంటూ చమత్కారపూరితమైన పదాలు, పద్యాలెన్నో పల్లవించినవాడు ఆరుద్ర. రోజూ చేసుకొనే మగాడి గడ్డం, మోజున్న సరసానిక అడ్డం రాదని అభయమిచ్చాడు. సగం కమ్యూనిస్టు, సగం కేపిటలిస్టు, ఎందుకొచ్చిన రొస్టు వలదన్నాడు. తమలపాకులు నమిలి, దవడతో మాట్లాడితే, తమిళం బానే వచ్చేస్తుందని సులభమార్గాన్ని బోధించాడు. ఆలికి కొన్నకోకకంటే అంతరిక్షపు నౌక చౌకని తీర్మానించాడు. టాక్స్ లేనిది సెక్స్ అని సెలవిచ్చాడు. పెను సమాసాలున్న పెద్ద వృత్తాల జోలికి పోకుండా, కూనలంటి పదాలతో ఇంటింటా నవ్వులు పంచారు శ్రీమాన్ భాగవతుల శంకరశాస్త్రులవారు. తన వచన పద్యాలు దుడ్డుకర్రతో పద్యాలనడుములు విరగదన్నేందుకు ఉద్యమించినవాడు పఠాభి. అందిపోటు మాదిరి ఇంగ్లీషు భాషా భాండారంలోంచి కావల్సిన మాటల్ని దోస్తానన్నాడు. తన ఇష్టం వచ్చినట్లు చేస్తానన్నాడు. అన్నంత పనిచేసేవాడు. పఠాభి కవిత్వవైచిత్రికి నిఖిలలోకం నివ్వెరపోయింది. పొగడాలో, తెగడాలో తేల్చుకోలేని విచిత్ర అవస్థలో పడింది విశ్వనాథవారు మాత్రం నిక్కచ్చిగా చెప్పేశారు. సదరు కవిత్వమెలాటిదో కవిగా ఇంటిపేరే చెప్తోందని, (పఠాభి ఇంటిపేరు 'తిక్కవరపు' అని గ్రహించవలయును). అయితే ఇతగాడు 'పన్ను'లలో సంపన్నుడని అరుద్ర సర్టిఫికెట్టిచ్చాడు 'పన్ను' అంటే ఏ అర్థంలోనైనా తెలుగు పన్ను కాదంటే, ఇంగ్లీషు 'పన్' (pun) అనగా శ్లేష. తీసినా,

వేసినా బాధకలిగించునని పన్నులట రామాయణం కన్నా పాపులర్ లోకాభిరామాయణమట, భారతీయులకు టోపీ వేసినవాడు గాంధీ మహాత్ముడట, ముస్లింరోగంవల్లనే మనదేశం 'జిన్నా' భిన్నమైనదట. ఇలా ఈ అహంభావకవిగా తన పన్‌చాన్‌గమ్' లో పేర్చిన "పన్" లెన్నో. చలం మాటల్లో తన బాధను ప్రపంచ బాధ చేసిన కృష్ణశాస్త్రి తన జాతి కవిపుంగవులు కొందరిని అక్షేపిస్తూ అన్నమాట - మెరుగు కళ్ళజోళ్ళు, గిరజాలు సరదాలు, భావకవికి లేనివేవిలేవు. కవిత యందు దవ్వ గట్టివాడన్నింటి, విశ్వధాభిరామ వినురవేమ. భావకవులనబడువారిని అన్యులు హేళన చెయ్యనవసరం లేకుండా, ఆ పనేదో దేవులపల్లివారే చేశారు.

గురజాడ 'కన్యాశుల్కం' అద్యంతం హాస్యరసభరితమే. సాంఘిక దురాచారాన్ని వ్యంగ్యాత్మక ఫంథాలో ఖండించాడు నాటకకర్త సమాజపు వెధవాయిత్వాన్ని నగ్నంగా కళ్ళక్కట్టారు. మీదుమిక్కిలి అందలి గిరీశం పాత్రచిత్రనం అపూర్వం, అనితరసాధ్యం. వెర్షనులో మన కథానాయకుడు లేనేలేడు రెండవ రచనంలోనే ఊపిరిపోసుకుని చిరంజీవి

## పుడమి తల్లి

**వేలూరి సుధారాణి, విజయవాడ**

పచ్చనిచేలు, పరిమళాలపూలు,
తరువులు, చెరువులు, సహజ సౌందర్యసెలయేళ్ళు
లలిత, హరిత లావణ్యము, అగాధ జలనిదులు
ఊహకందని అత్యద్భుత సౌందర్యం
అమూల్య సుసంపదల సౌందర్యరాశి
అది, నాటి నీ పుడమితల్లి తీపి జ్ఞాపకాల పులకరింత
మరి నేడు వనాలు లేవు, వణ్యామృగాలు లేవు.
క్షీణిస్తున్న ఓజోనుపొర విరిగిపడుతున్న కొండచరియలు
తరిగిపోతున్న జలనిధులు,
పెరిగిపోతున్న బహూళఅంతస్తులు
ప్రకృతిపై విషంకక్కుతున్న రసాయనిక ప్రక్రియలు.
జల వాయుకాలుష్యాలు,
మనిషి స్వార్ధ ధుర్నీతి ఇనుపపాదాలక్రింద
మన పుడమితల్లి వేదన.........
తల్లిపాలు తాగి రొమ్మును గుద్దే బిడ్డల్ని మోస్తూ
తల్లడిల్లుతుంది ఆకల్పవల్లి.
నువ్వు తినేతిండి, పీల్చేగాలి. తాగేనీరు. ఉండేగూడు
నువ్వలసి పోయే వేళ అమ్మలా సేదదీర్చి
తననీడలో అక్కున చేర్చుకున్నది ఆకల్పవల్లి
ఆమెలేకుంటే నీకు ప్రగతిలేదు
జగాన ప్రకృతి గమనమూలేదు.
నీ ముందు తరాలకి నీడనిచ్చేందుకు
నాటాలి ముందుగా నువ్వోక చెట్టు
అదే నీ దేశ ప్రగతికి మొదటిమెట్టు
వృక్షో, రక్షతి, రక్షితః!

అయిపోయాడు. గిరీశం వంటి సంఘ సంస్కర్తలే లేకుంటే బుచ్చమ్మలాంటి బ్యూటిఫుల్ యంగ్ విడోస్‌ను ఉద్ధరించువారెవరు! గిరీశం ఒక ఆషాఢభూతి అనుకున్నా అతగాని 'జీనియస్' ఆ బాపతువాళ్ళిందరికుంటుంది చెప్పండి! శిష్యుడు వెంకటేశం మాటేమోగాని, ఆ వంకరబుద్దే లేకుండెనా, మన గిర్రడు ఖచ్చితంగా సురేంద్రనాథ్ బెనర్జీ అంత గొప్పోడయ్యేవాడు. అయినా ఇప్పుడు మాత్రం ఏమి తక్కువైందేమిషి! గురజాడవారి ఈ మానసపుత్రుడు తదనంతర కాలంలో ముళ్ళపూడివారికి 'దత్తు' డై మరింకెన్నో లెక్చెర్లిచ్చి తెలుగులకి 'జ్ఞాన' బోధ చేశాడు. అనేక ప్రక్రియల్లో లోనే ఆద్యుడనని ప్రకటించుకున్న కందుకూరి వీరేశలింగం ప్రహసనంలో కూడా ప్రవీణుడనిపించు కొన్నారు. ఆయన బాటలోనే ప్రహసనాలు రాసిన చిలకమర్తి 'గణపతి' తో గణతికెక్కారు. 'చారు తులసీదళ దామా' అనే పద్యపాదానికి 'రాముడు' తులసీదళాలతో చారు కాచుకుని తాగాడని తాత్పర్యం చెప్పిన 'బాలమేధావి' గణపతి తద్వారా అతగాడు అఖిలాంధ్ర మొద్దబ్బాయిల సంఘానికి శాశ్వాతాధ్యక్షుడయ్యాడు. 'సాక్షి' వ్యాసాలు వెలయించి సెటైరు సామ్రాట్టు అయ్యారు పానుగంటి. వీరి 'కంఠాభరణం' మంచి హాస్యపూరితమైన నాటకం. అయితే హాస్యనాటకాల దగ్గరకొస్తే భమిడిపాటి కామేశ్వరరావునే పితామహుడిగా పరిగణించాల్సి వుంటుంది. ఆయన తర్వాత రావి కొండలరావు, గొల్లపూడి మారుతీరావు, జంధ్యాల, ఆదివిష్ణు తదితరులు కామెడీకింగులయ్యారు. మొగల్తురు కర్రవాగన్న పార్వతీశం చేత లండనులో బారిష్టరీ చేయించేందుకు మొక్కపాటి పడిన 'ప్రయాస' అంతా ఇంతా కాదు కదా ! గిరీశం, గణపతిల్లాగే పార్వతీశం కూడా తెలుగుల గుండెల్లో తిష్టవేసుకున్నాడు.

ఆనందవర్ధనుడి కంటె, అభినవగుప్తుడికంటే, 'ధ్వని' తత్వాన్ని బాగా ఎరిగి ఉన్న మునిమాణిక్యంవారి 'కాంతం' అమాయకత, గడుసుతనాల కలబోత అయిన తెలుగు కాంతలందరికీ తిరుగలేని ప్రతీక కాగా, దంపతులైనవారు మరే ఇతర ఉపనిషత్తులూ చదవకపోయినా కొంపమునిగిపోయిందేమీ లేదుగానీ 'దాంపత్యోపనిషత్తు' ను మాత్రం కంఠతా పట్టితీరవలె - అప్పుడే వారి దాంపత్యజీవనం సాఫీగా సాగిపోగలదు. రావూరు వారి 'అషామాషీ' కబుర్లు అందరు మిఠాయిలు. సినిమాల్లోని సూర్యకాంతం ఛాయాదేవిల టైపులో అత్తగార్లంతా పరమగయ్యాళులు కావాలన్న రూలేమీ లేదని, కొండొకచో వారిలోనూ ఎంతో మంచి వాళ్ళుంటారని తెలుగు కోడళ్ళ భరోసా ఇచ్చినవారు భానుమతి. ఒక భిన్నమైన కోణంలో అత్తగారిని చూపి చరితార్థులయ్యారు. బాపు గీత - రమణ రాత జత కట్టి తెలుగు వాడిని కేరింతలు కొట్టించాయి. కొంటె బొమ్మల బాపు, కొన్ని తరముల సేపు, గుండె ఉయ్యాలనూపుతున్నారు ఆరుద్ర, ఇందులో 'కొన్ని తరముల సేపు' అన్నది అండర్‌లైన్ చేసుకోవలసిన వ్యాఖ్యం. బాపు కార్టూనులు కితకితలు పెడితే, రమణ, "నవ్వితే నవ్వండి" జోకులు గిలిగింతలు పెడ్తాయి. గురజాడవారి గిరీశాన్ని ఎత్తుకొచ్చేసి యమఘాటైన లెక్చెర్లిప్పించిన ఘనుడీ రమణ. మచ్చుకు ఒకటి - వ్యాట్!

బయింగ్‌లుక్స్ ... బార్చేరియస్. వర్స్ దేన్ స్టెర్లింగ్ గరల్స్. ఇక 'రుణానందలహరి' పేరిట అప్పులచరితం చెప్పాడు. ప్రేమ కోసం పరితపిస్తున్న ప్రేయసిని కూడా విడిచి పెట్టకుండా ఆమెను సైతం ఫైవ్ రుపీస్ అడగడం ఒక్క అప్పుల అప్పారావుకే చెల్లును. బుడుగు పిడుగు బాధసరేసరి. నడ్డిమీద చంపెయ్యడమంటే ఏమిటో బుడుగు నడిగి తెలుసుకోవలసిందే. సినీమాయాలోకపు మర్మాలను '(సి) నీతిచంద్రిక' ద్వారా బయటపెట్టిన మాన్యుడు రావి కొండల రావు. నండూరి పార్థసారధి 'సాహిత్యహింసావలోకనం' సాహిత్యం హింసకులకు చెంపపెట్టు. పురాణం సుబ్రహ్మణ్యశర్మ లేక సీత విరచితమైన ఇల్లాలి ముచ్చట్ల గురించి ఎన్ని ముచ్చట్లు చెప్పుకున్నాచాలదు. "ఆంధ్రజ్యోతి" వీక్లీని జగజ్జేగీయమానంగా వెలిగించిన ఈ ఫీచర్ తెలుగు సాహితికి లభ్యమైన ఒక అమూల్యమైన 'ట్రెజర్' పాఠకుడిని ఏకకాలంలో నవ్విస్తూ ఏడిపించడం ఏడిపిస్తూ నవ్వించటం, పురాణంచేసిన మా గొప్ప ఫేట్. ఆయన 'జేబులో బొమ్మ' A great mythological fantasy తన కథల్లో కూడా దిట్టమైన హాస్యాన్ని దట్టించారు. దురంతాలను దిగమింగి హాయిగా నవ్వగల కవిత్వమనిపించుకున్నాడు. మామిడిపళ్ళను వాసికెక్కిన నూజివీడు అందించిన మేలిరకం హూమరసం ఎమ్వీయల్ అల్పాయుష్కుడవడం పెద్ద విషాదం. మాచిరాజు, జురుక్ శాస్త్రిల ఫక్కీలో పేరడిగారడీలో సిద్ధహస్తు డయ్యాడు శ్రీ రమణ, "ఆంధ్రరత్న" దుగ్గిరాల గోపాల కృష్ణయ్య తన సమకాలికులు కొందరిని సెన్సర్ చేసిన తీరులో ఎంతో వ్యంగ్యముంది. "ఆంధ్రపత్రికతోబాటు అమృతాంజనమిచ్చి ఆంధ్రుల తలనొప్పి బాపిన ధన్యుడితడు అని కాశీనాధుని నాగేశ్వరరావు పై ఆయఫ్ విసురు వ్యాఖ్యాతమైనది. ముద్రారాక్షసాలపై ఎన్.సి. శేషాచార్య వెలువరించిన హాస్యవ్యాసమంజరి' తమాషా నవ్వుల పందిరి. ఇక్కడ ప్రస్తావనకు రాని హాస్యబ్రహ్మలు ఇంకా మరెందరో... అందరికీ హాస్యాభివందనాలు. చివరగా ఒక్క మాట - హాస్యం కోసం హాస్యమన్నట్టుగా కాక, హాస్యం ముసుగు వేనుకన్న జీవిత వ్యాఖ్యావాలివి. పాడులోకాన్ని మరమ్మత్తు చేసేందుకు గాను హాస్యమనే చక్కెర పూతతో తయారు చేసిన చేదుగుళికలివి. చాప్లిన్ మార్క్ సామాజిక సందేశాలివి.

## మనసు గీతం

నీలారంభం ఉమాదేవి, బెంగులూరు

అమ్మ వడిలో కనులు విప్పి ఆటలాడిన అమృతవేళ
అమ్మ పాడిన జోలపాటలు గాజుల జలతరంగిణుల
తాళిబొట్లతాళాలు కాలిమువ్వల సవ్వడులు
కలబోసిన నేపధ్యంలో
విన్నానొక మరువలేని అమరగీతం

ఎదుగుతూ ఎదుగుతూ ఎదభాషకు దగ్గరైన
సన్నిహితపు నేస్తగాళ్ళ సంగతులు సంగీతం
వూసులలో వూహలలో రేపటికల అంచులలో
చూసే ప్రతి అందంలో నిండుకున్న ప్రతి అణువున
విన్నానొక మరువలేని అమరగీతం

వయసువలపు మొలకలెత్తి మనసున మురిపాలుతేల్చి
ప్రేమపూల పూతనింపిఅనురాగపు రంగులద్ది
తోడునీడగా వెంట నడచి గుండె గుడిలో నెలవునిచ్చి
పూజించిన మూర్తిలోని అంతులేని మమతలో
విన్నానొక మరువలేని అమరగీతం

చిన్నారుల చిరు చేష్టలు మురిపించే ముద్దుపలుకులు
మర్మంలేనిదరహాసాలు అంతులేని తుంటరి పనులు
తెరిపిలేని పరుగులు, దొరిగితే దొంగనవ్వులు
కన్నవారి మనసులను మోహంలో ముంచెత్తే
మమకారపు బంధంలో
విన్నానొక మరువలేని అమరగీతం

అనుభవాల మెట్లనెక్కి ఔన్నత్యపుటంచుచూసి
హృదయనేత్రం తెరుచుకొని మనసు పరిధి విస్తరించి
ప్రేమ కరుణ స్నేహాలు వెల్లువగా ప్రవహించి
ప్రేమ మార్గం శాంతి మంత్రం విశ్వానికి చాటేలా
విన్నానొక మరువలేని అమరగీతం

## పసిడి పలుకులు

మహనీయుల సూక్తులకు తెలుగుపద్యానుసరణ

పొన్నపల్లి వెంకట కృష్ణయ్య, విశాఖపట్నం

ఉత్తమ పరమారోగ్యం
బుత్తమ సంపత్తి తృప్తి ఉభయులలో రే
కెత్తెడు విశ్వాసంచే
ఉత్తమ బంధంబు నరులకుర్వరలోనన్

ఒకరి నొకరు నిరతము చూ
చు కొనుటయే కాదు ప్రేమసూత్ర మొకే వం
కకు నిరువురు చూచుటె ప్రే
మకు ఉత్తమమైన భాష్య మగు యో చింపన్

వలపే నీ దౌర్బల్యం
బులనెల్లను మిన్నయైన - ముమ్మాటికి ఈ
ఇల నెల్లరలో నీవే
బలిష్ఠతమ జీవివంచు వక్కాణింతున్

రివ్వుమని వీచు గాలిచే క్రొవ్వువత్తి
ఆరిపోవును మిన్నంటు నగ్నికీల
అటువె ఎడబాటు వలన అల్పానురక్తి
అంతరించు - ఘనప్రేమ అతిశయించు

అతడు మారు నంచు ఆశించి పెండ్లాడు
నారి - కాని అతడు మారడసలు
మారదామెయంచు మనసార నమ్మి పెం
డ్లాడు నీరుడు - కాని ఆమె మారు

# దివిసీమ - సాహితీవైభవం

గుడిసేవ. విష్ణుప్రసాద్, అవనిగడ్డ

దివి సీమకు మహోన్నతమైన చరిత్రవుంది. పండితులకు నెలవు కోనసీమ. పౌరుషానికి ప్రతీక పల్నాటి సీమ వీధులలో రతనాలు పోసి అమ్మిన సీమరాయల సీమ ఒక్కొక్కసీమకు ఒక్కొక్క ప్రత్యేకత ఉన్నది. కాని దివిసీమ మాత్రం పండితులకు. కళాకారులకు, రాజకీయ దురంధరులకు, స్వాతంత్ర్య సమరయోధులకు, దేశభక్తులకు నెలవైనది. అన్ని రంగములలో ఆరితేరినది. స్వామీజీలతో సంస్థానాధీశులతో, సంగీత విద్వాంసులతో గాయకులతో, నటులతో, సంపాదకులతో, కవులతో , రచయితలతో, సాహిత్యకారులతో, దర్శకులతో, క్రీడాకారులతో పులకరించిన సీమ దివిసీమ.

ఆంధ్రుల విశిష్ట నర్తకరీతి కూచిపూడి, సుదీర్ఘమైన సముద్రతీరం కృష్ణవేణీసాగర సంగమస్థానం హంసలదీవి సాహితీక్షేత్రం పెదకళ్ళేపల్లి. ఆంధ్ర మహా విష్ణువు విలసిల్లిన శాతవాహనుల తొలి రాజధాని, ఆంధ్రభోజుడు శ్రీ కృష్ణదేవరాయునిచే ఆముక్తమాల్యదరచనకు కారణమైన శ్రీకాకుళం, కాకతీయుల కాలంలో గణపతిదేవునిపేర నిర్మించిన గణపేశ్వరాలయం గౌతమ బుద్ధుని బోధనలు ఆరామాలలో ప్రతిధ్వనించి బౌద్ధకాలపు ఘనచరిత్ర సజీవంగా నిలచిన ఘంటసాల క్షేత్రయ్య పదాలకు మువ్వలందించిన వేణుగోపాలుని క్షేత్రంమొవ్వ, జాతీయ పతాక నిర్మాత పింగళి వెంకయ్య, జన్మస్థానం భట్లపెనుమర్రు అమరగాయకుడు ఘంటసాలకు జన్మనిచ్చిన టేకుపల్లి దివిసీమలోనివే. దివిసీమలో అడుగడుగునా గుడి వుంది ఆ గుడులకు గొప్ప చరిత్రవుంది.

ఆంధ్రరాష్ట్రానికి ఒక కొసనే ఒదిగియున్న చిన్న ప్రాంతం దివిసీమ ఇది భౌగోళికంగా చిన్న దైనప్పటికి సాంస్కృతికంగా జాతీయ, అంతర్జాతీయ స్థాయిలో ఒక విశిష్టతను సంతరించుకున్న సీమఇది.

## ఇదం కన్యా, మమ సుతా

శ్రీ అధిభట్ల కామేశ్వరశర్మ, అబుదబి (UAE)

పసిడి ఊయలలూపి పసిడికొండా నీవు
పవ్వళింపగ జోల పాడినాను
పసిడి గిన్నెలలోన పాల బువ్వను నీకు
కొనగోటి ముద్దగా కుడిపినాను
పసిడి మేడలలోన పసివాడకనుబెంచి
చాల మాలిమితోడ సాకినాను
అసువులన్నియు నీకు అరణమ్ముగానిచ్చి
అత్తింటికిని నిన్ను అంపుచుంటి
ఇల్లు వాకిలే లేనట్టి ఈశు వలచి అరుగుచున్నావు
ఈయమ్మనయ్య విడిచి ఎట్టులుందువో యోమోయని
యేడ్వనమ్మ
కరుడు కొండంటి తండ్రికిన్ కనులు తడిసె

ఈ సీమలో ఎందరో మహానుభావులు జన్మించారు. వివిధరంగాలలో ఆద్యులై తమకంటూ ఒక ప్రత్యేకస్థానాన్ని సంతరించుకున్నారు. మీదు మిక్కిలి తెలుగు సాహిత్యాన్ని సుసంపన్నం చేసిన కవిపండితులు ఉన్నారు, తెలుగు జాతిని మేల్కొలిపిన వైతాళికులు ఉన్నారు.

తెలుగు కళావైదుష్యాన్ని దిగంతవ్యాప్తం చేసిన కళాకోవిదులు ఉన్నారు. మాతృదేశ విముక్తికోసం తమ సర్వస్వం ధారవోసిన త్యాగ మూర్తులున్నారు. వీరంతా దివిసీమ ముద్దుబిడ్డలుగా చెప్పుకోటం కేవలం దివిసీమ ప్రజలకే కాక తెలుగు జాతికి గర్వకారణం.

**సంస్కృత కవులు**

జాయప్పసేనాని : దివిసీమను మొట్టమొదట పాలించిన వారు అయ్యవంశీయులని తెలియచున్నది. అయ్యపినచోడి నేటి తలగడదీవిని -ముఖ్యపట్టణముగా చేసికొని పాలించిన రోజులవి. 1211 కు పూర్వం ఓరుగల్లును పాలిస్తున్న గణపతి దేవుడు దివిసీమపై దండయాత్రచేసి అయ్యపిన చోడిని ఓడించి కయ్యమును వియ్యముగా మార్చుకొని అతని రాజ్యమతనికిచ్చి వేసి అతనిపుత్రికలైన నారమ, పేరమలను వివాహమాడి బావమరదియగు జాయప్పను వెంట తీసికొనిపోయి ఓరుగల్లులో గుండయ్యామాత్యుని వద్ద అనేక విద్యలు నేర్పించి గజసైన్యాధ్యక్షునిగా చేసెను ఆజాయప్పరచించిన నాట్యగ్రంథం 'నృత్తరత్నావళి' బహుశః దివిసీమకు ఇదియే ఆదిగ్రంథమై యుండవచ్చు.

లీలాశుకయోగి : ఆంధ్రుల తొలి రాజధానియైన శ్రీకాకుళంలో జన్మించిన లీలాశుకయోగి 15వ శతాబ్ధికి ప్రారంభం కీ॥శ॥ 1420 ప్రాంతము వాడు. ఇతని మొదటిపేరు బిల్వ మంగళుడు. ఈయన చింతామణి అనువేశ్యను ప్రేమించెను. ఆమె సంగీత, సాహిత్యం నృత్యములందు అసమాన ప్రతిభాశాలి. సోమగిరి యతీంద్రులవారు ఆమెకు ఉపదేశము చేయగా ఆమె యోగినిగా మారిపోగా బిల్వమంగళుడు పరమభక్తునిగా మారి సంస్కృతమున "కృష్ణకర్ణామృతమను" గొప్ప గ్రంధమును రచించెను. ఇది గొప్ప రసవత్ప్రబంధము.

నుసర్లబ్రహ్మన్నకవి : వీరిది పెదకళ్ళేపల్లి 1715 లోని వీరు సాహిత్యచక్రవర్తిగా పేరుపొందారు. వీరు అనేక సంస్కృత గ్రంథములను రచించారు. అవి అన్నియును అముద్రితములే. సుప్రసిద్ధ వాగ్గేయకారులైన నుసర్లదక్షిణామూర్తి శాస్త్రి గారు వీరి వంశములోనివారే.

దైవజ్ఞసూర్యసూరి: వీరు గొప్ప సంస్కృత పండితులు "రామకృష్ణవిలోమ' కావ్యమను ద్వ్యర్ధి కావ్యమును రచించిరి ఇందులో 36 శ్లోకాలుంటాయి. ఇందు ప్రతి శ్లోకము అనులోమ, విలోమముగా చదివిన ఛందోభంగమురాదు. అర్థము చెడదు.

తెలుగుకవులు : పింగళిసూరనార్యుడు: 530 చిట్టూర్పు జన్మస్థలం గరుడ పురాణం - ద్వ్యర్థికావ్యమైన రాఘవ పాండవీయం. కళాపూర్ణోదయం ప్రభావతీ ప్రద్యుమ్నం గిరిజాకళ్యాణం అనుగ్రంథాలు

రచించిన వీరు శ్రీ కృష్ణ దేవరాయుని ఆస్థానకవి. రాజశేఖరచరిత్రను రచించిన మరో భువన విజయకవి మాదయ్య గారి మల్లన అయ్యంకి నుంచి వెళ్ళినవారు.

ముద్దుపళని : రాధికాస్వాంతన రచయిత్రి "ముద్దుపళని" 1735 జన్మస్థానం శ్రీకాకుళం. శ్రీకాకుళంలో జన్మించిన లొల్ల లక్ష్మీధరపండితుడు రసగంగాధరానికి అనువాదకర్త అయిన శృంగారశ్రీరంగాచార్యులు, దివిసీమవారు.

భోజరాజీయము, రసార్ణవము, ఛందోదర్పణము మున్నగు గ్రంధాలను అందించిన 15వ శతాబ్ధికి చెందిన అనంతామాత్యుడు దివిసీమ మోదుగముడి లేదా పెనమకూరుకు చెందిన వాడు. శ్రీ రంగధామం అనే రెండాశ్వాసాల ప్రబంధాన్ని రచించిన దీవిరామణాచార్యులు భావదేవరపల్లిలో జన్మించారు. చిత్రచరిత్రం అనే హాస్యరసగ్రంధాన్ని రచించిన 1835 కి చెందిన నాదెళ్ళ వెంకట నృసింహకవి మధురాపురానికి చెందినవారు. ప్రబంధాలు, నాటకాలు, హిందీనాటకాలు, శతకాలు, గ్రంధాలు మొత్తం 114 గ్రంధాలు వ్రాసిన నాదెళ్ళ పురుషోత్తమ కవి 1863 సీతారామపురాగ్రహారంతో జన్మించినమహాకవి. పింగళి కాటూరి జంటకవులలో ఒకరైన పింగళి లక్ష్మీకాంతం గారు పౌలస్త్య హృదయం, సౌందరనందము, తొలకరి మున్నగునవి వ్రాశారు. వీరి స్వంతరచన మధుర పండిత రాజము. వీరు దివిసీమ చిట్టూర్పుకు చెందినవారు అడ్డుమిల్లి పాపయ్యశాస్త్రి, ములుకుట్ల వెంకట కృష్ణశాస్త్రి, పళ్ళెపూర్ణ ప్రజ్ఞాచార్యులు, కోపల్లె వెంకట రత్నకవి, వేమూరి సీతారామశాస్త్రి, చిత్రకవి దేవినేని సూరయ్య వంటి మహాకవుల జన్మస్థానం చల్లపల్లి.

సాహితీక్షేత్రంగా నిలచిన పెదకళ్ళేపల్లిలో అనేక మంది మహాకవులుద్భవించారు. కోపల్లె వెంకట రత్నకవి, నవ్యాఖ్యాన స్తోత్రకదంబ రచయిత సుసర్ల బ్రహ్మన్న శాస్త్రి (సాహిత్య చక్రవర్తి) పరిశోధకాగ్రణి నీతికథ, కదుపుతీపి, కపోతకథ, విశ్వాసము మూన్నాళ్ళ ముచ్చట్లు రచించిన రచయిత, వేటూరి ప్రభాకర శాస్త్రి, నానారాజన్య చరిత్ర రచయిత కవిరత్న శ్రీరాం వీర బ్రహ్మకవి, కోటవర్తి నాగేశ్వర శర్మ మున్నగువారు తెలుగుసాహిత్యాన్ని సుసంపన్నం చేశారు.

ప్రఖ్యాత కవిగా, సాహిత్యవిమర్శకులుగా, ఉపన్యాసకులుగా నటులుగా, జ్యోతిష్యశాస్త్రవేత్తగా ఆంధ్రరాష్ట్రమున ఖ్యాతిగాంచి 28 సంవత్సరములు మాత్రమే జీవించిన పెదకళ్ళేపల్లిలో జన్మించిన కొడాలి సుబ్బారావు గారు భావకవితాస్రవంతికి శ్రీకారంచుట్టి మొట్టమొదటి భావకవితా గ్రంధంగా "హంపీక్షేత్రాన్ని సాక్షాత్కరింపజేశారు. దువ్వూరి రామిరెడ్డి, దేవులపల్లి కృష్ణశాస్త్రి వంటి మహామహులెందరో హంపీక్షేత్రమహత్యంచేత ప్రభావితులై భావకవులయ్యారు. హంపీక్షేత్రములో సుబ్బరావుగారు శిలలను ద్రవింపజేశారు. అటువంటి మహానుభావుని జన్మస్థలం దివిసీమ, అవనిగడ్డలో జన్మించిన ద్రోణావఝుల సాంబశివరావు, ఆరాధనా మాసపత్రిక సంపాదకుడు, కృష్ణాస్రవంతి రచయిత పరిశోధకాగ్రణిదీవి లక్ష్మీ నరసింహాచార్యులు.

బ్రహ్మవిద్య ఏకాంతసేవల రచయిత చిర్రవూరు కామేశ్వరరావు జ్యోస్యుల సీతారామశాస్త్రి, కాకాని నరసింహారావు మున్నగు కవులు

### "సూర్యుడా, ఓ సూర్యుడా..!

ఎ సువర్ణ, బెంగుళూరు

ఓ సూర్యుడా... నీ పసుపు పచ్చటి బంగారు వన్నె కిరణాలకు రక్త వర్ణకిరణాలను కలుపుకుని ఈ భూమి మీదకు వెదజల్లాకే జీవులకు తెల్లగా తెలవారుతుంది. మూసిన కనురెప్పలు తెరుచుకుంటాయి. అలసినకళ్లు తిరిగి బలాన్ని పుంజుకుంటాయి, నీ కాంతికి చీకటి భయ పడిపారిపోతుంది. కొన్ని సమయాలలో నీలోని అతి వేడి ఎన్నింటి నోదహిస్తుంది.. కానీ జాలనేదే లేని హృదయాలను దహించకపోగా కనీసం కరిగించను కూడా లేదు. చీకటిని మాత్రం తరిమేస్తుంది. నీలోని అనంతమైన వెలుతురు చూడలేని అజ్ఞానుల జీవితాలు మాత్రం అజ్ఞానాంధకారంలోనే మునిగి వుంటాయి...

....ఓ సూర్యుడా.... !

సుప్రసిద్ధులు, పాలపర్తి నాగేశ్వరరావు, వేకనూరు నివాసి భాగవత దశమస్కందానికి టీకను వ్రాశారు.

కవిపాదుషా పువ్వాడ శేషగిరిరావు గారిది దివిసీమలోని మొవ్వ. ఉభయ భాషాప్రవీణులు గోవత్సము, ధారా, తాజ్‌మహాల్ వంటి అనేక ఖండకావ్యాలు, ఏరువాక, పాలవెల్లి వంటి నాటకములు రక్తతర్పణములను యక్షగానములు రచించారు.

చిత్రచిత్రప్రభావ దాక్షిణ్యభావ

హతవిమత జీవ శ్రీకాకుళాంధ్రదేవ అనుమకుటంతో నిందాస్తుతితో రచించిన ఆంధ్రనాయక శతకకర్తకాసుల పురుషోత్తమ కవి పెదప్రోలు నివాసి హంసలదీవి వేణుగోపాలశతకమునుకూడా వీరు రచించారు.

1519 ఫిబ్రవరి 11వ తూర్పు దిగ్విజయ యాత్ర సందర్భముగా కృష్ణానదిని దాటి శ్రీకాకుళమువచ్చి ఆంధ్ర మహావిష్ణుప్రదేశాలయ మంటపమందు నిద్రించిన శ్రీ కృష్ణ దేవరాయునికి స్వామికలలో కన్పించి ఆముక్త మాల్యదను తెలుగులో వ్రాయమనికోరగా ఆయన విష్ణుచిత్తీయమను ఆముక్త మాల్యదకు అచ్చటనే శ్రీ కారం చుట్టినట్లు ఆ గ్రంధంలో చెప్పుకున్నారు.

ప్రసిద్ధవాగ్గేయ కారులు మొవ్వక్షేత్రయ్య, నివాసం మొవ్వ దేశాటన చేస్తూ భక్తి పారవశ్యంతో అనేక పదాలు రచించారు. 1845లో మొవ్వలో జన్మించిన పువ్వాడ రామదాసు కవి కూడా వాగ్గేయకారులే ఆయన భీమేశ్వరుని మీద పెక్కుగేయాలు రచించిపాడిరి.

కృష్ణలీలాతరంగిణీ రచయిత నారాయణ తీర్థులు, కూచిపూడి స్రష్ట, భాగవత ద్వాదశ స్కందాలను గేయరూపంలో రచించి పాడిన సిద్ధేంద్రయోగి (గోపాలకృష్ణ భారతి) లీలాశుక యోగి కృష్ణ కర్ణామృతమనే తరంగాలు కర్త, ఆలూరుసారంగపాణి, లంక శంకరాభరణం నరసయ్య, సిద్ధాబత్తులు రంగదాసు వక్కలగడ్డ కోటయ్య, వక్కలగడ్డ సుబ్బారాయుడు, ఈమని సుబ్బారాయుడు, 'శ్రీరామదూతం శిరసానమామి" అనేమకుటంతో రామాయణాని గేయంగా రచించిన ముక్తేవి

సుందరరావుదాసు మున్నగువారు పదకవులు వాగ్గేయకారులుగా ప్రసిద్ధిచెందిన దివిసీమ వాగ్గేయకారులు.

ఇక దివిసీమనుండి వచ్చిన పత్రికానంపాదకులు పత్రికాధిపతులు ప్రసిద్ధ కృష్ణాపత్రిక సంపాదకులు ముట్నూరి కృష్ణారావు గారు. Common Wheel ఆంగ్రపత్రిక సంపాదకులు లంక సత్యన్నారాయణ చోడవరం, 'హిందూ' ఉపసంపాదకులు వేములపల్లి కృష్ణారావు, బుధవిధేయిని పత్రిక సంపాదకులు నాదెళ్ళ పురుషోత్తమకవి, శ్రీయుతులు రాజా అంకినీడు ప్రసాద్ జస్టిన్ ఆంగ్లపత్రిక, "నవ్యాంధ్రపత్రికను మండలి వేంకట కృష్ణారావు గారు. కొల్లూరి కోటేశ్వరరావు గారు. తెలుగు విద్యార్థి మండలిబుద్ధ ప్రసాద్ - గాంధీక్షేత్రం పత్రిక, పునుకొల్లు సత్యనారాయణ స్నేహమంజరి పశువర్ధిని గ్రంధాలయ సర్వసం సంపాదక వర్గంలోని కృషిపండిట్ గొట్టిపాటి వెంకట సుబ్బయ్య 'వాహిని' సంపాదకులు రైతు గొట్టిపాటి వెంకట సుబ్బయ్య అయ్యంకి వెంకట రమణయ్య దివ్య జ్ఞానదీపిక "ఆంధ్రప్రభ" ఉపసంపాదకులుగా లంక వెంకట రమణ ఆంధ్రప్రత్రిక, ఆంధ్రప్రభల సంపాదకవర్గంలో వేమూరి వెంకట నరసింహారావు, "స్వాతి" పత్రిక, వేమూరి బలరాం మున్నగు వారు దివిసీమ ఆణిముత్యాలు.

శతక కవులకు పెట్టిందిపేరు దివిసీమ షుమారు 50 మందికి పైగా శతక కవులు దివిసీమలో ఉన్నారు.

కాసుల పురుషోత్తమకవి, ఉండిఅప్పలరావు, కోపూడి శ్రీనివాసరావు, వాడ్రేవు కామరాజు, శ్రీరాం వీరబ్రహ్మకవి, పల్లెపూర్ణప్రజ్ఞాచార్యులు, దీవిలక్ష్మీపతి, సింహాద్రి వెంకట చార్యులు, వేమూరి సీతారామశాస్త్రి, మహంకాళ వెంకటేశ్వరరావు, కోవెల రాఘవాచార్యులు, నాదెళ్ళ పురుషోత్తమకవి. భమిడిపాటి వెంకట లక్ష్మీనరసింహాశాస్త్రి, ముక్తేవి పెరుమాళ్ళయ్య, మారేమండ హనుమంతరాయకవి, మున్నగు వారు ఉన్నారు. ఇంకా ఆధునిక కవులు శతక రచనలనేకం చేశారు.

పెదముత్తేవి ఆధ్యాత్మిక క్షేత్రం, శ్రీశ్రీశ్రీ 1008 సీతారామయతీంద్రులు, శ్రీశ్రీశ్రీ లక్ష్మణయతీంద్రులు శ్రీశ్రీశ్రీ సీతారాం, ముక్తేవి సుందరరామదాసు, ముక్తేవి పెరుమాళ్ళయ్య, శేషగిరి సుబ్రహణ్య కవి, ఆధ్యాత్మిక రచనలనేకం చేశారు. లంకసుందరం, పువ్వాడ శ్రీరాములు చిత్రావూరు కామేశ్వరరావు, చిన్నమ్మ, వెంకట దాస స్వామి, అమ్ముల సాంబశివరావు, చిన్నమరామదాసు, గుడిసేవ నరసింహారావు, చింతలపాటి లక్ష్మీనరసింహకవి, భాగవతుల రామాయమ్మ, కుర్తాళం పీఠాధిపతి శ్రీశ్రీశ్రీ త్రివిక్రమ రామానంద భారతీ స్వామి గొట్టిపాటి మహాలక్ష్మమ్మ. హరినాగభూషణ అష్టాక్షరిజియరు, వక్కపట్ల ఉషాద్రిపతి వంటి వారు. దివిసీమ వాసుల ఆధ్యాత్మిక సాహిత్యం ఎంతో సుసంపన్నమైనది.

ముఖ్యంగా జ్ఞానపీఠ అవార్డుగ్రహీత కవిసామ్రాట్ విశ్వనాధ సత్యన్నారాయణ గారు విశ్వనాథపల్లి తన స్వగ్రామంగా వ్రాసుకొన్నారు. వీరి వీరడు నవల కథ అంతయూ విశ్వనాథపల్లి ఆధారంగా నడిచినదే.

అవధాన విద్యకు కూడా దివిసీమ ప్రాతినిధ్యం ఎంతో వుంది పింగళి లక్ష్మీకాంతం గారు అష్టావధాన శతావధానాలు చేశారు. నాదెళ్ళ మేధాదక్షిణమూర్తిశాస్త్రి, మధ్యశ్రీ, మహోపాధ్యాయ వెంకట రత్నకవి అష్టావధానాలు చేశారు. దీవి లక్ష్మీనరసింహాచార్యులు అష్టావధాన, నేత్రావధానాలు చేశారు. నాదెళ్ళ పురుషోత్తమకవి కోటమర్తి నాగేశ్వరరావు అష్టావధానాలు చేశారు. ప్రస్తుతం పాలపర్తి శ్యామలా నంద ప్రసాద్ అష్టావధానాలు శతావధానాలు, ద్విభాషా శతావధానాలు చేస్తున్నారు.

ఆధునికవులలో బహుగ్రంథకర్త అరిపిరాల విశ్వం బహుగ్రంధకర్త వేమూరి వేంకట రామనాధం ప్రఖ్యాత నవలారచయిత్రి శ్రీమతి యద్దనపూడి సులోచనారాణి, ప్రముఖ కధారచయిత్రి శ్రీమతి తురగాజానకీ రాణి, డా॥ యార్లగడ్డ బాలగంగాధరరావు, లంకవెంకటరమణ, పోలవరపు కోటేశ్వరరావు, వేటూరి సుందర రామమూర్తి, పూసల వెంకటేశ్వరరావు, కోసూరు పున్నయ్య, మండల బుద్ధప్రసాద్, ప్రొ॥ ఎం.వి. రామశర్మ, పువ్వాడ తిక్కన సోమయాజి. దాసి బసవయ్య మున్నగు లబ్ధప్రతిష్టులైన ప్రఖ్యాత కవులు, రచయితలు తెలుగు సాహిత్యాన్ని సుసంపన్నంచేస్తున్నారు.

చింతలపాటి పూర్ణచంద్రరావు, చింతలపాటి మురళీకృష్ణ, ఉమ్మిడి శివలింగం, డి నాగేశ్వరరావు, సింహాద్రి శ్రీరంగం, సింహాద్రి వెంకటేశ్వరరావు గొరుముచ్చు సూర్యనారాయణ, వల్లూరు వేంకట నత్యనారాయణ, కె. వి. రంగనాధమూర్తి, చిలువూరు రామలింగేశ్వరరావు, సింహాద్రిపద్మ, ఆది అశోక్, డా॥ మాల యాద్రి, పూషడపు బాలసుబ్బారావు, సింహాద్రి బసవయ్య, నగిరి బాల వెంకటేశ్వరరావు, డి.కె. ప్రభాకరరావు మొదలగు కవులు రచయితలు సాహితీ సేద్యం చేస్తున్న వారెందరో ఉన్నారు.

ఇంతమంది జగద్విఖ్యాతులు, లబ్ధిప్రతిష్టులు, వర్ధమాన రచయితలతో దివిసీమ సాహితీ సౌరభాలు అంతటా వ్యాప్తిస్తున్నాయనటంలో అతిశయోక్తికాదు. సాహితీరంగంలో కూడా దివిసీమ దివ్యసీమగా భాసిస్తోంది.

# కృష్ణాజిల్లాలోని ఆధునిక వచన కవిత్వం

డా॥ అద్దేపల్లి రామమోహనరావు, హైదారాబాద్

కృష్ణాజిల్లాలో, జాతీయోద్యమ కాలంలో 'కృష్ణాపత్రిక' సంపాదకులు ముట్నూరు కృష్ణారావుగారి వెలుగులో, ఎంతో మంది గొప్ప పద్యకవులు ప్రసిద్ధులైనవారు. సుమారు 1960 సం॥ల నుండి వచన కవిత్వానికి వికాసదశ ప్రారంభమైందను కుంటే, అంతకుముందు తెలంగాణా పోరాట ప్రభావం చేతనూ, సామ్యవాద భావాల నేపధ్యంలోనూ, కృష్ణాజిల్లాలో వచన కవిత్వం రాసినవారిలో బలమైన గొంతు గల కవి రెంటాల గోపాలకృష్ణ. ఆ రోజుల్లో లయబద్ధ కవిత్వానికి ఎక్కువ ప్రాబల్యం ఉండేది. మధ్యలో వచన కవిత్వం కూడా కొందరు కవులు రాశారు. అందులో ఉత్తమ కవితలు రాసినవారు రెంటాల గోపాలకృష్ణ. సంఘర్షణ, సర్పయాగం మొదలైన పుస్తకాల్ని ఆయన పోరాట నేపధ్యంలో రాశారు. వర్గ సంఘర్షణ ఆయన కవిత్వానికి అంత స్సూత్రం ఆవేశం ఆయన జీవధాతువు. ఆయన రాసిన ఒక గొప్ప వచన కవిత "నగరంలో రాత్రి' నగర సంస్కృతి భానతీచమూలాల్ని కబళింపచేస్తూ విస్తరించిన ఆ రోజుల్లో, చాలామంది కవులు నగరీకరణలోని వికృత లక్షణాల్ని నిరసిస్తూ కవిత్వం రాశారు. ఆ నిరసన "నగరంలో రాత్రి' కవితలో బలంగా ధ్వనిస్తుంది. కవి, విజయవాడలో స్థిరపడినవారు కాబట్టి ఆయన దర్శనంలోని సూక్ష్మత, ఆవేశం ప్రతి అక్షరంలోనూ కపిపిస్తుంది. ముఖ్యంగా వ్యభిచారమయమైన పరిస్థితిని వర్ణిస్తున్నాడు.

'నెత్తిపై నింగి'
మృత్యువు ముచ్చట ముడిలా వ్రేలాడుతోంది
పద్దెనిమిది గంటలుమండిన నగర కాష్ఠంపై
కన్నీటి చుక్కలు రాలుస్తోంది
నగరం నడిబొడ్డు దొరగారిది ప్రాణం
దివాణంలో సాగుతున్నది బూతుపురాణం.....
నగరంలో రాత్రి కళ్ళుమూసి నడిచింది
నగరంలో రాత్రి వేయిపాపాల వడగండ్ల వానలో తడిసింది.
నగరంలో రాత్రి నగ్నంగా కూచుంది
నగరంలో రాత్రి స్నిగ్ధంగా పూచింది
నగరంలో రాత్రి వయసంతా కొలిచి తెచ్చింది
నగరంలో రాత్రి వలపంతా ఒలిచి యిచ్చింది.

భావంలోని విసురు కోసం పునరావృత్తి శిల్పాన్ని రెంటాల బాగా వినియోగించుకున్నాడు.

ఆధునికయుగంలో, అన్ని ప్రాంతాల్లోవలె కృష్ణాజిల్లాలోనూ, ఆత్మాశ్రయ కవిత్వం, సమాజాశ్రితకవిత్వం రెండు ఉపాయలుగా వచ్చింది. ఆత్మాశ్రయకవిత్వం అంటే తన బాధల్నీ, తన గాథల్నీ చేప్పుకునే కవిత్వం అని మాత్రమే కాదు. సంఘర్షణ పంథా నుండి పక్కకువెళ్ళి, అనుభూతి, తాత్వికత, మొదలైన అంశాలు ప్రధానంగా రాసే కవిత్వం. ఇలాటి కవిత్వాన్ని కృష్ణాజిల్లాలో మొదటి వరసలో రాసిన వాళ్ళలో అరిపిరాల విశ్వం ముఖ్యుడు. "కాలం గీస్తున్నగీతలు" లో ఆయన జీవితాన్ని యిలా నిర్వచిస్తాడు.

అనుభవాల నేలపై
ఇంక విజ్ఞాపకాల చుక్కలు
చెట్టాపట్టాలు పట్టి
వేసుకున్న బొమ్మజీవితం
కల్పించుకుంటే దీనికున్నంత అర్థం
విప్పి చెప్పడానికి లేదు'

జ్ఞాపకాలే జీవితంలో ప్రధానంగా మిగిలిపోయేవి. ఒక అనుభవం జరిగినప్పుడు ఆ అనుభవంలో కరిగిపోవు జ్ఞాపకాలు. ఒక జీవిత చిత్రాన్ని గీయాలంటే జ్ఞాపకాలు మాత్రమే భాగ స్వాములౌతాయి. ఇలా జీవన తత్వాన్ని గురించిన ఆలోచనలు విశ్వంలో ఎక్కువ.

తాత్విక ఆత్మాశ్రయభావాలకే ప్రాధాన్యమిచ్చి బాధర్ అనే పేరుతో త్రిపురనేని మహారధి కవిత్వం రాశాడు. వైయుక్తికతా పరిశీలన ముఖ్యంగా కనిపిస్తుంది.

ఊహల పొలిమేరలు అనే కవితలో వ్యక్తిలో గూఢమైన శక్తిని గురించి యిలా చెప్తాడు.

'కమ్మని కారుమబ్బులతో కరుణార్ద్ర హృద్వీ
గమనించు చిచ్ఛక్తికి నమోస్తు
వెన్నెల తీగ సొంపులలో మరుతాక్త శోభలు
ఘటించు పరమశక్తికి నమోస్తు
హృత్వాళ సీమ జనియించి లోకమంతా
పెకలించి కవియ జుట్టిన రుక్తికి నమోస్తు....
మహా మానవుడా ! అజేయుడా !

మనిషిలోనూ, సమస్త ప్రకృతిలోనూ ఒకే శక్తి ప్రకాశిస్తోందని పై పాదాల్లో స్ఫురిస్తుంది.

నార్ల చిరంజీవి మార్క్సిస్టు భావాలతో ప్రేరణ పొందిన కవి. ప్రగతిశీలత ఆయన కవితల్లో బలంగా కనిపిస్తుంది. 'కాలరథం' లో ఇలా అంటాడు.

మంచు వంటిది గతం
మళ్ళీ కనిపించదు
వెళ్ళిపోయిందెపుడో..
నీలో కుసుమించిన
పూలను చిదిమేస్తూ
గతం వెళ్ళిపోయింది
స్మృతి గర్భంలోనికి
కత్తివంటికాలాన్ని
గతం ప్రసవించింది

గతాన్ని పట్టుకుని వేలాడే వారికి చేసే వర్తమాన కాల ఉద్బోధపై కవితలో కనపిస్తుంది. 'కత్తివంటి కాలాన్ని గతం ప్రసవించింది.' అన్నప్పుడు గత కాలంకంటె అందులోంచి వచ్చిన వర్తమానం ఎక్కువ వాడిగలది అని చెప్తున్నాడు కవి. అందుకే వర్తమానాన్ని 'కత్తివంటి కాలాన్ని' అంటాడు.

అజంతా చాలాకాలం విజయవాడలో స్థిరపడిన కవి. అజంతా కవిత్వంలో ప్రయోగశీలి. కొన్ని సామాజిక కవితలు రాసినా, తన ముద్రను స్వీయవేదనాత్మక ప్రతిఫలనంలో గుర్తించాడు. పాశ్చాత్య కవిత్వ ప్రభావం, జీవిత వైఫల్య భావనలో గాఢంగా పొందినవాడు. మృత్యు సంబంధమైన భావచిత్రరచనకు ఆద్యుడు ఈయనే. సామాజిక వస్తువుతో ఈయన రాసిన 'చెట్లుకూలుతున్న దృశ్యం కవిత భావచిత్రాల్ని నిక్షేపించిన రచన. వెంకట్రావు అనే నిరుద్యోగిని యిలా బొమ్మకడతాడు.

"తలక్రిందులైన స్వప్నం మీద శల్యాకారంగా కూర్చున్న కుర్రవాడు
ఆపాదమస్తకం సూదులతో ముస్తాబై ఉన్నవాడు
అతని ముఖం నిండా స్ఫోటకం మచ్చలు
కళ్ళలో శిలావిగ్రహాల వీక్షణలు
అతని చుట్టూ పరాజయ భారంతో క్రుంగుతున్న వృక్షాలు
అదే దృశ్యాన్ని ఇంకా ఉవ్వెత్తు ఉన్న భూతద్దాలతో చూడవచ్చు"

ఇలాటి భావ చిత్రరచన అప్పట్లో ఒక కొత్త అభివ్యక్తి

తర్వాతి తరానికి వచ్చేటప్పటికి, సుమారు 60 సం॥ల తర్వాత వచన కవితకి సమకాలీన కవితారూపాల్లో ప్రధాన స్రవంతి గౌరవం వచ్చింది.

అప్పుడప్పుడే 'వచనగేయం' అన్నపదం 'వచన కవిత' గా మారుతోంది. ఈ సమయంలో కృష్ణాజిల్లాలో ముగ్గురు కవుల్ని చెప్పుకోవలసి ఉంది. 60 సం॥లలో సామాజిక వైరుధ్య స్పృహ ఉండడంతో పాటు, అజంతాతో ప్రారంభమైన, ఆంగ్లకవితా ప్రభావం కూడా ఒకస్థాయిలో ఉంది. సామాజిక వైరుధ్యాల్లోంచి ఆంగ్ల ప్రభావంలోంచి కూడా కృష్ణాజిల్లాలో ఇతర ప్రాంతాలకు వలెనే కవులు చైతన్యవంతులయ్యారు.

వేగుంట మోహన్ ప్రసాద్ పూర్తిగా తన స్ఫూర్తిని ఆంగ్లకవుల నుండి తీసుకున్నాడు. సమకాలీన ఆంగ్ల కవిత్వంలో తన కవిత్వాన్ని మమేకం చేసుకునేటంతటి ధోరణి వేగుంటలో ఉన్నట్లు మరొకరిలో కనపించదు సమకాలీన ఆంగ్ల కవులపై ఆయన ఎన్నో వ్యాసాలు రాశాడు. సమకాలీన ఆంగ్లకవుల ప్రభావం వల్లనే ఆయన శైలి క్లిష్టతనూ, అస్పష్టతనూ, కొన్ని చోట్ల అర్థమే అవగాహన కాని ధోరణిని ప్రదర్శిస్తుంది. సామాజికతా దృష్టి ఆయనలో ప్రభావం కాదు అనుభూతి వైచిత్రి, తాత్విక ఆలోచనలూ, ఆత్మాశ్రయభావనలూ ఎక్కువగా పరుచుకుని ఉంటే ఈయన అభివ్యక్తిలో కొత్తదనం అందరూ గ్రహించారు. మధ్యమధ్యలో సామాజికత కను దగిలినా, అభివ్యక్తి వైచిత్రి, ఆత్మవేదన మాత్రమే వేగుంట కవిత్వంలో ప్రధానసూత్రంగా ఉంటే 'సుప్తచిత్రాలు' లో ఇలా అంటాడు.

కలలు తేలి పోతాయేగదా యిక నా కాంతి ఈదుకుంటూ
పంకా గాలిలోంచి కిటికీ వెలుపల నీడలో నిద్రిస్తుంది.
రాత్రి నిలవదు: నిద్ర ఆగదు: పొగపీల్చరాదు

వేకువలోనే సూర్యకిరణాలు వొచ్చి చీకటి పాటి దున్ను దిబ్బల్ని
పెళ్ళగించి వేసినా బావుల్లో నీరూరుతూనే ఉంటుంది.

సంబంధం లేనట్లుగా కనిపించే పదాల్నీ పదబంధాల్నీ భావాల్నీ పక్క పక్కనే రాయడం ఈయన నిర్మాణ పద్ధతి 'చితి చింత' రాహస్తంత్రి మొదలైనవి వెలువరించారు.

సామాజిక వైరుధ్యాల్లోంచి కలిగిన ఆవేశం ఇద్దరిలో స్ఫుటంగా కనిపించింది. ఒకరు సి. విజయలక్ష్మి. విజయలక్ష్మికి ముందు నుండి మార్క్సిస్టు భావనిమగ్నత ఉంది. ఎంతో కసితో ఆయన సమకాలీన సామాజిక దౌష్ట్యాలన్నిటినీ తన కవిత్వంలో ప్రతిబింబింప జేశాడు. శక్తిమంతమైన తెలుగుపదాల తీవ్రశైలి ఆయనకు ముఖ్యం భావచిత్రాది శిల్పాల ద్వారా చెప్పడం ఆయన మార్గంగా కనిపించదు. ప్రజల దగ్గరకు వెళ్లే శైలి తెలుగు సాహిత్యంలో గురజాడనించి ప్రవహిస్తూ వస్తోంది. ఆ ధోరణి సి.వి.లో ఉంది. సంఘంలో అన్ని విధాలైన

## మట్టి

సింహాద్రి పద్మ, అవనిగడ్డ

జన్మాంతరాల సౌభాగ్యాన్ని
తన గర్భంలో దాచుకుంది నేలతల్లి !
కోట్ల జీవరాశుల జన్మకు,
పురిటి నొప్పులతో పునీతమైన పుడమి తల్లికి
ఏం చేస్తే ఋణం తీరుతుంది.......!
జన్మను, జీవచైతన్య జలధారను,
మేధో సంపత్తి నిచ్చిన నేల తల్లికి,
ఘనీభవించిన సమస్యల దుఃఖం!
నేల మాగాణి లో విత్తనం శాపగ్రస్తమై
కలల పంట ఆకలి ఋతువైనప్పుడు,
తరతరాల రైతుల ఆత్మఘోషతో
విలపించింది... పుడమితల్లి!
పొలాల గాలి పట్టణాలకు సాగినప్పుడు
సంస్కృతి "సువాసిని" భూమాతకు
కరిగే 'బొట్టు' కన్నీటిబొట్టు !
భవన నిర్మాణాల కోసం, భూగర్భం గర్భశోకమైనా.......!
రొయ్యల కయ్యలతో జీవన సారం ఎడారిగ మారినా........!
ఆశల ఒయాసిస్సు పుడమి తల్లి !
నీళ్ళాడిన మట్టితల్లికి నీళ్ళు బావిరక్కసి ముల్లై గొంతు నులిమినా,
బడబాగ్ని బాధల గుండం లో స్రవించిన రక్తం ఆమె వీరతిలకం.!
మట్టి సావాసం చేసేవారికి
ఆకలి వికృతి, మానవత్వపు గర్జనలు తెలుస్తాయి!
మట్టికి మోసం తెలీదు!
క్షేత్రాన్ని, బీజాన్ని, పంటని, పశువుని
సమస్తాన్ని మోసం చేయగలిగిన మనిషి......
మట్టి కావలసిందే!
మనిషి కన్న మట్టి గొప్పది!

పద్యాల్నీ అక్షర ఖడ్గంతో నరికెయ్యడం ఆయన కవిత్వంలో కనిపించే ముఖ్యమైన లక్షణం. అప్పట్లో ఆయన 'కారుచీకట్లో కాంతిరేఖ' బాగా సంచలనం కలిగించింది. నికరమైన వాస్తవికత, సూక్ష్మాంశాలతో కలిసి తీవ్రమైన తెలుగుశైలిలో ప్రవహించడం ఆయన శైలి ప్రత్యేకత. వేశ్యాగృహాన్ని గూర్చి చెప్పిన 'శోకంలో అశోకనిలయం లోని కొన్ని పంక్తులు

"పాసింజరొచ్చాడు ఏయ్ రండి"

అమ్మలేని వాళ్ళూ అయ్యలేని వాళ్ళూ

దిక్కులేనివాళ్ళూ కుక్క బతుకు వాళ్ళూ

కట్నం డబ్బులు పిగలక పెళ్ళిగాక

ఉద్రేకం పట్టలేక ఊళ్ళో కెక్కిన వాళ్ళూ

విధవలయ్యి వెధవలతో పూరికెత్తిన వాళ్ళూ

ఎంగిలిస్తర్లాకు బతుకులీడ్చుతోన్న వాళ్ళూ

ఎదిగిన దానికి పెళ్ళని తలపెట్టిన దౌర్భాగ్యుల చెల్లెళ్ళూ

అత్తమామల పోరుకు అయ్యగార్ల పొగరుకూ

తాళలేక నుయ్యి గొయ్యి చేతగాక

కడుపు కొరకు పడువువృత్తి చేబట్టిన కోడళ్ళూ

కోట్ల కోట్ల హేతువులచే కులం లేని బొగరువాళ్ళూ

అప్పుడు పెట్టిన కేకకు నిక్కబొడుచుకు విన్నారు

పి. విజయలక్ష్మికి అభ్యుదయ కవితాస్ఫూర్తి ఆ రోజుల్లో స్పష్టంగా ఉంది.

మూడో కవి అద్దేపల్లి రామమోహనరావు. అద్దేపల్లిదీ తీవ్రమైన సామాజిక వైరుధ్యాల పట్ల క్రోధం లోంచి ఆవేశంలోంచి పుట్టిన కవిత్వమే. ఐతే అప్పటికి ఈ వైరుధ్యాలకీ మార్క్సిస్టు భావాల పరిష్కారసిద్ధాంతాలకీ సంబంధించిన ప్రేరణ లేదు. అయితే కవితా శిల్పం తాలూకు ప్రేరణ బాగా ఉన్నవాడు. అంతకుముందు గొప్ప నిర్మాణ దక్షులైన కవులందర్నీ ప్రత్యేక సిద్ధాంత నిబద్ధతకు సంబంధం లేకుండా అధ్యయనం చేశాడు. పద్యరచనలో ప్రౌఢిమ కూడా సాధించాడు. అయితే సామాజిక వైరుధ్య వేదన ప్రధానమయ్యే టప్పటికి వచన కవితను వాహికగా చేసుకున్నాడు. సామాజిక మైన కసి ఎంత ఉన్నా, అది నిర్మాణపరమైన ఏకాగ్రతలోంచి మాత్రమే ప్రవహించడం అతని కవిత్వంలో కనిపిస్తుంది. ఆ రోజుల్లో వచ్చిన అంతర్జ్వాల ప్రగతిశీలకవులందర్నీ ఆకర్షించడానికి కారణం ఇదే. ఆవేశంలో నిగ్రహం, అభివ్యక్తిలో జాగ్రత సామాజికతలోని విస్తృతీ, ఆనాటికి ఒక కొత్త సంచలనం కలిగించింది. అద్దేపల్లి నడకకు అంతర్యాల నుండి ఒక ఉదాహరణ 'చీకటి నీడలు' నుండి 'ప్రతి వాడి చుట్టూ సంఘమొక చెరసాల కట్టింది ప్రతివాడి కంట్లో సంఘమొక కన్నీటి తెర నిలిపింది. ఈ చీకటి సముద్రపుటంచు చివర తూర్పు దిక్కు కనిపించదు.

ఈ మోడైన చెట్ల వరుసల గూళ్లలో రామ చిలుకలు పలకరించవు

చంద్రునిలో నీడ పెరిగి చంద్రుణ్ణి కబళించబోతోంది

చేతిలోని వీణ తీగలు వేళ్లను కత్తిరించి రక్తరాగాలు రగిలించబోత్తున్నవి.

సంఘపు పాడింటిమూల సాలెగూళ్ళు కప్పుకుని

భయంగొంతుదాకా తాగి ముడుచు పడుకున్న ప్రతి మనిషీ!

నీవు లేచి పిడికిలి బిగిస్తే ఆకాశపు మెడ నరాలు విరిగిపోతై

నీవు నిజంగా గొంతు విప్పితే సప్తసముద్రాల ఘోష ఆగిపోతుంది

నీవు నిండుగా కళ్లు తెరిస్తే దిక్పతుల గుండె పగిలిపోతోంది

ఈనాడు వెర్రితలలు వేసిన కుసంస్కృతి విషవృక్షపువేళ్ళు 'అంతర్జ్వాల నుండే అద్దేపల్లి ప్రతిఘటించడం ప్రారంభించాడు. నగ్నముని మచిలీ పట్టణానికి సంబంధించిన కవే అయినా ఆయన కవితా సంచలనమంతా హైదరాబాదునుండే జరిగింది. పై ముగ్గురితోనూ అటూ ఇటూగా ఆయన

## ప్రకృతి కచేరి

సేతూ ప్రేమాంజలి, బెంగుళూరు

అల్లరిగాలి
వెదురు
ఊసులాడుకుంటున్నాయి
ఎందుకోమరి
మేఘాలకు
కోపమొచ్చింది
ముందొచ్చిన చినుకుతో
వెనకొచ్చిన చినుకు
పలకరింపు
కొమ్మల చివరన
గువ్వపిట్ట
నేస్తాలను పిలుస్తోంది
పయనించే నీటికి
గులకరాళ్ళు
టాటాలు చెబుతున్నాయి
చిక్కటి చీకటికి
గుడ్లగూబ
భయాన్ని జోగిస్తోంది
ఏంటో దొరకలేదు
అలలు
వెతుకుతూనే ఉన్నాయి
శ్వాస గుండె
మేమున్నామని
ధైర్యం చెబుతున్నాయి
ఎంత విన్నా
తనివి తీరని నేను మాత్రం
మౌనంగా....

కవిత్వరచన ప్రారంభించినా 'ఉదయించని ఉదయాలు' ఒక ప్రత్యేక స్థానాన్ని పొందినా, దిగంబర కవితా సంచలనంతోనే ఒక ప్రాధాన్యాన్ని పొందాడు. ఆంగ్ల కవుల స్ఫూర్తి ఉంది గాని అది సామాజికత అంచుల్లోనే ప్రవహించింది. వర్గదృక్పథంతో అట్టడుగు ప్రజల బాధల్ని వర్ణించినవారిలో బి.శివ ఒకరు 70లలో ఈ అంశం గురించి ఉన్న ఆవేశధోరణి 'శివ' లో కనిపిస్తుంది. గేటుముందు కాపలా వాళ్ల గురించి ఒక కవిత రాశాడు శివ. తరతరాల కాపలావారి వంశాలు కొనసాగడం గూర్చి యిలా అంటాడు 'జీవగఱ్ఱ' కవితలో

'చేతిలో కఱ్ఱ
అతని నిస్సహాయతకు పెదవి విరుస్తోంది
తరతరాలుగా వస్తున్న ఆచారమేనని
వెక్కిరిస్తోంది అవును మరి దానికంతా తెలుసు
ఆ కఱ్ఱను వాళ్ళ నాన్న చచ్చిపోతూ
అతని చేతికందించిన జీవ గఱ్ఱ
వాళ్ళ నాన్నకు వాళ్ళ నాన్న దగ్గరనుండి వచ్చింది'

ఈ కఱ్ఱ ఎదురు తిరిగి, దుర్మార్గుల్ని శిక్షించి, ఆర్థికసమానత్వం సాధించాలని ముగింపులో కోరతాడు.

విప్లవ భావాలతో నిమగ్నమై కవిత్వం రాసి, మరో దశలో వైయక్తికత వైపున నడిచినవారిలో త్రిపురనేని శ్రీనివాస్ ఒకడు భావుకతతో కలిపి తన భావాల్ని వెలువరించడంలో ఒక ప్రత్యేకమైన శైలిని సాధించుకున్నాడు.

'ఎవరి జన్మస్థలంలో వారు నిలబడి
భూమి అంతస్సారంలోకి వేళ్ళూనాలి
ఠీవిగా అంతెత్తుకు ఎదిగి
మబ్బులల తలకు పూసే చినుకు పూలను కోసుకోవాలి
భూమ్యాకాశాల మధ్య ఎవరి పాటవాళ్ళు రాసుకోవాలి'

ప్రయోగాల పట్ల బాగా ఆసక్తి ఉంది సామాజికత భావుకత వినూతన శైలిలో శిల్పానికి ఒదిగి పోవడం నగ్నమునితో కనిపిస్తుంది 'జైల్లో సముద్రం' పంక్తులు ఇలా ఉన్నై.

'సూర్యుని కడ్డంగా నుంచున్న
ఆమబ్బు తునక పేరేమిటి?
అర్థంకాని అనంతశూన్యం అంచు మీదికి
ఆకారం లేని కుర్చీనొకటి లాక్కొని
అర్థవంతమైన బ్రతుకు వెన్నెల చుక్కల్ని కప్పుల్లో నింపి
ఒక్కొక్క క్షణం పెదవుల కానించి
విషాదాన్ని ఆరాధిస్తూ ఉంటానా
హొయలు హొయలుగా పొగలు పొగలుగా
కెరట కెరట కెరటాలుగా కలం
నా కాళ్ళని ముంచెత్తుతూ ఉంటుంద్గా
ఎందుకో ఒక్కసారి ఏకాంతంలోకి
నిర్జనారణ్యాలు నడిచి వస్తాయి
నిబిడాంధకార గహ్వరాలు తెరచుకొంటాయి.

1970 ల నుండి ఈనాటి దాకా చూస్తే, వస్తుపరమైన కవిత్వం, విప్లవ దళితవాద, స్త్రీవాద, మైనారిటీ, ప్రపంచీకరణ వ్యతిరేక మొదలైన కవిత్వంగా వచ్చింది. రూపపరమైన కవిత్వం మినీ కవిత హైమా, నానీ - మొదలైన కవిత్వంగా వచ్చింది.

విప్లవ ధోరణి వచ్చేటప్పటికి, దానిపట్ల అభిమానంతో రాసిన నగ్నముని, అద్దేపల్లి కృష్ణాజిల్లాలో లేకపోయినా, సి. విజయలక్ష్మి కృష్ణాజిల్లాలోనే ఉన్నా మిగిలిన వారిలో ఎవరూ ఒక బలమైన విప్లవ కవిగా రూపొందినట్లు కనపించదు. 1975 నుండి 85 దాకా అతి తీవ్రంగా ప్రచరితమైన మినీ కవిత అన్ని ప్రాంతాలలోగానే, కృష్ణా ప్రాంతాన్ని కూడా అమితంగా ప్రభావితం చేసింది. ఈ జిల్లానుండి బయటకు వెళ్ళిన అద్దేపల్లి, ఇక్కడే ఉన్న రావిరంగారావు, విజయవాడలో ఉన్న

## పావ! చిన్నపావ!!

కాలనాథభట్ట వీరభద్రశాస్త్రి, విజయవాడ

ఇదిగో కళ్ళ జోడు
ఏమిటి వెతుకుతున్నారు ?
ముత్యాల కోసం
పాప నవ్వింది

❖❖ ❖❖ ❖❖

ఈ వేళ చందమామ రాడు
అవును అమావాస్య కదూ!
నీ మోహం అదేంకాదు
పాప మొహంచూసి కుళ్ళు

❖❖ ❖❖ ❖❖

ఆ రుమాలు వుతికించరా
ఇన్నేళ్ళుగా దాస్తున్నారు
పాప ఫ్లైట్ ఎక్కబోయేముందు ఏడ్చింది
దాని కన్నీళ్ళు తుడిచా

❖❖ ❖❖ ❖❖

అదిగో ఫోన్ రింగవుతోంది చూడు
అమెరికానుంచే అయివుంటుంది
అవునండి అల్లుడు
పాపకు పురుడు వచ్చింది - ఆడపిల్లట

❖❖ ❖❖ ❖❖

పాప కళ్ళు వర్షిస్తున్నాయి
అప్పగింతలు అయ్యాయి

❖❖ ❖❖ ❖❖

కోరుకున్న బావ తో
డాలరునుంచి రూపాయికి
చిన్నపాప ఎక్కిన ఫ్లైట్ దూసుకుపోతోంద్గి
జననీ జన్మ భూమిశ్చ.....

అఖిల భారత తెలుగు రచయితల మహాసభల

ప్రతినిధులకు, కవిపండితులకు, సాహితీవేత్తలకు

# స్వాగతం

## ఈ మహాసభలకు ఆతిథ్యం ఇస్తున్న

## కృష్ణాజిల్లా రచయితల సంఘం

కార్యనిర్వాహకవర్గానికి

శుభాకాంక్షలు



జి. రాజేంద్ర ప్రసాద్, జి. విజయలక్ష్మి

249a

పూర్ణచంద్, నూజివీడుకు సంబంధించిన ఎమ్వీయల్ మొదలైన వారు మినీ కవితా వ్యాప్తికి బాగా కృషి చేశారు. అద్దేపల్లి రావి రంగారావు మినీ కవితా శిల్పంపై, వస్తువుపై అనేక వ్యాసాలు రాసి, విశ్లేషణలు చేసి ఆరూపం అవగాహనకు తోడ్పడ్డారు. చాలామంది మినీ కవితలు రాశారు. రావి రంగారావు, మినీ కవితపై విశ్లేషణ పుస్తకాలు రాయడమేగాక మినీ కవితలు కూడా రాశారు. ఆయన పెద్దకవితలు రాశారు. రంగారావు మినీ కవితకి ఒక ఉదాహరణ 'గుడ్‌మార్నింగ్'

'ఆకాశం ఇచ్చింది

ఆకుల్ని

చీకటి తెచ్చింది

వక్కల్ని

వెన్నెల కలిపింది

సున్నం

తాంబూలం వేసుకుంది సముద్రం

పొద్దున్నే పలకరించాడు

భానుడు నవ్వుతో

సముద్రమూ నవ్వింది

పండిన నోటితో'

సముద్రం మీద చీకటి, వెన్నెలా అన్నీ ప్రతిఫలిస్తే వేరు వేరు సమయాల్లో ఆమూడూ ఆకుల్నీ, వక్కల్నీ సున్నాన్నీ, తెచ్చినై. ఆకాశం ఆకారంలో ఆకులా ఉంది. చీకటి రంగులో వక్కలా ఉంది, వెన్నెల రంగులో మెత్తదనంలో సున్నంలా ఉంది. ఈ మూడూ కలపి తాంబూలం వేసుకున్న సముద్రంలో నుండి పొద్దున్నే సూర్యుడు అరుణవర్ణంతో వచ్చాడు. ప్రతిఫలించిన సముద్రమూ ఎర్రబడింది. ప్రకృతికి చేసిన ఒక సాధారణ అనుభూతి అన్వయం ఈ కవితలో కీలకం. రావి రంగారావు ఈనాటికీ మినీ కవితకిస్తున్న ప్రచారం వెలుగులోకి తెస్తున్న కొత్త కోణాలు అత్యంత ప్రశంసనీయం.

'రామసూరి' రాసిన ఒక మినీ కవిత హాస్యంతో వ్యంగ్యాన్ని మేళవించి, ఆడంబరానికి ప్రాముఖ్యమిచ్చి అసలు సరుకులేని రచయితుల మీద దెబ్బకొడుతుంది. మినీకవితలో శీర్షిక చాలా ముఖ్యం ఈ కవిత శీర్షిక 'అట్ట' హాసం

'వర్షం కావ్యానికి

మెరుపుల కవర్ డిజైన్

ఉరుములు ముందుమాట-తీరా చినుకైనా

పడుతుందో లేదో!

'అట్టహాసం' లో అట్ట పదాన్ని రెండిటికీ అన్వయించే అర్థాల్లో ప్రయోగించడం, హాసం-పదంలోనే నవ్వుల పాలయ్యే కవి పరిస్థితినీ వ్యక్తం చేశాడు.

జి. సత్యనారాయణ(జిసనారా) సామాజికతా ప్రధానంగా మినీ కవితలో పెద్ద కవితలూ దీర్ఘకవితలూ రాశాడు. ఆయన సామాజిక వ్యంగానికి ఒక మినీ కవితని ఉదహరిస్తాడు.

'పెట్రోలు ధర పెంచింది-వాడకం తగ్గించడానికి

రైలు ఛార్జీలు పెంచింది-రద్దీ తగ్గించడానికి

కారు ధరని పెంచింది-కబుర్లు తగ్గించడానికి

మరి, తిండి గింజల ధరలు పెంచేది

తిండి తగ్గించడానికి ? పేదవాని ప్రశ్న

ఉత్కంఠ ధోరణిలో చెప్పిన ఈ మినీ కవిత సామాజికతని బాగా వ్యక్తం చేసింది

ఆ రోజుల్లో విజయవాడలో చాలాకాలమున్న 'స్మైల్' పెద్దకవితలు రాసినా మినీ కవితలూ రాశాడు. ఆయన ఒక మినీ కవిత శీర్షిక 'కటితప్పు' చీకటి తప్పు అనే పదానికి వ్యభిచారం అని అర్థం కటితప్పు - అన్నా అదే అర్థం. కాని 'చీకటి' లోంచి 'కటి' ని వేరు చేయడం ఇక్కడి శీర్షికలోని

చమత్కారం

'అప్పుడు

ఆలోచించని అయిదు నిమిషాలు

ఇప్పుడు

కడుపులో క్రీస్తుకు

శిలువ వేస్తున్న విషాలు'

'నిమిషాలు, విషాలు' -కున్న అక్షరసామ్యం, కవిత రెండు భాగాల్లోని విరుద్ధ భావం 'అప్పుడు, ఇప్పుడు' గా చెప్పడం ఇవన్నీ మినీ కవిత రూప సంబంధ శిల్పం. మొత్తం భావం, తప్పుచేసి గర్భం తీయించుకునే అమానుషత్వాన్నీ రూపుగడు తుంది.

జి.వి. పూర్ణచంద్ మినీ కవితా ప్రచారానికి బాగా సహకరించాడు. తన కవతలన్నిటికీ బొమ్మలు వేసి, వాటిని ప్రదర్శించే కార్యక్రమాలు ఏర్పాటు చేశాడు. ఇటువంటి ప్రచార దృష్టి మాత్రమే కాకుండా తాను మంచి మినీ కవితలు కూడా రాశాడు. ఉదాహరణకి కవిత శీర్షిక 'ఘటవాయిద్యం'

'కడుపు నిండినంత సేపూ

నిండు కుండలే వీళ్ళు

లోకం అంతా సుభిక్షం అంటారు.

కడుపు ఖాళీ అయితే తల్లకిందులై

గగ్గోలు పెట్టేది వీళ్ళే

పాపం, ఒక్కటే చూపించమంటారు.

పూర్ణచంద్ సామ్యవాద భావ ప్రేరితుడు. మినీ కవితలకు కేవలం రూపసంబంధమైన వినూతన ప్రక్రియయే కాకుండా, యువకులు వర్గసంఘర్షణ భావాలకి బాగా ఈ ప్రక్రియ వినియోగించుకున్నారు. ఉన్నవాళ్ళ ధోరణి గూర్చి చెప్తున్నాడు కవి. కడుపునిండితే నిండు కుండలు ఏమీ మోత చెయ్యరు. ఖాళీ అయితే కుండ తల్లకిందులై పోతుంది. బరువు లేదు గనుక. మనిషితల్లకిందులౌతాడు. అంటే మతి పోగొట్టుకుంటాడు. గగ్గోలు పెడతాడు. కుండకూడా ఖాళీ అయితే

మోగుతుంది. అప్పుడు వాళ్ళకి 'పాపం' మాత్రం కనిపిస్తుంది. మళ్ళీ సంపాదన కోసం పాపాలుచేస్తారు. మినీ కవితకి కావాలసిన మూడేసి పాదాల రెండు భాగాల వైరుధ్యం ఉంది.

కొల్లూరి మినీ కవితా వ్యాప్తిలో చెప్పకోదగిన కృషి చేసిన కవి, కార్యకర్త, మినీ కవిత-పై పెద్ద సదస్సును 1982 లో అమలాపురం లో నిర్వహించాడు. ఎక్స్‌రే పత్రిక ద్వారా మినీ కవితలకు ఎంతో వ్యాప్తి కలిగించాడు. స్వయంగా మినీ కవితలూ పెద్ద కవితలూ రాశాడు.

'లక్షల గుండెల్లో
రగిలే మంటల్ని
ఎక్సరే తీసి
తన హృదయం డార్క్ రూమ్‌లో
డెవలప్ చేసి
సమాజం ఆల్బమ్‌లో
అంటించేవాడు 'కవి'.

'ఎక్సరే తీసి' అనడంలో బాధితుల హృదయవేదనకి మూలకారణాల్ని కనుక్కొని అనే అర్థం రావడం, 'హృదయం డార్క్ రూమ్‌లో డెవలప్ చేసి' అనడంలో హృదయాంతర్గతమైన భావాల్ని వెలికి తీసి, అకారణాలకి అన్వయం చెయ్యడం, 'సమాజం ఆల్బమ్‌లో అంటించడ' మంటే, స్థిరంగా ఆభావాల్ని సమాజం పై ముద్రపడేటట్లు చెయ్యడమనే భావం, వచ్చి కవి సామాజిక బాధ్యతకు ఈ మినీ కవితలో బలంగా చెప్పగలిగాడు కొల్లూరి.

సుమారు 1985 నుండి తెలుగు కవిత్వంలో అస్తిత్వ భావనకు సంబంధించిన ఉద్యమరచనలు ప్రచలితమైనై. స్త్రీవాదం, దళిత వాదం, మైనారిటీ వాదం వీటిలో ముఖ్యమైనవి. ఈ వాదాల ప్రతిబింబమైన కవిత్వం ఆంధ్రదేశం అన్ని ప్రాంతాలలోనూ వికసించింది. కృష్ణా జిల్లాలో స్త్రీ వాద కవయిత్రులు చెప్పకోదగిన సంఖ్యలో,స్థాయిలో ఉన్నారు. స్త్రీ ఔన్నత్యాన్ని ప్రశంసించడమూ ప్రతిఘటన భావాల్ని వెలువరించడమూ రెండూ స్త్రీ వాదాన్ని పరిపుష్టం చేస్తే కోకా విమల కుమారి స్త్రీల పరిస్థితి గురించి చాలా కవితలు రాశారు. ఉదాహరణకి

'నీవు సబలవేగాని అబలవు కానే కావు అని ప్రారంభించి స్త్రీ గుణాల్ని ఈ విధంగా చెప్పారు.

'అబలా ! అమరమైన నీ చరిత అనంతం
ప్రేమకు పెన్నిధివి, మమతల మంచుపొరవు
మహిమాన్విత మాతృమూర్తివి
సృష్టికి మూలం నీవమ్మా
చింతలు బాపనీ చిరునవ్వు
వెలుగుతావు జ్యోతివై
కరుగుతావు కరుణవై
నిందించిన నిన్నటిలోకమే నీరుగారె
నేటి నీ ప్రగతి పథపు ప్రతిభవిని'

భారతీయవిలువల్లో ప్రధానమైన స్త్రీల లక్షణాల్ని చెప్తూ ప్రగతి పథంలో నడుస్తుంటే నిందించిన లోకమే ఏమీ చెయ్యలేక నీరుగారిపోతుంది. అంటే తప్పనిసరిగా అంగీకరిస్తుంది అనే సత్యాన్ని ప్రగతి శీలతలోని ఒక ముఖ్యాంశంగా చెప్పారు.

కొండేపూడి నిర్మల స్త్రీ వాద భావాల్ని చెప్పిన కవ యిత్రులలో అగ్రశ్రేణికి చెందుతుంది. 'మల్టీ నేషనల్ ముద్దు' అనే కవితలో వర్తమాన కాలంలో స్త్రీపట్ల, గ్లోబలైజేషన్ ఎటు వంటి ద్రోహం చేస్తోందో వర్ణించింది. 'అందాల పోటీలు' వచ్చి ఎలా ఒక సంస్కృతిని నాశనం చేస్తున్నయ్యో, ఇంట్లో ఉన్న ఆడవాళ్ళను కూడా ఆకర్షించి, మార్కెట్ విలువల ద్వారా భారతీయత నాశనానికి తోడ్పడుతున్నాయో చెప్పింది.

'ఆకాశం చీలిక పడుతోంది
మరిగే పాలలో మూతిపెట్టి
ముసిముసిగా ఏడ్చుకునే క్యాట్‌వాక్ స్ఫూర్తిగా
అందాల గారడీ
నా యింటిల్లిపాదినీ బొమ్మలు చేసింది
అమ్మ బొమ్మ కూతురి బొమ్మ అమ్మమ్మబొమ్మ
కుక్కపిల్ల బొమ్మ

## మ్యూజింగ్స్

**వాస్తవ్ అలోక్,** Karaoke, ZIMBABWE

ఇంత కాలం చొక్కాకు అసరానిచ్చిన
నా చెయ్యి
నేడు నీకు తలగడగా
నాలుగు గంటల నిశ్చలత్వంతో
నా చెంపను నిమురుతూ
నీ ముంగురులు
అవే నాలుగ్గంటలు అల్లరల్లరిగా
ప్రయాణం చివర్లో
చెయ్యి అస్థిత్వానికి
కొత్త నిర్వచనంతో నేను
నిద్ర మత్తుతో నువ్వు

2

నీ కనురెప్పలపై వాలుతున్న
నిశ్శబ్ద కలల్ని
కదిలిపోనివ్వకుండా కాపలా కాస్తున్నా
నిద్రతో వెచ్చబడ్డ
నీ అరచేతుల విద్యుత్తుతో
నా కళ్ళను వెలిగించుకొని

ఎవరికన్నుమూసి తెరిచినా మిస్సిండియా కలలే

ఇండియా మొత్తానికి ఇప్పుడు

మిస్సయిపోవడమే ఒక కల !

కుక్కపిల్ల –బొమ్మతో మిగిలిన వారితో కూడా కలిపి చెప్పి, అందాల పోటీలు ఎంత విలువ లేనివో స్ఫురింపచేసింది. అమ్మ, కూతురు, అమ్మమ్మ –ప్రాణబంధాలతో కలకలలాడే భారతీయ స్త్రీ బింబాలు. వాటిని "బొమ్మ" అనే పదంతో చెప్పడం వల్ల అందమే ముఖ్యమైనప్పుడు వచ్చే 'నిర్జీవత' వ్యంగ్యమౌతుంది.

స్త్రీ పురుష సంబంధాల్ని ప్రేమ పునాదిగా అభివృద్ధి చెయ్యకుండా, పురుషుడు అనేక కోణాల్లో పూర్వం అహంకారపు కోణంలో, ఇప్పుడు మార్కెట్ కోణంలో అణిచిపెడుతున్నాడు. ఒకవిధంగా ఎప్పుడూ స్త్రీని, మగవాడే మలుస్తున్నాడు అందువల్ల మగవాళ్లని హెచ్చరిస్తూ, ఘంటశాల నిర్మల రాసిన 'ఫెమినిస్ట్ మానిఫెస్టో' కి ఒక కొత్త కోణం ఉంది. ఆమె యిలా అంటుంది.

'తండ్రిగా, తోబుట్టువుగా, కన్నబిడ్డగా

మమ్మల్ని సమానంగా ప్రేమించి

సహేతుకంగా విమర్శించి సకారణంగానే గౌరవించండి

లేని రోజున

మా సామాజిక దృష్టి కలుషితమౌతుంది

విశ్వశ్రేయస్సే మాకు విషంగా మారుతుంది

మమ్మల్ని విధ్వంసంవైపు, ఉమ్మడి వినాశనం వైపు తరమకండి

తీరా పోరే మొదలైన నష్టానికి బాధ్యులం మేము కాదు సుమా!

స్త్రీ చేసిన ప్రతిపనీ గొప్పదే అనే కొందరి అతిశయ ధోరణిలో కాకుండా, 'సహేతుకంగా విమర్శించి' అనడంలో కవయిత్రి జాగ్రత్త ఉంది. ప్రేమ-కోసం ఎట్టి పరిస్థితుల్లోనూ నిలబడాలనీ అబంధాల్ని నాశనం చెయ్యవద్దనీ, నాశనం చేసి, తమను విమర్శించవద్దనీ చెప్పడంలో ఘంటసాల నిర్మల సమతూకమైన దృక్పథం స్పష్టమౌతుంది. తాము సంపాదిస్తున్నా సంపాదించే భార్య జీతం సర్వస్వం తమ ఖర్చుల కోసమే ఆశించే మగవాళ్ళు ఈ సమాజంలో కొందరుంటారు. వారికి ధనం మీద ఉన్న ప్రేమ, భార్యపై ఉండదు, ఎటువంటి సంతోష సమయంలోనైనా భార్యను డబ్బులడగడం వారు మరచిపోరు. ఎందుకంటే అదొక్కటే వారికి ముఖ్యం కాబట్టి. ఈ సందర్భాన్ని 'మందరపు హైమావతి' సర్పపరిష్వంగం' కవితలో చెప్పింది. ఇందులో 'సర్పపరిష్వంగానికి' రెండర్థాలు వస్తున్నా అటువంటి భర్త కౌగిలి పామును కౌగిలించుకున్నంత భయంకర మని ఒక అర్థం. రెండోది సర్పాల క్రీడ చాలా గొప్పదని లోకంలోని వాడుక అందుకే 'మసకపు పాముకాటు' అనే నానుడి వచ్చింది. సర్పాలే అలా ఉంటే, ఈ భర్తకు అది కూడా లేదు. ఈ సన్నివేశాన్ని యిలా చెప్తుంది కవయిత్రి.

'ఈ లోకాన్నే మరచిపోయిన అమృతపు ఘడియల్లో అక్షర తూణీరం నించి ఒక ప్రశ్నల బాణం సంధిస్తావు 'జీతమెప్పుడిస్తారు?' వేశ్య కూడా ఈ సమయంలో ఈ ప్రసక్తే తేదు, పశువైనా ప్రవర్తించదు మరోవిధంగా' ఇటువంటి మగవారి తత్వాన్ని సర్పపరిష్వంగంగా నిరసిస్తూ, తన అసహాయస్థితిని 'జీవితం నుండి కాదు గదా శరీరం నుంచైనా కించిత్తు కూడా దూరమవడం నా చేతుల్లో లేని పని' అని వ్యక్తం చేస్తుంది.

తల్లి ప్రేమను చాలా బలంగా ఒక అనివార్యమైన వ్యతిరేక సందర్భం ద్వారా 'అబార్షన్ స్టేట్‌మేంట్' లో వర్ణిస్తుంది పాడిబండ్ల రజని. ఆ సందర్భం 'అబార్షన్' ఏదైనా పొంది నప్పుడు వ్యక్తమయ్యే ఆనందం కంటె, కోల్పోయినప్పుడు పొందే విషాదమే ప్రేమలోని గాఢతను తెలియజేస్తుంది. ఈ కవితలో జరిగింది అదే. ప్రతి పదాన్నీ పరోక్షంగా అమ్మ ప్రేమను తెలియజేసే విధంగా మలచుకున్న గాఢబంధం భావ తీవ్రత, ఈ కవితను బలమైన కవితగా చేసినై 'ఇంత సుఖంగా నిన్ను చంపుకునే మార్గం' కనిపెట్టిన వీళ్ళ ముఖాలపై ఉమ్మ నీళ్ళతో ఉమ్మెయ్యాలనే వెర్రి ఆవేశంగానూ కడుపు చించుకుంటే మనసుగాయం అయ్యి కడివెడు కన్నీళ్ళు దుఃఖంగానూ ఉందిరా' అని ముగింపులో ఆశించిన పరిష్కారం గుండెల్ని కదిలిస్తుంది.

అయ్యో !

పాలింకిపోవడానికున్నట్లు

మనసింకిపోవడానికీ

మాత్రలుంటే ఎంత బావుండు !

దళిత స్త్రీని 'అగ్రవర్గాలు' అని చెప్పుకోబడే మగవాళ్ళు అన్యాయం చెయ్యడమనే అంశాన్ని జి.విజయలక్ష్మి చాలా తీవ్రంగా చెప్పింది. సర్కారు జిల్లాల దళిత భాషకు సంబంధించిన యాసను గూడా ప్రేమలేక అనే కవితలో గొప్ప గాలి వినియోగించుకున్నది. 'ప్రేమలేక' అంటే ప్రేమలేఖ' ప్రేమలేని తనం కూడా 'లేక' అనే పదంలో స్ఫురిస్తుంది. ఆమె హెచ్చరిక యిలా ఉంది.

'తక్కువ కులపు

ఆడపిల్లలని అగుమానం చేశారో

ఇక మీ పురానాల్లో

పతివ్రతలంతా కదిలొచ్చినా

మీ పెళ్ళాం మెళ్ళో

బంగారు బిళ్ళల్ని

కుండపెంకులు కాకుండా చేయలేరు

మీ పెద్దకులపు పేమ పేరుతో

మీ ఆడపిల్లల కంట

నీటి సుక్క బూమ్మీద పడ్డదో

మీ ఇల్లన్నీ వల్లకాడులే

సుక్కల్ని పట్టపగలె మీకు సూపిత్తం

సీకట్లయిన సూరీడని మండిత్తం

మీ గుండెల్లో నెత్తుటి మంటలేత్తం'

యలమర్తి అనూరాధ భారతీయ సంస్కృతికి మచ్చలా నిలబడ్డ ప్రచార ప్రసారసాధనాల వక్రతని సూటిగా విమర్శిస్తుంది. గ్లోబలైజేషన్ నీడలో చిద్రమౌతున్న విలువల్ని గూర్చి తన నిరసనను తెలియజేస్తుంది. 'కరెంట్ కట్' జరిగి, వెలుగు వచ్చింది. వెలుగు ఎందుకు తృప్తిగా లేదో చెప్తోంది.

ఇలా
'విరామం తర్వాత
అడ్వర్‌టయిజ్‌మెంట్ల హోరు వెంట టెలీకాస్ట్‌లా
వెలుగువాకిట్లో నిలిచింది
అమ్మయ్య అనుకున్నా
ఎదురుగా ఫ్యాషన్ పెరేడ్
టి.వి.లో అమ్మాయిలు అర్ధనగ్నంగా
గోడలపైన సినీ పోస్టర్ల రూపంలో
పత్రికల్లోనూ ఈ పరంపరే
నేటి స్త్రీ గౌరవానికి అద్దం పడుతూ
భారతీయ సంస్కృతికి ముసుగువేస్తూ'

స్త్రీల భావాలకి సంబంధించిన అనేక సున్నితమైన కోణాల్ని రెంటాల కల్పన తన కవిత్వంలో సౌందర్యవంతమైన శైలిలో ప్రతిబింబింపజేసింది. 'ఏక్ పల్'(ఒక క్షణం) అనే కవితలో 'ఎదురుచూడ్డం' అనే విషయానికి సంబంధించిన వేదనని రూపుగట్టింది.

'నీలాకాశపు మెహఫిల్ పై
మరో జుగల్ బందీ
నా పగళ్ళన్నీ బాధల నెగళ్ళై
నీ రాత్రుళ్ళన్నీ నాకు అసూర్యం పశ్యవై
నీ కోసం
అరక్షణమే అను క్షణమై
రజనీ గంధాలు రాధా మాధవాలు
సంతూర నాదాలై, మాండలిక మాటలై
ఏం చెప్పను ?
ఎదురు చూపులెప్పుడూ ఎండమావులేగా !

ప్రేమలో జీవించినా మరణించినా, ఒక్క క్షణంలో జరిగేవని క్షణాల్ని అనుభూతి కేంద్రంగా చెప్పడం, హృదయలక్షణాన్ని విప్పడమే. ఈ కవితలోని భావాలు గజల్‌కి దగ్గరగా సాగిపోతై.

మైనారిటీ అస్తిత్వవాదాన్ని గూర్చి ఆలోచించినప్పుడు ముస్లిం వాదానికి సంబంధించిన తీవ్రమైన ఆవేదన ఖాదర్ మొహియిద్దీన్ రాసిన 'పుట్టుమచ్చ' తో ఒక ఊపందుకుంది. ఇందులో సామాజికమైన తన స్థానాన్ని గూర్చి మాత్రమే గాక రాజకీయమైన వేర్పాటు గురించిన వేదన కూడా వ్యక్తమవుతుంది. పుట్టకతో వచ్చేదే పుట్టుమచ్చ. అందుకే ఒక ముస్లిమ్‌గా పుట్టడంతోనే, తన వెంట వస్తున్న ఏర్పాటు భావాలన్నీ ఈ కవితలో బలంగా చెప్పాడు. ఖాదర్.

'నేనే పుట్టకముందే
దేశద్రోహుల జాబితాలో
నమోదై ఉంది నా పేరూ......
కలలు నా మాతృభాషలో రావటం మానుకుంటాయి.
నా ఆలోచనలు సైతం అధికుల భాషనే ఆశ్రయిస్తాయి.....పట్టెడన్నం కోసం పేవ్‌మెంట్ల మీద పూలమ్ముకుంటాను పళ్ళమ్ముకుంటాను పల్లీలమ్ముకుంటాను గొడుగులు బాగుచేస్తుంటాను వీధరుగుల మీద దర్జీ పనిచేస్తుంటాను. దూదేకుతుంటాను దినం గడపుకుంటాను ఏ గొడవల్లేకుండా
బతుకును వెళ్ళమార్చాలనుకుంటాను ఉన్నట్టుండి ఎందుకోమరి నగరాల నడివీధుల్లో నా నెత్తురు తీర్థస్నాన ఘట్టమౌతుంది.

తమ అస్తిత్వాన్ని గురించిన ఒక అగ్ని ప్రశ్న ఈ 'పుట్టమచ్చ' దీర్ఘకవిత ఇందులో పేద ముస్లింల జీవన వాస్తవికత, రాజకీయమైన వేర్పాటు భావాన్ని తిరస్కరించే జాతీయ భావన మేళవించి ఉంటై.

అఫ్సర్ తన కవితా ప్రారంభాన్ని అజంతా, వేగుంట మొదలైన వారి ప్రేరణతో, 'మరణమే చిరునామా గా ప్రారంభించిన ఆత్మాశ్రయకవి. రానురాను ఎంతగానో పరిణామం చెంది, సామజిక పరిస్థితుల అవగాహనకూడా ప్రతిబింబించేట్లు రాయడంలో ఒక ప్రత్యేమైన శైలిని సాధించుకున్నాడు. వర్గ సంఘర్షణ భావన వైపు వెళ్ళక పోయినా ప్రపంచీకరణ వ్యతిరేకతను కూడా బలంగా తన కవిత్వంలో ప్రతిబింబింపజేసాడు. అస్తిత్వ వాద ధోరణి ప్రబలమైనప్పుడు ఆ కోణంలో

## అనుబంధాలు

**కుమారి ఉప్పలపాటి లక్ష్మీ ప్రశాంతి, హైదరాబాద్**

మొన్న ఆత్మీయంగా పెనవేసుకున్న బంధం
నిన్న అల్లనల్లగా దూరమైంది. నేడు అగాథమే మిగిలింది.
అనురాగం, అభిమానం, అనుమానం, అవమానం
అన్నీ అనుభూతులకతీతంగా అందించవచ్చని,
ఆప్యాయతలు, ఆర్ద్రతలు, ఆలనపాలనలు
బ్రతుకనే ఆటలో భాగమని, అనుభవం నేడు నాకు నేర్పింది.
నిన్న సేదతీర్చిన వారు, సేవ పొందిన వారు
నేడు మొహం చాటేస్తే ఏడవకండి. ఏరు దాటారు వారు.
నేడు కుశలమడిగే వారు రేపు కనుమరుగేనని తెలుసుకోండి
ఇది ప్రపంచం తీరు.

అన్నీ సవ్యంగా జరిగిన నాడు, ప్రపంచం
అందంగా కనిపిస్తుంది
ఆత్మ విశ్వాసం ధ్వనిస్తుంది
నైజాల తాలూకు మడతలు తొలగే కొలదీ
నగ్నత్వం ద్యోతకమవుతుంది.
అందమా, అసహ్యమా అవసరం లేని విషయం కనిపించేవి,
వినిపించేవి నిజాలు కావనేది
అక్షరసత్యం.

సున్నా పాజిటివ్వా, నెగటివ్వా ?
సత్యం పాజిటివ్వా, నెగటివ్వా ?
శూన్యం, సత్యం రెండూ ఒకటే.
కాలమనే తోడు నీదైతే, సర్వశక్తిమత్వాలు
ధవళకాంతిపుంజాలు

కూడా కవిత్వం రాశాడు. చెప్పే విధానం మీద కూడా అఫ్సర్‌కి శ్రద్ధ ఉంది. భావ చిత్రధోరణి ప్రబలంగా ఉంది.

అన్నీ ముద్రలే మాకు
మా హృదయాలకు తాళాలు వేశారు
చెవులకు వాగ్దానాల పోగులు చుట్టారు.
మా కళ్ళ మీదే మసీదులు కూలిపోయాయి
అయినా నిద్రపోతూనే ఉన్నాం ప్రశాంతంగా
తెల్లవారు ఝాముున లేచినశరీరాలకు
నిద్ర చొక్కాలు తొడిగినవాళ్ళని
మధ్యాహ్నం అజా పిలుపులకు సైతం
నిద్రలోంచి వులిక్కిపడ్డట్టు పరిగెత్తే వాళ్ళని
సాయంత్రమో రాత్రో అపరాత్రో
ఎప్పుడూ ఏ పిలుపూ
ఏ నిద్ర నీ బద్దలు కొట్టనంత భద్రంగా
నిద్ర పోతున్న వాళ్ళని శిక్షించాల్సిందే
కాదంటావా ప్రభూ !

అని ఒక చైతన్యాన్ని కలిగించే ప్రయత్నం చేశాడు అఫ్సర్ సామాజిక భావాల్ని కూడా నిస్సారనినాదాలుగా కాకుండా, కవితాత్మకంగా చెప్పాలనే స్పృహ అఫ్సర్‌లో స్పష్టంగా కనిపిస్తుంది.

యలమంచిలి తాయారు, సామ్యవాద భావాల పట్ల నిబద్ధతగల కవయిత్రి. సామాజికమైన ఎగుడుదిగుళ్ళుకు స్పందించి భావనాశక్తిని వదలకుండా కవితలు రచించింది. 'సృజన' అనే కవితలో ప్రకృతి సౌందర్యాన్ని దర్శించి , మానవ సమాజాన్ని చూచినప్పుడు ఎంత అనుభూతి భేదం కనిపిస్తుందో చెప్తుంది.

'ఆమని విరబూసినప్పుడు
జలపాతాలు దివ్యసుందరంగా శోభిల్లుతున్నప్పుడు
నాకేదో నేపథ్యగానం వినవస్తుంది
నా చెవుల్లో ఏదో కళ్యాణ గీతం
ప్రతిధ్వనిస్తుంది......
ధూళిలో దుమ్ములో ఆడి ఆడి
కడుపుకు గంజిలేక
ఎండకు ఎండి వానకు తడిసి
చలికి బిర్ర బిగుసుకున్న పసికూనల చూచినపుడు.....
అణువణువునా పొగలు లేస్తాయి...........

ఇరాక్‌పై అమెరికా దాడి చేసినప్పుడు, అమెరికా సామ్రాజ్య వాదాన్ని నిరసిస్తూ ద్వారా నా శాస్త్రి 'బుష్ కాకి' అనే దీర్ఘ కవిత రాశాడు తన దగ్గర ఎన్నో అణ్వాయుధాలున్న హింసాత్మక అమెరికా శాంతి ప్రవచనాలు వల్లించడం పట్ల కోపంతో యిలా అంటాడు.

'నిన్ను చూస్తుంటే
గురివింద గింజ గుర్తొస్తుంది
నీ దగ్గరున్న అణ్వాయుధాల
గోడౌన్లు ఎవరి దగ్గర ఉన్నాయి
అణ్వాయుధాల ప్రయోగానికి పలికిన
నీ నోట స్వేచ్ఛశాంతి పదాలు మలినమైపోయాయి.

కేతవరపు వెంకట రమణమూర్తి రైతును గురించి ప్రశంసిస్తూ రాసిన 'మట్టి కళ్ళు' అనే కవిత, మట్టితనానికిచ్చిన గౌరవాన్ని ప్రతిబింబిస్తుంది.

'ఇప్పటికైనా కాళ్ళని కళ్ళకద్దుకు పూజించాలి

## మనం

**విప్లోవ్, తిరుపతి**

బ్రతుకు దేముంది
బ్రతికెయ్యొచ్చు
చావుదేముంది
రానే వస్తుంది
బ్రతికించడమే కష్టం

కష్టమేముంది కష్టపడితే
సాధించలేకపోవచ్చు ప్రతివాడూ ప్రతిదీ
వేధించవచ్చు సూటిపోటిమాటలు
మిగిలిపోవచ్చు ఒంటరిగా
చచ్చిపోవచ్చు ఒంటరిగా
మిగుల్చుకోవచ్చు చరిత్రను
గెలిచినా ఓడినా ప్రయత్నించినా
బ్రతికించలేక పోవచ్చు
బ్రతికించాలనే తపనను తెలపవచ్చు

నవ్విపోయేవాళ్ళు పోనే పోతారు
కలిసిరానివాళ్ళు కాకుండనే పోతారు
కానివాళ్ళూ లేనివాళ్ళూ
లెక్కలోకి రాని వాళ్ళు
లెక్కచేయనక్కర్లేనివాళ్ళు
తామరాకులమీద నీటిబొట్లు
గుప్పెడు ఇసుకలో రేణువులు
హత్తుకోరు, ఉండిపోరు
మిగిలేది మనం
నేను నువ్వు నువ్వు నువ్వు
నేనులు కలిసే మనం
కలవకపోయినా మనమే
ఒక్క నాలో ఎన్నో నేనులు
మనకోసం ఒకరు కాదు
ఒకరికోసం మనం
బ్రతికించడం కోసం బ్రతుకు
బ్రతుకుదాం మనం

గాయపడ్డ వాటికి మందురాసి ఊరడించాలి

నిలువెత్తు దండల్తో కాళ్ళని పల్లకీల్లో ఊరేగించాలి.

చలపాక ప్రకాశ్ లో వ్యంగ్య రచనా ప్రాధాన్యం ఉంది. సమకాలీన పరిస్థితులలోని అన్యాయాల్ని అవహేళన చేస్తూ హాస్య వ్యంగాన్ని అభివ్యక్తి మార్గంగా స్వీకరించి, 'హైలో' సంపుటి ప్రచురించాడు, వ్యంగ్యానికి ప్రాధాన్యమిస్తూ ఆయన రాసిన ఒక కవితలోని కొన్ని పంక్తులు

అన్ని దానాలలో

ఏదానం పుణ్యమిస్తుంది?

కళ్ళు దానం చేద్దామా

టి.వి సీరియళ్ళకు కళ్ళు కాయలు కాచి

చత్వారమే మిగుల్తుంది

పోతే పోయింది-కాసింత ధర ఎక్కువైనా

శీతల పానీయం కొని దానం చేద్దామంటే

అందులోని పురుగుమందు కిక్కునూ

పుణ్యానికి బదులు పాపాల ఊబిలో కూరేస్తుంది'

ఇలా దానానికి పనికొచ్చే వస్తువులన్నింటిలోని మోసాన్ని బహిర్గతం చేస్తాడు కవి వ్యంగ్యంతరంగా

'చుక్కపొద్దు' కవితా సంపుటిని ప్రచురించిన మాల్యాద్రి, కొల్లేరు-కు పట్టిన దుర్గతిని గూర్చి 'గాయపడ్డకొల్లేరు' అనే కవిత రాశాడు. ఇప్పుడు కొల్లేటి పరిస్థితి, అందరికీ హృదయవిదారకంగా ఉంది. మాల్యాద్రి ఆవేదన కవిత అడుగుగునా కనిపిస్తుంది ఉదాహరణకి-

'నాగుండెపై ప్రొక్లెన్లతో అడ్డే వేసి

విదేశీ క్యాట్ ఫిష్‌లు పడేసి

దేశ మలినాన్నంతా నాపై ఎగదోసి

నా శరీరాన్ని పాయిఖానా చేశారయ్యా'

విదేశీ పక్షులెన్నో వలస వచ్చి జగత్ ప్రసిద్దిగాంచిన కొల్లేటి సరస్సు, వ్యాపారస్తుల స్వార్థానికి ఎంత అధోగతి పొందిందో, చాలా తీవ్రంగా, వాస్తవికంగా మాల్యాద్రి వర్ణించాడు.

రాయసం వెంకట్రామయ్య సూక్ష్మమైన వ్యంగ్యాన్ని సామాజిక రాజకీయంశాల విమర్శలో వినియోగించగలడు ప్రవహిక అనే తన కవితాసంపుటిలో నాకు ఓటు లేదు అనే కవితలో చీమ లో బడుగు జీవిని సంకేతం చేసి రాజకీయనాయకుడికి కేవలం ఓటు మాత్రమే ముఖ్యమనే అంశాన్ని స్పురింపజేస్తాడు.

'నన్ను మీరు చీమంటారు

మేం మిమ్మల్ని హింసా ప్రియులంటాం.

ఈనాడు నా ఆహారం కోసం తిరిగి తిరిగి

నా కాళ్ళు నొప్పి పుట్టాయి.

నేనుండే రంధ్రం దగ్గర ఎవరో విషాన్ని చల్లారు అని ప్రారంభించి, ముగింపులో తన వ్యంగ్యాన్ని చురుక్కు మనిపించారు.

'నేనూ నీలాటి వాణ్ణే

కాని నాకు ఓటు లేదనేగా

నీ ధీమా!

ఈ మధ్యకాలంలో శ్రీశ్రీ పై వ్యతిరేకంగా ఎన్నో విమర్శలు ఎన్నో అంచనాలు వచ్చినై. ప్రతిఘటన భావాల్ని వ్యాప్తి చేయ్యడంలో శ్రీశ్రీ కవిత్వానికున్న శక్తినీ, ప్రజల మనస్సులో ఆయనకున్న సుస్థిరమైన స్థానాన్నీ దృష్టిలో పెట్టుకుని, శ్రీశ్రీ పై వ్యతిరేక విమర్శని బదాబదలు చేసే దృష్టితో 'సశ్రీ' ఒక దీర్ఘ కవిత వెలువరించాడు దానిపేరు 'అగ్ని సంతకం' ప్రతి పంక్తినీ ఆవేశపూరితం చేసి అక్షరాల్నీ పదాల్నీ భావాల్నీ అగ్నిజ్వాలలు చేసిన ఈ దీర్ఘకవిత, తన ప్రయోజనాన్ని నెరవేర్చింది. శ్రీశ్రీ ని విమర్శించే వారి అశక్తతను గూర్చి యిలా అంటాడు.

'ఇంకనే ఇంకని ఇంకనూ ఇంకని

## నిజమైన పండుగ

**కోగంటి విజయలక్ష్మి, గుడివాడ**

పంచభక్ష్య పరమాన్నం తిన్నప్పటికంటే

పట్టెడన్నం అన్నార్తునకు పెట్టగల్గినప్పుడు

ఆనందాన్ని అందరితో వినోదించినప్పటికంటె

విషాదచరితను మనస్ఫూర్తిగా ఆదుకోగల్గినప్పుడు

వెయ్యి అబద్ధాలాడి ఒక పెళ్ళి చేసినప్పటి కంటే

కూలిపోతున్న కాపురాన్ని నిలబెట్ట కల్గినప్పుడు

మంచి కవితను ఆస్వాదించినప్పటికంటే

నికృష్ట సాహిత్యాన్ని తూర్పార పట్ట కల్గినప్పుడు

విరిసిన గులాబీని ముద్దిడినప్పటికంటే

వాడిన తీగను చిగురింప చేయగల్గినప్పుడు

స్వయం శక్తికి మురిసిపోయినప్పటికంటే

ఎదుటి వ్యక్తి ప్రతిభను గుర్తించకల్గినప్పుడు

ఆత్మీయుల అదృష్టాన్ని అభినందించినప్పటికంటే

తడి ఆరిన గుండెకు స్వాంతన కల్గినప్పుడు

ప్రక్కవారు మెచ్చుకునే మంచిపని చేసినప్పటి కంటే

పొందిన సహాయానికి కృతజ్ఞయై ఉండకల్గినప్పుడు

అప్పుడే

నా కలం రాస్తుంది వెన్నెల కైతల్ని

నా గళం పాడ్తుంది వసంత కోయిలై

నా మనసు ఆడ్తుంది వనమయూరియై

నా పెరట్లో నెలమావి చిగురిస్తుంది.

నా మల్లె తోట సౌరభాల్ని కురిపిస్తుంది

నా కొలను అరవిందాలతో నిండుతుంది

నా వేప చెట్టు వెండిలా పూస్తుంది.

నా లోకం దిశదిశలా పరిమళిస్తుంది.

నాకు నిజమైన పండుగ వస్తుంది.

జీవనది, సజీవనది శ్రీశ్రీ
తాగాల్సిన చోట నీరు తాగండి
కొట్టాల్సిన చోట ఈతాడండి
మీదోసిళ్ళు బావుండలేదని
నదిని తిట్టకండి
మొలలోతునీట్లో ఈతకొట్టి
లోతువేధం కూత పెట్టకండి'

సశ్రీకి శబ్దాల్ని వైచిత్రితో ప్రయోగించడం, భావస్ఫూర్తి కలిగించడం వెన్నతో పెట్టినవిద్య. అలాంటి శైలిని ఈ దీర్ఘ కవిత నిండా చూడగలం. కవిత్వంలో లఘురూపాలరచన ఈనాడు పరాకాష్ఠ దశలో ఉంది. మినీ కవిత, హైకూ, నానీ రూపాలే గాక, కొందరు ఏవేవో పేర్లు పెట్టి తమవైన చంధస్సుల్ని ప్రచలితం చేసే వైయక్తిక ప్రయత్నాలు చేస్తున్నారు. కాని యివేవీ నిలబడే జాడ కనిపించదు.

కృష్ణా జిల్లాలో, అన్ని ప్రాంతాలలోనే లఘురూపాలు స్వీకరించి, రచనలు చేసేవారు అధిక సంఖ్యలోనే ఉన్నారు.

## ఆవేదన

**భమిడిపాటి బాలాత్రిపురసుందరి, విజయవాడ**

**వి**శాల విశ్వంలోకి
ఆదరంగా ఆహ్వానించి
'ఉగ్గు' పట్టి ఊఁలు నేర్పి
పాలుపట్టి లాలపోసి
పారాడే వయసు కాదని
అడుగులకు అరిసెలేసి
గడపలన్ని దాటించి
చేయిపట్టి నడిపించి
ఈ నేలంతా నీదేనని
గర్వంగా చూపించి
అక్షరాభ్యాసం చేయించి
అ.ఆ.....లు దిద్దించి
పెద్ద చదువులు చదివించి
మురిపాలన్నీ తీర్చి
మురిపెంగా చూసుకొంది
సాధించాననుకొంది
రెక్కలొచ్చి చేయి విడిచి
నేలవదలి వెడుతుంటే..
రెక్కలూడి పట్టులేక
చేయివాలిపోతుంటే
పట్టుకొనే దిక్కులేక
దిక్కులు చూస్తూ అనుకుంది
అందరూ ఆ మేరకా.......!!
ఈ మేర గతి.........??

హైకూ జపానునుండి వచ్చిన ప్రక్రియ అనుభూతి యిందులోని ప్రధాన వస్తువు. అలాగే ఆంధ్ర దేశంలో మొదటి దశలోని హైకూ కవులు రాశారు. కాని రాను రాను సామాజిక వస్తువును హైకూలో చెప్పడం చాలా విస్తృతమైంది. హైకూలోని అనుభూతి వస్తువుకు సంబంధించిన పునరుక్తి నుండి ఒక మార్పు తేవడం కోసం ఈ సామాజిక ప్రారంభం కావచ్చు. లేదా హైకూ శిల్పాన్ని సామాజికతకు వాహికగా వినియోగించుకోవడంలో ఎన్నో ఒడుపుల్ని చేసే అవకాశం ఉందనే అంశాన్ని రుజువు చెయ్యడానికి కావచ్చు. ఏమైనా అనుభూతి, సామాజికత -రెండూ ప్రధానంగా హైకూ రచన వ్యాప్తమయింది.

లంకా వెంకటేశ్వర్లు హైకూ లో అనుభూతి కేంద్రీకరణ తోనూ సామాజికతతోనూ కూడా ' ఆకాశం నిండా మబ్బులు కమ్ముకున్న వాన కురిసింది. అంతసేపూ ఆకాశం కనిపించలేదు వానతో పాటు నేలమీదకు జారిపోయింది. నీళ్ళలో ప్రతిబింబించే ఆకాశం ఈ భావనతో పాటు స్ఫురిస్తోంది. వాన కురవడం పూర్తయిన తర్వాత మళ్ళీ ఆకాశం కనిపిస్తోంది. పక్షులు ఎగురుతున్న అవి ఆకాశాన్ని నేస్తున్నట్లుగా ఉంది కొంత కొంతగా కనపించి, క్రమంగా పూర్తిగా కనిపించే ఆకాశం కూడా ఈ భావనలోచంచి ధ్వనిస్తోంది. ఎంతో అనుభూతిని యిముడ్చుకుంది ఈ హైకూ. సామాజికతకు కూడా హైకూని లంకా వినియోగించుకున్నాడు.

'రోజంతా పాడుకున్నా
ఈ చెప్పులు
గడపవతలే'

శ్రమ జీవికి, అతణ్ణి ఉపయోగించుకున్నవాళ్ళు ఇచ్చే అగౌరవం పై హైకూలో వ్యక్తమౌతుంది.

సుదేరా, హైకూ ప్రక్రియనే తీసుకుని మూడు పాదాల్నీ పెద్దపెద్దవిగా రాస్తూ సామజిక భావాల్ని నింపి, పద్దికలు అనే పేరు పెట్టిరాశాడు. యంత్రం, జంతువు మానవుడు-ముగ్గుర్నీ తీసుకుని, తేడాని ఈ క్రింది విధంగా చెప్పాడు.

నిర్విరామంగా నోట్లని అచ్చొత్తుకోవడం యంత్ర లక్షణం
నిద్రామైదాన విహారాలతో సరిపుచ్చుకోవడం జంతులక్షణం
జినోప్ పరిణామక్రమంలో మనం కోల్పోయిందే మానవ లక్షణం

యంత్రంకి నిర్విరామత ఉంది,జంతువుకి ప్రకృతి ప్రేరణ ఉంది. అవి వాటి సహజ లక్షణాలు. వాటికవి పోషించుకుంటున్నై. ఒక్క మనిషి మాత్రమే తన లక్షణాన్ని కోల్పోయాడు-అని పై రెంటికంటె మానవుడే తక్కువ స్థానంలో ఉన్నాడని తెలిపాడు.

సోమేపల్లి వెంకట సుబ్బయ్య మినీ కవితలు నానీలు రాయడంలో నైపుణ్యం గలవారు ముందుగా లోయలో మనిషి అనే మినీ కవితా సంపుటిని వెలవరించాడు తర్వాత నానీల సంపుటివేశారు. నాలుగు పాదాల్లో ఒక క్లుప్తతనీ, సామాజిక భావాన్నీ ఇమిడ్చి, రెండేసి పాదభాగాల స్పందన -ప్రతిస్పందన శిల్పం అనుసరించినప్పుడు మినీకవితకీ నానీకి ఉన్న భేదం ఏమీ కనిపించదు. సోమేపల్లి రాసిన ఈ కింది కవిత అందుకు ఉదాహరణ

'రక్తదానానికయితే
మనుషులే లోటు
రక్త దాహానికైతే
మనుషులు కోటానుకోట్లు'

దానానికి-దాహానికి, లోటు-కోట్లు-ఇలాటి పదాలతో వైరుధ్యం సాధించి, రెండేసి పాదాలభాగాలని పాటించారు.

మినీకవితా రూపాన్ని సామాజికం చెయ్యడంలో అసాధారణమైన క్లుప్తతా శిల్పాన్ని పాటిస్తూ, సామాజికతను దాటిన రాజయకీయ చైతన్యాన్ని హేతువాద స్పృహనీ, వర్గ సంఘర్షణనీ నిక్షిప్తం చెయ్యడంలో ఒక ప్రత్యేకతను సాధించిన కవి. ఎస్. అశోక్ కుమార్. 'తంత్రం' కవితా సంపుటిలోని కవితలు ఇందుకు సంపూర్ణ ప్రతిబింబాలు.

'జన్మభూమి
వీడిది
రామజన్మభూమి
వాడిది
మాతృభూమి
అప్పులోడిది!

అతిక్లుప్తత అశోక్‌కుమార్ మార్గం పంక్తికి ఒక పదమో రెండు పదాలో తప్ప ఎక్కువ వుండవు. శబ్దాన్ని తూకంగా అర్థవంతంగా ప్రయోగించడం, శబ్దాన్ని అటూఇటూ మారుస్తూ భావభేదాల్ని సాధించడం అశోక్ కుమార్‌లో ముఖ్యంగా కనపిస్తుంది జన్మభూమి రామజన్మభూమి, మాతృభూమి-పదాలు తీసుకుని రాజకీయ స్పృహను నింపాడు మినీ కవితలో. జన్మభూమి ఒక పార్టీ వారి నినాదం రామజన్మభూమి మరోపార్టీ వారిది. కాని యిద్దరికీ మాతృభూమితో అవసరం లేదు. దాన్ని తీసుకువెళ్ళి మరో దేశపు అప్పుల కోసం తాకట్టు పెట్టారు. అందుకే, వీడిది వాడిది, అప్పుకోసం తాకట్టుపెట్టారు, అందుకే , వీడిది వాడిది, అప్పులోడిది-అనే పదక్రమం కూడా సరిపోయింది. వీడు-రాష్ట్రీయం వాడు దేశీయం అప్పులోడు పరదేశీయం. మినీ కవితా శిల్పంలో ప్రధానమైన 'పదం' కోణాల్ని వినియోగించుకోవడంలో అశోక్ కుమార్ కి ప్రత్యేకత ఉంది.

మినీ కవితలూ, హైకూలు రాసే వారిలో చాలామంది పెద్ద కవితలూ, దీర్ఘకవితలూ కూడా రాస్తున్నారు.

కృష్ణా జిల్లాలో, అప్పటికీ యిప్పటికీ చెప్పుకోదగ్గ కవిత్వాన్ని రాసినవారూ రాస్తున్నవారూ ఇంకా చాలామంది ఉన్నారు. అరసవిల్లి కృష్ణ అడ్డూరి రమణ, బొబ్బిలి జోసెఫ్, కోనేరు కల్పన, పింగళి వెంకటకృష్ణారావు, గుత్తికొండ సుబ్బారావు, వద్రేరాళి, సింహాద్రి పద్మ, తాతా రమేశ్ బాబు, శివలెంకరాజేశ్వరి, శ్రీనివాస గాంధీ, కోడూరి, విజయకుమార్, చక్రవర్తి, కొట్టి రామారావు-వారిలో కొందరు.

ముట్నూరి కృష్ణారావుగారి కాలం నుండి ఈనాటి దాకా, సమకాలీన ఉద్యమస్ఫూర్తితోనూ, అభివ్యక్తి నైపుణ్యంతోనూ అనుభూతి సాంద్రతతోనూ, కృష్ణానదీ గమనం లాగానే కృష్ణాజిల్లా కవుల కవితా గమనం సాగిపోతోంది.

## శుభోదయం

(కాపా) వల్లూరుపల్లి లక్ష్మి, విజయవాడ.

ప్రకృతిలోఒక ప్రభాతం ప్రసన్నంగా
ప్రశాంతంగా ప్రభవించబోయే తరుణాన
ఏదో మధుర స్వనం మదిలో నినదిస్తోంది.
గుండె గదిలో వింత వింత కదలికలు!
కలల పందిరిపై కాంతి సుమాల నృత్యం!
ఈ వేకువ వేళ, సుషుప్తిలో, నాహృది
స్వప్న శాఖికపై వాలి,
స్మృతిశకలాల సౌరభాల్ని
ఆఘ్రాణిస్తూ, సర్వం, మరిచినవేళలో......
లేత సూర్యుని పసిడి కిరణం
వాలుగా వచ్చి సుతారంగా తాకింది నన్ను
అణువణువునా అమృతం అలదినట్లు
మనసు రాగ రంజితమయ్యింది.
కాలం చలి దుప్పటి విదిల్చి తలఎత్తి,
కనువిప్పి స్నిగ్ధ మనోహరంగా నవ్వే
పూ బాలల్ని కడగంట చూచింది.
నిన్నటి దాకా బోసిగా నిలచిన యీ
చెట్ల తనువుల్నిండా లేలేత చివుళ్ళు
మదిలోని సున్నిత భాగాల్ని స్పృశిస్తూ
కాలం మీటుతోంది రాగాల వాయులీనం!
సమస్త ప్రకృతీ సర్వాంతర్యామిని స్తుతిస్తూ
క్రొంగ్రొత్త అనుభూతులకు తెరతీస్తూ
ఒక నూతన అధ్యాయాన్ని ఆవిష్కరిస్తోంది.
ఎన్ని సునామీలు, విధ్వంసనాలు విరుచుకపడినా
జన జీవితాన్ని అతలాకుతలం చేసినా
అల్ప ప్రాణులం! ఏం చేయగలం?
ప్రకృతిమాత ఆగ్రహిస్తే ప్రేమరాహిత్యం
అనుగ్రహిస్తే ఆనందాతిశయమేకదా!
ఎన్ని వసంతాలకుమది ఆర్ణవమైనా
ఎన్ని హేమంతాలు గుండెని క్రుంగ దీసినా
ఎంత పొంగినా, మరెంత క్రుంగినా
ఈ దినం నా గుండెలో లేలేత వెచ్చదనం!
నిత్యనూతన కాలమా? నీకు వందనం!
సదా యవ్వనంచిందే నీకిదే
అక్షరాల అమృత చందనం


గౌ॥డా॥ వై.ఎస్. రాజశేఖరరెడ్డి
ప్రియతమ ముఖ్యమంత్రి


శ్రీ కోనేరు రంగారావు గారు
మునిసిపల్ శాఖామాత్యులు


శ్రీ బాడిగ రామకృష్ణ గారు
మచిలీపట్నం పార్లమెంట్ సభ్యులు


శ్రీ కొడాలి శ్రీ వెంకటేశ్వరరావు (నాని) గారు
గుడివాడ శాసనసభ్యులు


శ్రీ లంకదాసరి ప్రసాదరావు
చైర్‌పర్సన్, గుడివాడ మునిసిపాలిటి


శ్రీ శొంఠి చంద్రశేఖర్
వైస్ చైర్మన్, గుడివాడ మునిసిపాలిటి


శ్రీ గాద్దిపాటి శ్రీనివాసరావు
కమీషనరు గుడివాడ పురపాలక సంఘం


శ్రీ అసిలేటి అర్జునరావు
1వ వార్డు కౌన్సిలర్


సూరపనేని అజయ్‌కుమార్
2వ వార్డు కౌన్సిలర్


పి.వి. కృష్ణారావు
3వ వార్డు కౌన్సిలర్


వెంపటి హైమావతి
5వ వార్డు కౌన్సిలర్


బొబ్బగాని కోటమ్మ
6వ వార్డు కౌన్సిలర్


జోగా వెంకటరమేష్
7వ వార్డు కౌన్సిలర్


చింతల భాస్కరరావు
8వ వార్డు కౌన్సిలర్


జోగా సూర్యప్రకాశరావు
9వ వార్డు కౌన్సిలర్


పైడి సత్యనారాయణ
10వ వార్డు కౌన్సిలర్


అర్షతున్నీసా
11వ వార్డు కౌన్సిలర్


ఎస్.కె. లతీఫున్నీసా
12వ వార్డు కౌన్సిలర్


మేరుగు మరియకుమారి
13వ వార్డు కౌన్సిలర్


కాయిలాపు కృష్ణ
14వ వార్డు కౌన్సిలర్


గంధం జాలియమ్మ
15వ వార్డు కౌన్సిలర్


గుదే లక్ష్మీరంగనాయకమ్మ
16వ వార్డు కౌన్సిలర్


గణపతి చాముండేశ్వరి
18వ వార్డు కౌన్సిలర్


కాటేపల్లి విజయలక్ష్మి
19వ వార్డు కౌన్సిలర్


లింగం జయ
20వ వార్డు కౌన్సిలర్


రేపల్లె కమల కుమారి
21వ వార్డు కౌన్సిలర్


వవిలాది శ్యామల
22వ వార్డు కౌన్సిలర్


చింట్యాల రాంబాబు
23వ వార్డు కౌన్సిలర్


మల్లిపూడి శ్రీనివాసచక్రవర్తి
24వ వార్డు కౌన్సిలర్


దారపురెడ్డి వి. నాగలలిత
25వ వార్డు కౌన్సిలర్


అడపా వెంకటరమణ(బాబ్జి)
26వ వార్డు కౌన్సిలర్


శొంఠి శ్రీనివాసరావు
27వ వార్డు కౌన్సిలర్


కె. గణపతి
28వ వార్డు కౌన్సిలర్


సానా భోగేశ్వరరావు
29వ వార్డు కౌన్సిలర్


బంటుమిల్లి త్రిమూర్తులు
30వ వార్డు కౌన్సిలర్


ఎన్.వి.వి. ప్రసాద్
31వ వార్డు కౌన్సిలర్


గార్ల పాండురంగారావు
32వ వార్డు కౌన్సిలర్


నెరుసు చింతయ్య
33వ వార్డు కౌన్సిలర్
కాంగ్రెస్ పార్టీ ఫ్లోర్‌లీడర్


మరడాని వెంకటరమణ
34వ వార్డు కౌన్సిలర్


గోకరకొండ బలరామకృష్ణ
35వ వార్డు కౌన్సిలర్


రాయి రాజేశ్వరి
36వ వార్డు కౌన్సిలర్


యలవర్తి శ్రీనివాసరావు
కో-ఆప్షన్ సభ్యులు

## అభివృద్ధి పథంలో గుడివాడ పురపాలక సంఘం

ఆంధ్రప్రదేశ్ పట్టణ పేదల సదుపాయముల పథకం (ఎపియుఎస్‌పి) బేసిక్ మ్యాపు : ఈ పథకం క్రింద పట్టణములో గల 42 మురికివాడలలో సి.సి. మరియు డ్రైన్లు పనులు రు. 317.90 లక్షల రోడ్లు అంచనాలతో 25 పనులు చేపట్టి పూర్తి చేయబడినవి.

సిమ్యాపు : ఈ పథకం క్రింద రు. 380.25 లక్షల అంచనాతో 31 పనులు చేపట్టడమైనది. రు. 282.00 లక్షల విలువ గల 30 పనులు పూర్తి చేయడమైనది సి.మ్యాప్ 2 : రు. 286.20 లక్షల విలువ గల పనులకు ప్రతిపాదనలు డ్రైన్‌లు రోడ్లు మరియు వాటర్ సప్లై పనులను అమోదించడమైనది. టెండర్లు దశలో వున్నవి. **ఆంధ్రప్రదేశ్ పట్టణ సంస్కరణలు మరియు మున్సిపల్ సర్వీసెస్ ప్రాజెక్టు (ఎ.పి.యు.ఆర్.ఎం.ఎస్.పి)** ఈ పథకం క్రింద గుడివాడ పట్టణమునకు ఫేజ్-1 క్రింద రు. 240.00 లక్షలు మంజూరు కాబడినవి. మొదటి ప్యాకేజి క్రింద రు. 107.98 లక్షల విలువగల 13 పనులకు గాను డ్రైన్‌లు నిర్మించుటకు మరియు ప్యాకెజి-2 క్రింద 89 లక్షలు 7 పనులకు గాను రోడ్లు మరియు జంక్షన్ అభివృద్ధి చేయుటకు తగుచర్యలు తీసుకొనబడుచున్నవి. నగర పురపాలక సంఘ కార్యలయ భవన నిర్మాణము రు. 120 లక్షల అంచనాతో ఎస్.పి.ఎస్. స్కూలు అవరణలో నూతన పురపాలక సంఘ కార్యలయ భవన నిర్మాణము చేపట్టుటకు సాంకేతిక మంజూరు కాబడినది. టెండర్లదశలో వున్నవి.

ఫాతిమున్నీసా
కో-ఆప్షన్ సభ్యురాలు

షేక్ ఇబ్రహీం
కో-ఆప్షన్ సభ్యురాలు

**★ సకాలంలో పన్నులు చెల్లించి పట్టణాభివృద్ధికి తోడ్పడండి ★**

32a

326

# సాహితీ సరస్వతి మీటిన విశ్వ సంగీతం

## "విజ్ఞాన పీఠం అవార్డు" లతగారిని సంపాదించుకున్న సందర్భంలో వెలువరిస్తున్న లతాంతరంగ ఆర్ద్రరాగాను రాగాలు

**లత !**

ఒకే ఒక్క లత!

తెలుగు సాహిత్యంలో, తెలుగింటి స్త్రీలోకంలో ప్రతిపాత్రనీ స్పృశించిన లత ! ప్రతిపాత్రలోనూ తననీ, తనలోకాన్నీ ప్రతిఫలించిన లత!

తెన్నేటి హేమలత !!

భర్త చాటు పతివ్రతల్నీ, స్త్రీసామ్యాన్ని చెలాయించిన మహాస్వాధ్వుల్నీ పాత్రలుగా మలిచి, భారతి చేతి తూలికగా నిలిచింది లత !

అంతలోనే మామూలు గృహిణిలా ఇల్లూ, వాకిలీ, సంసారం, కొడుకులూ, బాధలూ, మనవళ్ళూ, మనవరాళ్ళూ అంటుంది. కానీ, అది చాలా స్వల్ప కాలమే! చూస్తుండగానే బెజవాడ కనకదుర్గలా మారిపోతుంది. "వేద ఋషిక" తనను తాను "సాహితీ లత" గా సృజించుకుని, ఈ యుగంలో ఆడదాని విముక్తి కోసం రుక్కులు ప్రవచిస్తోందా.... అనిపిస్తుంది. యోగస్థితిలో తన సాహితీ ప్రపంచలోకి వెళ్ళిపోయి రోజులు తరబడీ గడిపేస్తుంది!

పతితుల్నీ, భ్రష్టుల్నీ, పనికిమాలిన వాళ్ళనీ సాహిత్యానికీడ్చి, రచనల 'మడి'ని మంటగల్పిందని ఆమెను ఎందరు తిట్టినా, అది తన కీర్తికి కలికితురాయిగానే భావిస్తుంది..

ప్రేమైకమూర్తి అయిన స్త్రీని కామినిగా చిత్రించి దిగజార్చిన ఆధునికయుగపు "ముద్దుపళని" గా ఆమెను నిందించినా అదే చిరునవ్వు వెదజల్లుతుంది. రాముడిలోని ఔన్నత్యాన్నీ సీతలోని నాయకత్వపు లక్షణాల్నీ, పౌలస్త్యుడిలోని ప్రేమ హృదయాన్నీ ఆవిష్కరించి నవకాలపు "మొల్ల" గా, గత కాలపు 'లల్ల' గా ఆమెకు ఘనకీర్తులు వచ్చినా 'భగవదార్పణం' అనే అంటుంది. చలించని ఆమె స్థితప్రజ్ఞ ఆమెను అపర కాళిక గానే నిలిపింది. ఇంతకీ ఆమెను ఎదుటపడి నిందించ గల్గిందెవరు?

> **దివంగత రచయిత్రి కళాప్రపూర్ణ లత కృష్ణాజిల్లా రచయితల సంఘం ఉపాధ్యక్షులుగా ఉండేవారు ఆమె మరణానికి కొద్ది రోజుల ముందు లక్షరూపాయల నగదుతో పాటుగా విజ్ఞాన పీఠం అవార్డును ఆమె అందుకున్న సందర్భముగా ఆంధ్రజ్యోతి దిన పత్రికలో డా॥ జి.వి. పూర్ణచంద్ తీసుకున్న ఈ ఇంటర్వ్యూ ప్రచురితమయింది.**

లత కొత్త కెరటమే కాదు - ప్రాత ఉప్పెన కూడా! నాటి తరానికీ, నేటి తరానికీ ఆమె ఓ దీపమాలిక !

సాహితీ సరస్వతి చేతి కచ్ఛపిపై మోగిన వేదనాదం డాక్టర్ తెన్నేటి హేమలత! విజ్ఞాన పీఠం అవార్డు ఆమె సంపాదించుకున్న సందర్భంలో "లతాంతరంగ ఆర్ద్రరాగా" ల్ని కొన్నింటిని ప్రోగుచేసి పాఠకులకి అందిస్తున్నాను.

"నానృషిః కురుతే కావ్యం అన్నారు. ఋషి కానివాళ్ళు కావ్యాలు రాయకూడదు. "నాన్-రుషులు" రచనల్ని చేస్తే సాహిత్యం కిళ్ళీ కొట్లో "నాన్-రొట్టె" అయినట్లే - (నాటి క్షుద్రసాహిత్యాన్ని, నేటి ఫెమినిజాన్నీ దృష్టిలో పెట్టుకొని ఇవి ఆమె అంటున్న మాటలు.)

"ఋషి అంటే" ?

"ఋషి అంటే, తన వ్యక్తిగత అనుభూతుల్నీ, అనుభవాల్నీ, రాగాల్నీ, విరాగాల్నీ ఈ లోకం మీద రుద్దని వాడు కవి, మహావ్యక్తి, మహారచయిత"

"తెలుగులో ఋషి అయిన రచయిత లెందుకు లేరూ? వావిలి కొలను సుబ్బారావు (వాసుదాసు) గారు గొప్ప ఋషి. అలాగే రాసేటప్పుడు వ్యక్తిగత కోపతాపాల్ని పక్కనపెట్టి రాసిన ఋషి విశ్వనాథవారు. (విడిగా కోపతాపాలు ఆయనకు మామూలే!

అందుకే, రాసేటప్పుడు రచయిత తాను తాను కాకూడదు. ఆ గుణం విశ్వనాథవారికుంది. ఒక ఋషి లక్షణాలు ఆయనకున్నాయి, ఆయన్నుంచి నాకు సంక్రమించాయి.

"నాకు గర్వం ఎక్కువని కొందరంటారు... అది ఆత్మ విశ్వాసం అయితే కావచ్చు. 130 నవలలు, లక్షపేజీలూ రాసిన నాకు గర్వం అలంకారం కాదా?"

"వేయి పేజీలు చదివి ఒక్క పేజీ రాసిన దాన్ని. అవును! విశ్వనాథవారి సాహితీ వారసురాలిననే కొద్దిపాటి అతిశయంకూడా నాకుంది. ఈయన ఫ్యూడలిజాన్నీ ఏనాడూ కోరలేదు. రాచరికాన్నీ భూస్వామ్యాన్నీ సమర్థించలేదు. ఆయన మీద నింద వేసిన వారు పాపాత్ములు

"భాషా జ్ఞానం, పాండిత్యం, పూర్వసాహిత్య పరిచయం, సమకాలీన సమాజం మీద అవగాహన రాబోయే కాలాన్ని గురించి ఊహించగలగడం ఇవి లేని వాడు మంచి రచయిత కాలేడు, అసలు రచయితేకాడు.

ఒక్కో రచనలో అనేక పాత్రలుంటాయి. ఒక్కో పాత్ర ఒక్కో జీవితం. ఇవేవీ మన స్వంతం కాదు. అసలు మనస్వంత జీవితమే మన స్వంతం కాదు. సమయాలూ, అసమయాలూ మనల్ని బాధ పెట్టినప్పుడే ఆ పాత్రలద్వారా రకరకాల అభిప్రాయాలు వెలిబుచ్చుతాం. అవన్నీ మనస్వంతం కాదు అలాగని కాకనూ పోలేదు.

అవును ! రచయిత ఎప్పుడూ అజ్ఞాతంగానే ఉండాలి వాల్మీకి తో సహా! రచయితకు రాముడిమీద గానీ రావణాసురుడి మీద గానీ అభిమానమూ వుండదు-దురభిమానమూ వుండదు. "రామో విగ్రహాన్ ధర్మః"-రాముడు ఆపాదమస్తకం ధర్మమూర్తి సౌందర్యవంతుడు. ఇది వాల్మీకి పక్షపాతంతో చేసిన సృష్టికాదు శ్రీరామచంద్రుడు పట్టాభిషేక సమయానికి అతని తండ్రి వృద్ధుడు. శత్రువులు పెరిగారు. సమశప్తకులు పేరుతో చైనీయులు ఆనాడే మనకు విరోధులు. లంకలో పౌలస్త్యుడు బలసంపన్నుడు. ప్రపంచంలో వున్న చెడు గ్రహాలన్నీ అతని వెనక చేరాయి. అది పట్టాభిషేక ఉత్సవాలు జరుపుకునే సమయమా.......? లేక శత్రు నిశ్శేషం చేయాల్సిన సమయమా......? రాముడు ఒక చక్రవర్తి తనూజుడిలా ప్రవర్తించాడు. అందుకే అతను ధర్మమూర్తి అలాగని, వాల్మీకి ఎక్కడా

పౌలస్త్యుని కించ పరచలేదు. రామాయణంలో పాత్రలు తమ తమ సహజలక్షణాల్ని ప్రదర్శించాయి. అంతే! నాయకుడికి ఎంత ప్రాధాన్యత వుందో ప్రతినాయకుడికీ అంతే ప్రాధ్యాన్యత వుంది! ఇంక, భరతుడు పాదుకల్ని నెత్తిన పెట్టుకోవడం, రాముడు సీతను అగ్నిప్రవేశం చేయించడం అంటారా......? అవి అవాల్మీకాలు. అసలు రామయణంలో లేనివి.!

ఈనాటి సాహిత్యం వెనకబడిందంటే, సమాజహితం కోరే రచయితలు తగ్గిపోయారని అర్థం అందుకు కారణం ఒక దశలో డబ్బే!

డబ్బు పబ్లిషర్లనుంచి కొందరికి వేలల్లో వచ్చి పడింది. ఏదోకటి రాయక తప్పదు. దీపం వుండగానే ఇల్లు చక్కపెట్టుకున్నారు చాలామంది. కానీ, నా దీపం ఆరేది కాదు అది సహస్ర కిరణాలతో వెలిగేది. మధ్యన వచ్చిన రచయితలు రచనా పటలం మీద పిచ్చిగీతల్లా వుండిపోయారు"

"వాల్మీకి కి ఎవరు డబ్బిచ్చారని రామాయణం రాశాడు ? అదొక ఆత్మ సంతృప్తి. ఇన్ని కబుర్లూ చెప్పిన నేనుకూడా కొద్దిగా డబ్బు తీసుకునే రాశాను. అప్పట్లో నేను తీసుకున్నది ఇతరులకన్న ఎక్కువేనని కూడా అనేవారు. అయితే సాహిత్యం కన్న డబ్బు గొప్పది అని ఏనాడు నేననుకోలేదు. 1983 తర్వాత నేను రాసింది చాలా తక్కువ. ఈ పదిహేనేళ్ళలో బతికున్న సాహిత్యం ఎంతవుందో ఆలోచిస్తే ఎవరికైనా వాస్తవం భోధపడ్తుంది. ఇప్పుడు చాలామంది రచయితలకి స్వంత ఆలోచనలు లేవు. వున్నవాళ్ళం 'రాయని భాస్కరులం' అయ్యాం రాయని వాళ్ళు భాస్కరులెలా అవుతారు? అమావాస్యలే!! సాహిత్యాన్నే కాదు, మనం చాలా విషయాల్ని పట్టించుకోవడం లేదు. అవినీతినీ, అరాచకాన్నీ అఖరికి వ్యభిచారాన్నీ కూడా మనం ఖండించలేని స్థితిలో వున్నాం. మాతృదేశాన్నీ మన మహా సంస్కృతినీ కించపరుస్తున్నా మనం కిమ్మనడం లేదు. జాతీయ గ్రంథమైన, మహత్తర ఇతిహాసమైన రామాయణాన్ని తిడితే చదివి ఆనందించాం. ఎక్కడిదీ ఈ నపుంసకత....? ఎక్కడిదీ ఈ పురుష విహీనత...? ఇదేంశాపమో మనజాతికి తెలియడం లేదు! ఎక్కడి రామాయణం! ఎక్కడి విషవృక్షం.....?

ఈనాడు స్త్రీ స్వేచ్ఛ అనేది మునుపటికన్నా తక్కువగా ఉందనే నా భావన. పూర్వం మా నాయనమ్మ గారి కాలంలో -ముఖ్యంగా మా "నిభాన్‌పూడి" వారి కుటుంబంలో- భార్య నడక్కుండా ఏ పనీ చేసేవారు కాదు మగవాళ్ళు. ఇప్పుడు ఏ పురుషుడూ తన భార్యను లెక్క చేయడం లేదనే అనిపిస్తోంది. ఈ మార్పు ఎందుకొచ్చిందీ. ఇప్పుడొస్తున్న సాహిత్య ప్రభావం మనుషుల మీద ఏమి లేక పోవడం చేతనేనా! ఏమో కావచ్చు!!

"ఫెమినిజం పేరుతో ఈనాడు వస్తున్న సాహిత్యం స్త్రీ స్వేచ్ఛకన్న సెక్సు స్వేచ్ఛకు ఎక్కువ ప్రాధాన్యత ఇస్తున్నట్లు కన్పిస్తోంది. పెద్దలు చాలామంది అంటున్నారు. నాకూ అదే అనుమానం. నేనూ స్త్రీ వాదినే. తీవ్రమైన స్త్రీ వాదినని ఆ రోజుల్లోనే పత్రికలు నా గురించి రాశాయి. కానీ, నా సాహిత్యం మీద ఇటువంటి విమర్శ ఎన్నడూ రాలేదు. స్నేహంతో కూడుకున్న ప్రేమనే నేను కోరుకున్నాను గానీ, దిక్కుమాలిన విచ్చలవిడి సెక్సును కాదు. స్త్రీ పురుషుల మధ్య రొమాన్స్ అందంగా వుంటుంది. రొమాన్స్‌కు వయో భేదం లేదు."

అసలు స్త్రీ కి సెక్సు స్వేచ్ఛ లేనిదెప్పుడు? స్పీడోమీటరు వుంటుందా? ఇన్ని కిలోమీటర్లు తిరిగిందని గుర్తించడానికి! ఆమాటకొస్తే మగాళ్ళకీ లేదు. సత్యవతి ఎవణ్ణడిగి వ్యాసుణ్ణి కంది? కుంతి ఎవరితో చెప్పి కర్ణుణ్ణి కంది?

స్త్రీ వాదుల వాదం అవసరమే గానీ, వాళ్ళకి చెప్పడం సరిగా చేతకావడం లేదు. దానికి కారణం, చరిత్రనీ, దేశకాల పరిస్థితుల్నీ ఇతర దేశ పరిస్థితుల్నీ సరిగా చదవక పోవడమే! చదివినా అవగాహన కలగక పోవడమే!!

"పమిటలు తీసేయ్యాలి, గర్భకోశాన్ని కోసేయ్యాలి, వంటిళ్ళు తవ్వేయాలి- వంటి నినాదాల్ని కూడా ఈ మధ్య సాహిత్యంలో చదువుతున్నాను. పమిటలు వేసుకోని స్త్రీలు యూరప్ లోనే కాదు మనదేశంలోనూ వున్నారు. చాలా ప్రాంతాల్లో చాలా ఆటవిక జాతులు ఏ ఆచ్ఛాదనా లేకుండా తిరుగుతుంటారు. ఇప్పుడు ఆడపిల్లలు వేసుకొంటున్న డ్రస్సులు పమిటలు లేకపోయినా అందంగానే ఉంటున్నాయి. ఇది తప్పని గానీ, ఒప్పనిగానీ, మనం చెప్పలేం. కాలానుగుణంగా రుచి భేదాలు మారు తుంటాయి. కనుక పమిటలు తీసేయ్యాలనే గోలని ఒక గొప్ప సాహిత్య ఉద్యమంగా భావించడం కన్న మూర్ఖత్వం ఇంకొకటి లేదు.

"ఈ మధ్య ఓ చర్చిలో 500 మంది యూరోపియన్ కన్యలు పెళ్ళయ్యే వరకూ కన్యగానే వుంటామని దేవుడి ముందు ప్రమాణం చేశారట. నాకు చాలా సంతోషం అనిపించింది అలాగని, సెక్సు తప్పని అంటున్నాననుకోండి సెక్సనేది సృష్టికి మూలం. ఒక విధమైన స్త్రీ పురుష యోగోద్భవం దాన్ని చాప పరిచినట్లు రోడ్డు మీద పరిచి చిన్నబుచ్చకూడదు.

"చాలా మంది తెలియని వాళ్ళు ఇదంతా చలం ప్రభావం అంటుంటారు. చలం ఫెమినిజానికి చేసిందేమీ లేదు. పైగా ద్రోహం చేశాడు. చక్కగా, సుఖంగా కాపురాలు చేస్తున్నవారు కూడా అకారణంగా దారి తప్పారు. వీధిలోకి వెళ్ళిన స్త్రీ నీడలోకి వచ్చేందుకు దారిలేకుండా పోయింది. ఈనాటి ఫెమినిజం అలా కాకుడదని ఆశిస్తున్నాను".

"నేను రెబెల్ నే! ముమ్మాటికీ! స్త్రీ విముక్తి కోసమే ఆనాడు నేను రెబెల్ నయ్యాను. అనాడేమిటీ - ఈనాటికీ రెబెల్‌నే! అయితే నాకు పురుషద్వేషం లేదు.

స్త్రీకి ఆస్తిహక్కు కోరుతూ జీవనస్రవంతి రాశాను. పురుషద్వేషానికి విరుగుడుగా, ఆ పురుషుణ్ణి నిరభ్యంతరంగా వదిలేయమని నీహారిక రాశాను. ఆ పురుషుణ్ణి నిర్దాక్షిణ్యంగా దండించమని "ఇది తులసివనం" రాశాను. "పదవిహీన"లో స్త్రీవిద్య ప్రాముఖ్యతని చెప్పాను. "అవమానిత"లో మనసులు కలవని మనుషులు విడాకులు పుచ్చు కోవడమే మేలని చెప్పాను. "అపరిణత" నవల పురుషద్వేషంతో పెళ్ళీపెటాకులు లేకుండా మగవాళ్ళని దూషిస్తూ తిరిగే ఆడవారి మీద

రాసిన నవల "గాలిపడగలు నీటి బుడగలు" నవలలో వ్యభిచారాన్ని నిషేధించాలని ప్రకటించాను.

అంతే గాని, నేను ఏనాడు ఆడదాన్ని బరితెగించి ఊరుమీద పడమని ప్రబోధించలేదు. ఆపని చేసే మగవాళ్ళనికూడా క్షమించకుండా దండించమని అనేక నవలల్లో గట్టిగా చెప్పాను. స్త్రీకి వ్యభిచార దోషంలేదు. ఆ పని చేసిన పురుషుడికే దండన వుంది మన భారతీయ న్యాయ శాస్త్రంలో! వ్యభిచరించిన స్త్రీకి దండన వేస్తున్నది-ఇప్పుడు మనం అనుసరిస్తున్నది ఇంగ్లీషు వారి చట్టం.!

వయసు పై బడింది కాబట్టి ఇప్పుడు నీతి వాక్యాలు చెబుతున్నానని మళ్ళీ కొందరు అనవచ్చు. విశ్వనాథ వారి శిష్యరికం వలన యవ్వనంలోనే ముసలి ఆలోచనలున్న దాన్నని ఆనాడే చాలా మంది అన్నారు. తిరుగుబోతుననీ, తాగుబోతుననీ దారుణంగా ప్రచారం చేశారు మరి కొందరు. ఇలాంటి విషయాల్ని బైటపడి మాట్లాడడానికి ఏ ఆడదీ సాహసం చెయ్యని రోజుల్లో కలం పట్టినదాన్ని! స్త్రీలహక్కుల కోసం పోరాడుతున్న ఓ ఆడదాని మీద చూపించవలసిన మర్యాదను మన విమర్శకు లెవరూ చూపించలేదు. పైగా బురదచల్లారు. అయినా నేను చలించలేదు.

ఇప్పుడే కాదు. పరిపూర్ణ యవ్వనంలో వున్న రోజుల్లోకూడా ఆడవాళ్ళతో మాట్లాడినా మగవాళ్లతో సమానంగా తిరిగినా "టెకోరం"అనేదాన్ని నిలబెట్టుకున్నదాన్ని నేను. నా జీవితంలో ఎంతో క్షోభననుభవించాను. అనుభవిస్తున్నాను కూడా! నాక్షోభలోంచి నా సాహిత్యం పుట్టింది. సహృదయులు నన్ను ఆంధ్రా కమలాదాస్ అన్నారు. మళయాళీ అని ఆమెనూ పిలిచారట రెండూ నాకు గర్వకారణమే!

ఆంధ్రప్రభకీ, ఆకాశవాణికీ ఆంధ్రా యూనివర్శిటీకి, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీకీ నేనెప్పుడూ ఋణపడే వుంటాను. వీటివలనే నేను పైకి వచ్చాను కాబట్టి!

లత ఎవరో, లత ఏం సాధిచిందో మరోలత పుడితే గానీ చెప్పదేమో. స్త్రీతలెత్తుకు తిరగాలంటే, ఇంకో అయిదారుగురు లతలైనా జన్మించాలనీ జన్మిస్తారనీ నా ఆశ!

"జగజ్జనని ఆ హేమలత! ఇప్పుడు నా శరీరంలో వున్న లత ఆ జగజ్జనని హేమలత శరీరంలో లీనమైపోయి, కొన్ని వేల లతలు పుట్టుకు రావాలి. ఒక అణువులోంచి పరమాణువులు వచ్చినట్లే 'లత'లు పుడతారు. స్త్రీలోకాన్ని ఉద్ధరిస్తారు. లత ఎప్పుడూ ఆశాజీవి! లతెప్పుడూ చిరంజీవి.!!

తల్లికి దాస్యమున్ జెరుప తారల సీమను మీరి సూటిగన్
వెళ్ళినదేలనో సురల వీధికి వీరుడు వైనతాత్మజుం
దల్లన పొంద తానమృతమాగడమేలను **ఆంధ్రులింటి వం**
**టిల్లయు కాదొకో అమృత**మెట్టుల ఈనుడి విస్మరించెనో

**శ్రీ అధిభట్ల కామేశ్వరశర్మ, అబుదబి** (UAE)

## అధివాస్తవం!!

**వి.ఎస్.ఆర్.ఎస్.సోమయాజులు, కాకినాడ**

జీవితానికి
కల
ఓ అధివాస్తవ-ఆలంబన!
మూడు కాలాల సంకేతంలా
అగ్ని చక్రమై "కల"!
తన కర్పూరాల పరిధుల్నించి
పరి"భ్రమి" స్తూనే వుంటుంది!
ఒక్క స్వప్నం- సాకారం కావడానికి
చైతన్యపు చిరుబీజంలా
మొలకెత్తిన అక్షరాలు
రేపటి యుగాంతాల దాకా
శ్వాసించే కవుల సుందరస్వప్నాలవుతుంటాయి!

కాలం వెంబడి ప్రయాణంలో
కాలనాళికలు
సాక్షీభూతాలై
చరిత్రపుటల్లోకి నమోదు కాబడ్తుంటాయి
సాక్షరతా తీరంలో
కరిగిన పాదముద్రల్నించి
స్వాంతన లేపనం అలుముకుంటూ
ఏ ఒక్క స్వప్నమైనా-అపురూపమై
సాకారమైనిలవాలని-నిలుపు కోవాలనీ
కవుల సరితాపం కాల నివేదనలలో నిలుస్తుంది

సువేధా జగతికి సర్వస్వజ్ఞాన స్వరాల్ని అక్షరాలుగా మార్చుకుంటారు రేపటి యుగంతాల దాకా శ్వాసించాలనుకునే అధివాస్తవికలౌతుంటారు.

వాళ్ళే ప్రయత్న పథికలు-కవులు! శాబ్దక ప్రపంచాన కవిత విరించులై, సత్యా విష్కరణం చేస్తుంటారు!!

కానీ, కవులు-కాలం చేస్తున్న -శాబ్దక ప్రపంచపు వునికికి ప్రతీకలై నమోదుకాబడినప్పుడు వ్యాపనాలకి-వేకువ-వెలుగులైనిలుస్తారు! నిన్నటి వివేచనల-అధివాస్తవాల, ఆలంబనలై - ఆలోచనలై, రేపటి-కొనసాగింపు జీవితాలకి నకళ్ళవుతుంటారు. ఆ"దర్శ" నీయమౌ తుంటారు!!

# ఆర్థికంగా ముందున్న కృష్ణాజిల్లాలో యువసాహితీవేత్తల కొరతే

శ్రీ చలపాక ప్రకాష్, విజయవాడ

పచ్చపచ్చని పైరుసోయగం.. బిరబిరపారే కృష్ణమ్మతల్లి పరవళ్ళమధ్య సిరులు కురిపించే అదృష్ట ప్రాంతం కృష్ణాజిల్లా, ఈనేల చేసుకున్న ఏ అద్భుత పుణ్యమో, ఈ ప్రాంతంలో పుట్టినవారు వివిధ రంగాలలో అతిరథ మహరథులుగా వెలుగొంది, జిల్లాకే కాదు రాష్ట్రానికి, దేశానికి తద్వారా ప్రపంచానికి ఈ ప్రాంతఖ్యాతిని గొప్పదనాన్ని చాటారు. అటువంటి గొప్ప పుణ్యమూర్తులు పుట్టిన ఈ ప్రాంతంలో గత రెండు దశాబ్దాల చరిత్రలో సాహిత్యరంగంలో కొత్త యువసాహితీవేత్తల పుట్టుక ఇతర ప్రాంతాల కంటే వెనుక బడివుందని చెప్పటంలో ఏమాత్రం అసత్యం కాదు. అనునిత్యం ధనరాశులు కురిపించే ప్రాంతం కావటం చేతననుకుంటా ఇక్కడ ఉద్యమస్థాయి కవిత్వంగాని రచనలుగాని ఇతరప్రాంతస్థాయిలో చిలికింపబడలేదు. అంతకుముందు ఉద్భవించిన మినీ కవితా విప్లవం ఉధృతి తప్పించి ఇక్కడ ఆశించినంత స్థాయిలో 'సీరియస్ కవిత్వం పండలేదు'' అయితే మాత్రం ఇక్కడ జరిగిన నామమాత్రపు యువసాహితీవేత్తల సృజనని, ఈ ప్రాంత ఉనికిని కాపాడేందుకు నేను సైతం అని అంటూ ముందుకు దూసుకొచ్చిన యువరక్తాన్ని పరిచయం చేసి వారి వెన్నుతట్టి మరింత ప్రోత్సహించి,ముందు తరాలకు ఇక్కడి సాహితీ సంపాదనని అందించి, పరిరక్షించవల్సిన అవసరముంది. ఈ సందర్భాన్ని పురస్కరించుకొని నాకు తెలిసిన కృష్ణాజిల్లా యువ సాహితీవేత్తల సంక్షిప్త పరిచయ వాక్యాలే ఈ వ్యాసం పరంపర.....

**సాహితీసంస్థలు:**

ఈ ప్రాంత యువసాహితీ వేత్తలను పరిచయం చేసే ముందు వారికి సరైన వేదికను కల్పించి ప్రోత్సహించిన సాహితీ సంస్థలని ముందుగా పేర్కోనటం సముచితమన్నది నా భావన. ఒకటి, రెండు దశాబ్దాల క్రితం ఈ జిల్లాలో రసభారతి, రసతరంగిణి వంటి సాంప్రదాయ సాహిత్యాన్ని పోషించే సంస్థలే ఈ ప్రాంతంలో రాజ్యమేలాయి. ఈ సంస్థలు నిర్వహించిన కార్యక్రమాలలో కేవలం పండితులకు, తలనెరిసిన పెద్ద తలకాయలకే ప్రాతినిధ్యం కల్పించబడ్డాయి గాని యువతరానికి అవకాశం కల్పించి ప్రోత్సహించటంలో వెలితిని మిగిల్చాయి, అటువంటి ఒకానొక సందర్భంలో ప్రముఖకవి అద్దేపల్లి రామమోహనరావు అధ్యక్షతన, వి. శిరీష్‌కుమార్ ప్రధానకార్యదర్శిగా ఏర్పడిన సంస్థే సాంస్కృతిక సమాఖ్య యువసాహితీ వికాస వేదికగా ఈ సంస్థ కేవలం యువత కే పెద్దపీట వేయబడి ఎందరో అట్టడుగునున్న యువరచయితలను వెన్నుతట్టి వెలుగులోకి తీసుకొచ్చింది. ఈ రోజు విస్తారంగా రాస్తున్న చలపాక ప్రకాష్, చింతాలక్ష్మి సుజాత, అరసవిల్లి కృష్ణ వంటి ఈ ప్రాంత యువసాహితీవేత్తలు ఇందులో నుండి సభ్యులుగా వుండి మెరుగులు దిద్దుకున్న వారే ఈ తర్వాత 'ఎక్స్‌రే' సంస్థ స్థాపించడబడి 'నెల నెలా వెన్నెల' అనే కార్యక్రమం ఏర్పరచడం ద్వారా ఎందరో యువకవులు, కొత్తకవులకు మెరుగులు దిద్దబడే వేదికగా నిలిచింది. నెలనెలా ఒక అంశంపై కవితలు రాయించి కవిసమ్మేళనాలు నిర్వహించటం ద్వారా యువకవుల వెన్నుతట్టి ప్రోత్సహించింది. అలాగే ఒకానొక సందర్భంగా స్థాపించబడిన ఒక సరికొత్త వేదికే బెజవాడ యువకలాలు పేరుకు తగ్గట్టే ఈ బెజవాడ యువకలాలు. కేవలం యువరచయితలచే స్థాపించబడినది, యువరచయితలను ప్రోత్సహించి వెలుగులోకి తెచ్చే లక్ష్యం పని చేసినది, దీనికి చలపాక ప్రకాష్, చింతాలక్ష్మి. సుజాత, అరసవవిల్లి కృష్ణ, వేలూరి సతీష్ కుమార్, సుధారాణి, బి.ఆంజనేయరాజు, అడ్డూరి వెంకటరమణ, మలిపెద్ది రాంబాబు, నాగలూరి రవిబాబు, యలమర్తి అనురాధ వంటి యువరచయితలు, కవులే ఈ సంస్థకు సారథ్యం వహించి తమకున్న 'ఐక్యతను చాటుకున్నారు. ఆ తర్వాత మనిషి పోలుకొండ మంగతాయారు సాహిత్య సాంస్కృతిక సేవాసంస్థ యువరచయితలకు వివిధ పోటీలను నిర్వహించటం ద్వారా ఇతోధిక సేవలు అందించాయి, జిల్లా కేంద్రం నుండి 'సాహితీమిత్రులు' కూడా యువరచయితలను తీర్చిదిద్దటంలో తన వంతు చేయూతనీ అందిస్తూ వస్తున్నది.

**యువసాహితీ వేత్తలు :**

ఇక ఈ రెండు దశాబ్దాల కాలంలో ఈ ప్రాంతం అందించిన యువ సాహితీవేత్తల వివరాలలోకెళితే, వజ్రైరాణి, కేతవరపు వెంకటరమణమూర్తి, జి.విజయలక్ష్మి, పి.ఎం.సుందరరావు, విడియాల చక్రవర్తి, సింహాద్రిపద్మ వంటి యువ కవులు చాలచక్కని సీరియస్ కవిత్వాన్నే సృష్టించి తెలుగుసాహిత్యరంగానికే గర్వకారణంగా నిలిచారు. వీరిలో కేతవరపు 'కుంచెకందని చిత్రం' కవితాసంపుటిని, జి.విజయలక్ష్మి, చీకట్లో వెలుగురేఖ, కథలసంపుటి, చిత్తరువు, కవితా సంకలనం, వెలువరించి కవితాశాఖలో తమ ప్రత్యేక ఉనికిని చాటుకోగా, పి.ఎం. సుందరరావు బాల సాహిత్యంలోను విడియాల చక్రవర్తి వ్యక్తిత్వ వికాస' సాహిత్యంలో తమపేరును సుస్థిరపర్చుకున్నారు. సింహాద్రి పద్మ జిల్లా కవితా పోటీలు సాహిత్య కార్యక్రమాలకే పరిమితమైపోయి, రాష్ట్రస్థాయికి ఎగబాక లేక పోయారు. జిల్లానుండి ఎండిఖాన్ అడపాదడపా కవిత్వాన్ని సృష్టించినప్పటికీ సీరియస్‌గానే తనరచన వ్యాసాన్ని సృష్టించి కనుమరుగు అవస్థలో వున్నారు. సాంస్కృతిక సమాఖ్య, నుండి ఉద్భవించిన తల్లా ప్రగధ రవికుమార్ చక్కని బాల సాహిత్యాన్నే రచించి అక్షరమాల కథలు, పేరిట బాల సాహిత్య సంపుటిని వెలువరిచినప్పటికీ ప్రస్తుతకాలంలో స్తబ్ధతగానే వుండి పోయారు. ఇదే వరుసలో మరికొంత మంది యువసాహితీవేత్తలు తీవ్ర స్తబ్ధతలతో మిన్నంటి కుండి పోయారు, వీరి తర్వాత పుట్టుకొచ్చిన యువ సాహితీ వేత్తలు మాత్రం ఈ ప్రాంత సాహిత్యరంగంలో గొప్ప చైతన్యాన్ని తీసుకోవటంతో పాటు, ఈ రంగానికి యువరక్తాన్ని నిపటంలో గొప్పమలుపే తిరిగినట్లయింది.

అంతకు ముందే వివిధ పత్రికలలో తరుచుగా రచనలు చేస్తున్న యువకవులకు సాంస్కృతిక సమాఖ్య ఒక వేదికగా, చక్కని బాసటగా

నిలిచింది. తల్లా ప్రగథ రవికుమార్, చలపాక ప్రకాష్, చింతాలక్ష్మీ సుజాత, బి.ఆంజనేయరాజు యలమర్తి అనూరాధ, కంతంనేని కోమలిచౌదరి, కప్పెర కామేశ్వరి ఈ తర్వాత వి. శ్రీ ఉమామహేశ్వరి, అరసవిల్లి కృష్ణ వంటి యువసాహితీవేత్తలందరూ సమైక్యమై ఈ ప్రాంతంలో యువరక్తంతో రచనా వ్యాసంగం సాగించి సంచలనం సృష్టించారు. అప్పటి వరకు పెద్దతలకాయల మధ్య కలయికే ప్రతిష్ఠాత్మకతగా ఉండే ఈ ప్రాంత సాహిత్య రంగం డా॥జి.వి. పూర్ణచంద్, తాతా రమేష్ బాబు వసుధ బసవేశ్వరరావు, ఘంటా విజయకుమార్ తదితర తరం మినహా వీరి రాకతో గొప్పమార్పు సంభవించింది. యువతకు చోటు లేని ఈ సాహిత్యరంగంలో ఇప్పుడు చాలావరకు యువ సాహితీవేత్తలతోనే ఈ ప్రాంత సాహిత్యరంగం నడుస్తుందంటే ఆశ్చర్యం కలగక మానదు.

పి.ఎం.సుందరరావు 'చెలిమి' సంస్థ స్థాపిస్తే, చలపాక ప్రకాష్ 'శ్రీలక్మోజు కనకదుర్గా చార్యులు స్మారక సాహితీ సమితిని, రమ్య భారతిని, చింతా లక్ష్మీ సుజాత 'మనీష' సంస్థ, వి.శ్రీఉమామహేశ్వరి 'పోలుకొండ మంగతాయారు' సాహిత్య సంస్కృతిక సంస్థని, సి. హెచ్. విస్. బ్రహ్మానందం' 'మానస'ను, సుక్ష 'అద్భుత'ను,వేలూరి సతీష్‌కుమార్, పాణిగ్రహి రాజశేఖర్ వేలూరి పాణిగ్రహి కల్చరల్ అసోసియేషన్' ను నండూరి రాజగోపాల్ వాగ్దేవి టాలెంట్ సెర్చ్ అసోసియేషన్‌ను ఇంక యువరచయితలు సమైక్యంగా బెజవాడ యువకులీ విధంగా విజయవాడ కేంద్రంగా నడుస్తున్న చాలా సాహిత్య సంస్థలన్నీ యువరచయితలతోనే నడుస్తుండటం విశేషంగా పేర్కోనాలి.

ఇంక వ్యక్తిగతంగా నిస్సారంగా సాహిత్యసృజన, సాహితీ వ్యవసాయం చేస్తున్న వారిలో అరసవిల్లికృష్ణ వామ పక్ష భావజాలంతో సీరియస్‌గా కవిత్వాన్నీ సృష్టిస్తూ యువతరం విమర్శకుడిగా కూడా తెలుగు సాహిత్యరంగంలో తన ప్రత్యేక'ముద్రను' వేసుకుని స్థాయికి ఎదుగుతున్నవాడు. అదే విధంగా చలపాక ప్రకాష్ తన సాహిత్యవ్యవసాయాన్నీ లేఖా సాహిత్యంతో ప్రారంభించి ఈనాడు, కవిగా, కథా, నవలారచయితగా, జోకిస్ట్ కార్టూనిస్టు గాను యువతను ప్రోత్సహించే రమ్యభారతి పత్రిక సంపాదకుడి స్థాయికి ఎదిగినవాడు, 'హైలో చక్రాలు కవితా సంపుటిని, నవ్యకవితా రూపం నానీలు, వ్యాససంపుటి ప్రచురించినవాడును, కవయిత్రులలో చింతాలక్ష్మీ, సుజాత అడపాదడపా కవిత్వాన్నీ రుస్తూన్ తన 'మనీష' సాహిత్య సంస్థతో సాహిత్యసేవను చేస్తున్నవాడును, ఈమె అమ్ములపొది అనే కవితా సంపుటిని వెలువరిచి తొలి సంపుటితోనే అవార్డును కైవసం చేసుకున్న ఈ ప్రాంతంలో ఒక ఒకేఒక కవయిత్రిగా తన పేరును సుస్థిర పరచుకున్నాడు. చింతాలక్ష్మీ సుజాత, అదేబాటలో వి.శ్రీఉమామహేశ్వరి కూడా తన కవితలతో కవితా సంపుటిని వెలువరించుకోవటంతో పాటు సాహిత్య సంస్థ నెలకొల్పటం ఈ రంగం పై ఆమెకున్న ఇష్టతను చాటుతుంది.

వేలూరి సతీష్‌కుమార్, సుధారాణి, పాణిగ్రహి రాజశేఖర్‌లు తొలుత వేలూరి పాణి గ్రహికల్చరల్ అసోసియేషన్ స్థాపించి ఎందరో యువ కవులని, రచయితలను ప్రోత్సహించి, ఆ తర్వాత కవులుగా, రచయితలుగా తాము వెలుగులోకి వచ్చినవారు. వేలూరి సతీష్‌కుమార్ కవిత్వం కంటే కథారచనలో ఎక్కువ శ్రద్ధాశక్తులు ప్రదర్శిస్తూ వివిధ పత్రికలతో తన కథలను, గళ్ళ నుడికట్టులను నిర్వహిస్తున్నారు. సుధారాణి అడపాదడపా కవిత్వాన్నీ కథలని రాస్తూనేవున్నారు. కాని రాజశేఖర్, నాగులూరి రవి బాబు, బి. ఆంజనేయరాజులు మాత్రం రాయాలనే ఆసక్తి వున్నా ఏ కారణాల చేతనో రాయటంలో వెనుకబడే వున్నారు.

అట్టూరి వెంకటరమణ కవితలు రాసాడు. కార్టూనులు, బొమ్మలు వేస్తున్నాడు. కాని వీటన్నికంటే నానీ ల కవిగా జిల్లాలో తొలివాడిగా తన పేరును సుస్థిర పరుచుకున్నవాడు అద్దూరి. మలిపెద్దిరాంబాబు ఎక్కువ రచనలు చేస్తేగాని అవి విలువగలవి గా పేర్కొన లేక తేలిపోయాయి. అందుకు కారణం, అతను నివాసం వుంటున్నది చీరాలలో అయితే వృత్తిరీత్యా విజయవాడకు ప్రతిరోజు వస్తూపోతూ అతనికున్న సమయం రైలు జీవితంలో నడిచిపోవటంతో అంతగా రచనల విషయంలో శ్రద్ధ చూపించలేక పోయాడు.

## స్పందన

**వసుమతి చలసాని విజయవాడ.**

రాజ వీధులలో వైఢూర్యాల బాటలో జిలుగు పవనాల వసంతంలో జీవించి జీవం పోసుకోవాలని ఉంది !

కానీ, మహోన్నత మానవజన్మ పాషాణ నిశీధుల నైరాశ్యంలో రాగపీడిత మరణ మృదంగాల సమీపంలో విలపిస్తుంటే ఎలా? ఎలా?

ఎదలో చెలరేగే ఇప్పటి వైవిధ్యతీరులు గమనిస్తుంటే పైపైకి పోయే విహంగాల తీరున అలసి వేసారి నిరాశతో కౌన్సిలింగ్‌లను కౌగలించుకునే తీరు గమనిస్తూ ఎలా? ఎలా?

కలినై అమిరతానందాన్ని పొందే క్షణాన కుటిల స్వార్ధ పూరిత, ఏ లికల ధన వ్యామోహాన్ని తెరల మాటున చెరరేగి శ్రమజీవి కన్నీటికి స్పందించని పాషాణుల నీడలను చూస్తూ ఎలా? ఎలా?

సౌందర్యలహరుల ఆహ్లాదంతో నవ్య నవనీత భావాలను పొందు పరచి అలరింపచేయాలని స్పందిస్తుంటె విదేశీ వ్యామోహం పరుగుల సరుగున మాతృదేశ మమతను మసి చేసుకునే చిన్నారుల చదువుల తీరును చూస్తూ ఎలా? ఎలా?

కనులకున్న సౌందర్యనీడలు శ్రవగానశ్రావ్యతను పలుకులలో మధురిమను ఊయల పట్టుపరుపు అడుగున దాచుకుని దాగి దాగి పసిపాప లా చిరునవ్వుల దోసిలిలో నెత్తావినైతి

చైతన్యమే చైతన్యమయి అలరిస్తుందేమో!

ఇక యలమర్తి అనురాధ సాహిత్యరంగంలోని చాలా ప్రక్రియలలో ప్రవేశం కలిగి వున్న రచయిత్రి గా పేరుగాంచిన వాడు, వివిధ పెద్ద పత్రికలలో సైతం తన రచనలు అందిస్తూ నిరంతరం ముందుకు దూసుకుపోతున్నాడు అనురాధ. అయితే ఏ సంస్థలతో సంబంధం లేకుండా వ్యక్తిగతంగా ఎదిగిన వారు చిత్తలూరి సత్యనారాయణ, రావెళ్ల శ్రీనివాస్‌లు. వీరిద్దరు కవులే కాదు, కార్టూనిస్టులు కూడా వీరిలో చిత్తలూరి కవితారంగంలో మంచి స్థాయిలో తన సృజనని వ్యక్తీకరించిన మంచి కవిగా గుర్తింపు పొందుతున్నవాడు. రావెళ్ల కవిత్వం కంటే కార్టూనిస్ట్‌గా ఎదుగుతున్నవాడు. సి.హెచ్.వి. ఎస్. బ్రహ్మానందరావు కవితలురాస్తున్నాడు అని,మనీష సంస్థద్వారా యువకవులు ను ప్రోత్సహిస్తున్నవాడిగా మంచి గుర్తింపు పొందగలిగాడు. నల్లగట్ల నందిని కవితల పోటీలకి పరిమితమయ్యింది, ఈ మధ్యకాలంలో తరుచు గా పత్రికలలో కవితలు, వ్యాసాలు రాస్తున్న కవయిత్రులలో టి. అమూల్య పరిణతి సాధిస్తున్నది, సత్రీ అడపాదడపా కవితలు రాస్తూనే పత్రికలు నిర్వహిస్తున్నవారిలో చెప్పుకోదగ్గవారు. పాలెపు బాబు, నండూరి రాజగోపాల్‌లు. వీరిలో నండూరి రాజగోపాల్ ఇటీవల కాలంలో సాహిత్యరంగ వికాసానికి చినుకుద్వారా విస్తారమైన సేవచేస్తున్న వాడిగా పేరు సంపాదిస్తున్నవాడు ఆదర్శప్రాయుడు.

ఈ విధంగా ఈ జిల్లాలో అడపాదడపా సాహిత్య సేవ చేస్తున్నవారిలో కంచి శేషగిరిరావు, పి.బాలకోటయ్య (కంచికచర్ల), దివిఖ్యూస్(అవనిగడ్డ) ఎమ్. హనుమాన్‌రాజు (సత్యాలపాడు), లంకా జనార్ధన్ (ఇబ్రహింపట్నం) కె. పద్మప్రియ, పద్మకళ, హరిమాణిక్యం వేణుగోపాల్, మహర్షి, కలిమిశ్రీ, మునగాపాపారావు, పెద్దికృష్ణ, తన్నీరు సాంబశివరావు, జింకా చక్రధర, పి. మోహనరంగ ప్రసాద్, మోగంటి నాగవెంకట సత్యనారాయణ, డి.వి.కె. సత్యప్రసాద్(వేకనూరు) వేమూరి పద్మజ, సి.హెచ్‌మానస, సి.ఎన్.ఛటర్జీ, కె.గౌరీశంకర్, ఆర్.మానస(కె.జుపూడి),రామలక్ష్మి, ఓరుగంటి బాలాజీకుమార్, రాజేంద్రప్రసాద్, డి. జగదీష్ ఇలా ఎందరో యువకవులు, రచయితలు అప్పుడప్పుడుకవిత్వాన్నీ రాస్తున్నారు. మరెందరో మరుగున వుండిపోయారు. ఇలాంటి వారిని వెలుగులోకి తెచ్చి వీరిలో సాహిత్య ప్రజ్ఞకు మెరుగులుపెట్టి తెలుగుసాహిత్యరంగానికి ఈ ప్రాంత సంపదగా అందించవల్సిన అవసైరం ఎంతైనా వుంది. ఇరవై ఏళ్ళక్రితం ఎంతోచక్కని సాహిత్య సేవచేసిన కృష్ణాజిల్లా రచయితల సంఘం మోడుబారి చతికిలబడి, మళ్ళీ ఈనాడు కొత్త ఊపిరులందుకొని చిగురించి కాపుకాస్తున్న ఈ తరుణంలో, యువ సాహితివేత్తలను వెలుగులోకి తెచ్చేందుకు ప్రత్యేక శ్రద్ధ దృష్టిసారించవల్సిన అవసరం, తనపాత్రను చక్కగా నిర్వర్తించవల్సిన అవసరంమరెంతైనా వుంది. తెలంగాణ ఉత్తరాంధ్ర, రాయల సీమల్లో జరుగుతున్నంత విస్తారంగా సాహిత్య కార్యక్రమాలు (ప్రకాశంజిల్లా మినహా) ఈ ప్రాంతంలో జరగటం లేదన్న అపవాదును తొలగించేందుకు ఈ ప్రాంత సాహిత్య సంస్థలు సమిష్టిగా నడుం బిగించవల్సిన అవసరాన్ని వక్కాణించి చేపడుతోంది. (వ్యాసం సంపూర్ణ పరిచయంగా భావించనక్కర్లేదు. ఇందులో కొందరి పేర్లు పొరపాటున మరిచి పోయివుండవచ్చని గ్రహించమని మనవి.)

## "నా తెలంగాణా! కోటిరతనాల వీణా!"

కె. వి.యల్.యన్.శర్మ, విజయవాడ

ఓ కవితా!................ పయోనిధీ!
ఓ మహాకవి!............ దాశరధీ!
కొనగోటితో పలికించిన
వేయిరాగాల రతనాల వీణా!
కోటి గీతికల కవీంద్రుని
కోల్పోయె వీర తెలంగాణా!.... "ఓ కవితా"

తెలుగింటి సొగసుల
సాహిత్యపు వీధులలో!
తొలు దొల్తనే తెనుగించె
ముషాయిరల రుబాయిలు!.......... "ఓ కవితా"

నిజాము నిరంకుశ
రాజరికపు పాలనలో!
ఎదిరించె రైతాంగ
పోరాటపు అతిరధి!.... "ఓ కవితా"

రజాకార్ల అరాచకపు
ధనమాన దో పిడీలలో!
కురిపించెను "అగ్నిధార"
కవితాగ్నిని మహారథీ!....... "ఓ కవితా"

జాగీరు భూస్వాముల
బానిసత్వపు వూడిగంలో!
మది జ్వలించి ఎగురవేసే
తిరుగుబాటు బావుటా!.... "ఓ కవితా"

తిమిరంలో వెలుగుకై
సమరాన్నే సాగించి!
ఎలుగెత్తి పాడిందాక
సామ్యవాద కవితా హృదయం!... "ఓ కవితా"

పీడిత తాడిత ప్రజా నిద్రాణతను
తన "రుద్రవీణ" తంత్రులచే!
నిద్రలేపి ఉద్దీపనం చేసే
తెలంగాణా రధసారధి దాశరధీ!... "ఓ కవితా"

# ఈ కాలపు తెలుగు

శ్రీమతి రావిపాటి ఇందిరామోహన్ దాస్, గుంటూరు

భాష మానవ సమూహాల మదిని, భిన్నధ్వనుల ద్వారా భావవ్యక్తీ కరణ ప్రక్రియ! మానవుడు తన హావ-భావాలు-ఆవేశంలో ఆనందంలో వేదనలో రోదనలో-వ్యక్తీకరించేది తన మాతృభాషను తల్లిద్వారా తొలిగా నేర్పించబడిన భాషే మాతృభాష అవుతుంది. మనందరి మాతృభాష తెలుగు.

శ్రీశైలం, కాళేశ్వరం, ద్రాక్షారామం-క్షేత్రాల మధ్యనున్న దేశం గనుక-త్రిలింగ దేశమని అచ్చటి వారు మాట్లాడే భాష త్రిలింగభాష అని - కాలక్రమేణా - తెలుగుగా మారిందని - ఒకవాదం- తేనెలాగ మధురమైన భాష కాబట్టి తెనుగు అయిందని మరికొందరి - అభిప్రాయం జాతిపరంగా-ఆంధ్రము అని కూడ అంటారు.

తెలుగ భాష ప్రపంచ భాషల్లోకెల్లాప్రసిద్ధి చెందింది. మనమాతృభాష తెలుగు మనందరి కే గర్వకారణం. ఎన్నో రాష్ట్రాలు దేశాలు తెలుగు భాషను గుర్తించి గౌరవముతో తమ కిష్టమైన పేర్లతో పిలుస్తున్నారు. ఆవిధంగా తెలుగు భాషకు ఎన్నోపేర్లు! మనదేశం లో అధిక జనులు మాట్లాడే రెండో భాషగా కూడ ప్రాచుర్యం పొందింది.

క్రీ॥శ॥ ఒకటవ శతాబ్ధము నుండి జనవ్యవహారంలో మౌఖికరూపంతో ఉండి.. అనేక మార్పులు, చేర్పులు కు లోనవుతూ నన్నయ్య కాలం పదకొండవ శతాబ్దం నాటికి కావ్యరూపాన్ని సంతరించుకుంది ఈ ఘనత రాజరాజ నరేంద్రునికే దక్కుతుంది ప్రపంచ వాఙ్మయములో ఒక విశిష్ట స్థానము పంచమ వేదంగా ప్రసిద్ధి గాంచిన నేటి మన మహాభారతము-అప్పటికే సంస్కృత భాషలో ఉంది వేదవ్యాస విరచితమైన ఆ మహా భారతాన్ని - తెలుగు భాషలోకి అనువదించమని -రాజరాజ నరేంద్రుడు కోరగా -నన్నయ్యకు ఉపక్రమించక తప్పలేదు అప్పటి తెలుగు భాషకు ఒక తీరు తెన్నూ లేదు దేశీ పోకడలతో ఉన్న దానిని నన్నయ్య పలుభాషా కోవిదుడైన నారాయణభట్టు సాయంతో - ఎన్నో వ్యయప్రయాసల కోర్చి సంస్కరించగలిగాడు భాషకైన మూలభాష సంస్కృతి భాషనే అనవసర మనిపించిన కొన్ని పదాల్ని తొలగించి, అందమైన వేలకొలది పదాల్ని సంస్కృతము నుండి స్వీకరించి, ఆ భాషావ్యాకరణ సూత్రాల ఒక చక్కని ధ్వని పూర్వకమైన నిర్దుష్ట రూపాన్ని-తెలుగుభాషకు ఏర్పరచాడు.

ఆ తర్వాత కాలంలో నన్నయ్య బాటలో నే ప్రయాణించి- శ్రీనాధుడు మొదలగు వారు మరికొన్ని కావ్యాలు రచించారు ఏ భాషకైనను రాజాదరణ ప్రజాభిమానం -పుష్కలంగా లభించినప్పుడే... ఆ భాష అభివృద్ధి చెంది దశదిశలా - విఖ్యాతినార్జిస్తుంది శ్రీ కృష్ణ దేవరాయల కాలం అటువంటిదే! ఆయన కాలంలో అభివృద్ధి పరంగా తెలుగుభాష ఉత్తుంగ తరంగం వలె ఎగసింది ఆ కాలం స్వర్ణయుగమని కూడా పేరు గాంచింది. దీని కంతటికి ఆ ప్రభువు యొక్క ఆదరాభిమానాలే ముఖ్య కారణం.

ఆ తర్వాత కాలం (క్రీ॥శ॥18,19శ॥) లో తెలుగు భాషకు రాజాదరణ ప్రజాభిమానం కొరవడినాయి. క్షీణత ప్రారంభమైంది కుతుబ్‌షాహి పాలనలో అనేక పార్సీ అరబ్-పదాలూ, ఆంగ్లేయుల పాలనలో ఆంగ్ల పదాలు నిజాంరాజుల పాలనలో ఉర్దూపదాలు. తెలుగున చేరటంతో తెలుగు తెలుగుతనం కోల్పోయింది.

అంతర్జాతీయ సంస్థ ఐక్యరాజ సమితి గత ఏడాది విడుదలచేసిన వార్షిక నివేదికలో అంతరించి పోతున్న ప్రపంచభాషల జాబితా ప్రకటించింది. అందు తెలుగు భాషది ఎనిమిదవ స్థానం! అని ప్రమాదఘంటికలు మ్రోగించింది. తగు జాగ్రత్తలు తీసుకోనట్లయితే. త్వరలోనే తెలుగుభాష అంతరించి పోగలదని - హెచ్చరించింది.

మాతృభాష తృణీకారం - మాతృదేవి తిరస్కారం గాంధీజీ మాటలు మరువరానివి ఆ మరుపే తెలుగుజాతికి పట్టిన గ్రహణం ఆంధ్రులపతనం.

తెలుగుభాష సాహితీ సంగీత ప్రక్రియా రత్నరాసులగని, ఆంధ్రుల శ్వాస, ఉనికి జవ-జీవాలు-తెలుగునందే నిక్షిప్తం! ఆంధ్రుల జీవన సాఫల్యతకు తెలుగుభాషే మూలకేంద్రం అటువంటి మాహత్తరమైన తెలుగుభాషను కోల్పోతున్నామంటే ఆంధ్రుల ఉనికికి అర్థం లేదు. భాషనశిస్తే జాతి నశించి పోతుంది. నేటి తెలుగు భాష దుస్థితికి ముఖ్యంగా రెండు కారణాలు - ప్రజలూ, ప్రభుత్వం ఇరువురూకారకులే.

ప్రజలు వట్టించుకోవాల్సిన అంశాలు-సమాజంలో ఎంతోమార్పు, పూర్వపు పరిస్థితులకు నేటి పరిస్థితులకూ గల వ్యత్యాసం బిందు సింధువుల తేడా, వేషభాషలు ఆచార్య వ్యవహారాలు, సాంప్రదాయాలు - అన్నింటా మార్పు ముఖ్యంగా పాశ్చాత్యుల ప్రభావం ప్రమాణాలు పెంచుకునే ప్రయత్నంలో పరుగులు ఆ కారణంగా మాతృభాష పట్ల ఆదరణ తరగి ఇతరభాషల పట్ల వ్యామోహం మోజు పెరిగింది. అమ్మా నాన్నల పిలుపులు పోయాయి, మమ్మీ డాడీల విష సంస్కృతి వచ్చింది. తెలుగువారి పరభాషా మోజు తెలుగు భాషపై బూజుగా మారింది. క్షీణతకు మరోకారణం కంప్యూటర్ తెచ్చిన విప్లవం!

కంప్యూటర్ రంగ ప్రవేశంతో వ్యక్తులు, దేశాల మధ్య దూరాలుతరిగినవి. దేశ విదేశాలలో ఉద్యోగ అవకాశాలు పెరిగినవి. కంప్యూటర్ కోర్సులన్నీ ఆంగ్లంలోనే ఉండటంతో ఆంగ్లభాష ఆధిక్యత పెరిగింది పరభాషా వ్యామోహంలో పడిన తెలుగు వారు తమపిల్లల్ని ఆంగ్లమాధ్యమంలోనే చదివిస్తున్నారు. తామూ ఆంగ్లేయుల్ని అనుకరిస్తూ ఆంగ్లంలోనే మాట్లాడుతున్నారు. సిగ్గుపడటం పోయి ఏదోఘనకార్యం సాధించిన వారిలా విర్రవీగుతున్నారు.

ఇద్దరు తమిళిలు కల్సినా తమ మాతృభాష అయిన తమిళంలోనే మాట్లాడుతారు. వేరే భాష వచ్చినా మాట్లాడరు వారికి తమ భాష పట్ల గల గౌరవం, అభిమానం-అలాంటిది. తెలుగువారికి ఆ రెండూ మృగ్యం! తెలుగుభాష గొప్పతనాన్ని గుర్తించ లేని మూర్ఖత్వం వారిది.

మాతృభాషలో మాట్లాడటం వలన ఎన్నో ప్రయోజనాలు ఉన్నాయి. ఏ విషయాన్నైనా చక్కగా సరళంగా అర్ధం చేసుకుని అనర్గళంగా మాట్లాడగల్గుతారు. ఎంత నేర్చినా పరభాష పరాయి భాషే! మాతృభాష లో మాట్లాడటం వలన ఒక విధమైన దగ్గరితనం, ఆప్యాయత కలుగుతాయి. మంచి స్నేహానికి పునాదులుపడ్తాయి.

మాతృభాష పట్ల తెలుగు వారి ధోరణి విచిత్రంగా ఉంది తెలుగు మాధ్యమంలో చదివితే ఏముందీ నా బొంద నాలుగు అడుగులు వేసి రాష్ట్రం కూడా దాటలేము ఆంగ్ల మాధ్యమంలో చదివితే మంచి ఉద్యోగం దొరుకుతుంది ప్రపంచమంతా చుట్టిరావచ్చు వీరి ధోరణి లో మార్పురావాలంటే కంప్యూటర్ కోర్సులన్నీ తెలుగులో వచ్చి, తెలుగుమాధ్యమంలో చదివిన వారికి మంచి ఉద్యోగ అవకాశాలు లభిస్తే తెలుగువారి ఆలోచనా దోరణిలో మార్పు తప్పక వస్తుంది. తెలుగువారి భాష పట్ల ఉన్న నిర్లక్ష్య వైఖరిపోయి మాతృదేవిని ఎలా గౌరవిస్తామో అలానే మాతృభాషను గౌరవించగలుగుతారు తెలుగుభాషా వికాసానికి ఇతోధిక సేవచేయగల్గుతారు. ప్రభుత్వం పట్టించు కోవాల్సిన అంశాలు చాలానే ఉన్నాయి. పాలనా యంత్రాంగంపై భాషాభివృద్ధికి సంబంధించిన గురుతర భాధ్యత ఉంది. పరిపాలనా రంగంలో పూర్తిగా తెలుగును అధికార భాషగా తీసుకు రావటానికి సమర్ధవంతమైన చట్టాల్ని రూపొందించాలి. తెలుగు సాహిత్య మంత్రిత్వశాఖ కూడా ఏర్పాటు చేయాలి. రచయితలను, మేధావులను ఆకర్షణీయ మైన పథకాల్లో కూడగట్టుకుని మంచి సాహిత్యం సృష్టించేలా చేయాలి. పుస్తకాలు చదివే అలవాటు పోయిన తెలుగు వారిలో ఆ శక్తి పెంచే కార్యక్రమాలు చేపట్టాలి. విదేశీ లైబ్రరీలలో కూడా మన గ్రంధాలు ఉండేలా తగిన శ్రద్ధ తీసుకోవాలి. ఇతర భాషల్లోని గ్రంధాల్ని కూడ మన తెలుగుభాష లో అనువదితం చేసుకునే ప్రయత్నంగ భాషకు పుష్టిని చేకూర్చగలగాలి.

టి.వి ప్రభావం ప్రజలపై చాలానే ఉంది అన్నం తినటం మాని వేస్తారే గాని. టి.వి కార్యక్రమాలు చూడకుండా ఉండలేరు. తెలుగు టి.వి కార్యక్రమాల్లో సగం ఆంగ్లపదాలు ఉంటున్నాయి. అలా జరగకుండ చక్కటి తెలుగు కార్యక్రమాలు ప్రసారం చేసేటట్లుగా ప్రభుత్వం తగిన జాగ్రత్తలు తీసుకోవాలి. అలా చేస్తే భాషాభివృద్ధి తథ్యము!

ప్రభుత్వం భాషాభివృద్ధికి చేపట్టిన సేవలు చాలానే ఉన్నాయి. తెలుగును అధికార భాషగ పరిగణిస్తూ 1966 సం॥ లో ఉత్తర్వులు జారీ చేసింది. శాస్త్రగ్రంధాలు, పాఠ్యపుస్తకాలు, పారిభాషిక పదాలను రూపొందించేందుకు తెలుగు అకాడమీని నెలకొల్పింది. అధికార భాషా సంఘాన్ని కూడ నియమించింది ఈ పనులన్నీ చేసింది నిజమే! చేసింది ఏదీకూడ కంటి తుడుపు కారాదు. దాని వెనుక చిత్తశుద్ధి ఉండాలి ఇప్పటివరకు తెలుగు పూర్తిగ అధికార భాషగ లేదంటే చిత్తశుద్ధి లోపించటమే నన్నది విస్పష్టం!

నేటి దుస్థితి నుండి ప్రభుత్వం పోరాడి తెలుగు భాషను కాపాడాలి భాషనిర్వీర్యమైతే జాతినశించి పోతుంది. ఈ గుర్తింపు ప్రజల్లో తీసుకురావాలి. తెలుగుభాష పునర్జీవనము పొందేటందుకు ప్రభుత్వము చేయాల్సింది ఎంతోఉంది.

ప్రజలు పట్టించుకోవాల్సిన అంశాలు-మాతృభాష పట్ల నిర్లక్ష్య వైఖరిని ప్రతి ఒక్కరూ తమ మనస్సుల నుండి దూరంగా తరిమేయాలి. పరభాషావ్యా మోహం నుండి బయటపడాలి తెలుగుజాతి సాఫల్యతకు కారణమైన తెలుగుభాష మహోన్నతమైన భాష అన్న వాస్తవం గుర్తించాలి ప్రతి ఒక్కరూతన వంతుగ భాషాభివృద్ధికి కృషిచేయాలి మొదటిగా గ్రామాలలో తిరిగి పల్లె ప్రజలు వాడుకునే భాషలోనే సజీవత ఉంటుంది.

మనకు తెలీని అర్ధవంతమైన పదాల్నిఏరి తెలుగు భాషకు హారంగా కూర్చాలి. ఈ విధంగా చేస్తే తెలుగు భాష పుష్టి తుష్టుల్తో వెనుకటి వైభవాన్ని తలదన్నేట్లు వినూత్న వైభవంతో దీప్తివంతమవు తుంది ఇది ఎవరూ కాదనలేని నిజం!

## మానవుడా !

-భమిడిపాటి కృష్ణమూర్తి

గుళ్లో జేగంటలు మోగుతున్నాయి
దేవుడు మాత్రం నిద్రపోతున్నాడు -లేపకు
కార్ఖానాలో, గనిలో కండలు కరుగుతున్నాయి
నరుడు చెమట నిప్పులు చెరుగుతున్నాడు -ఆర్పకు
కత్తికి కలానికి ఏది గొప్ప అన్న వైరం
కలం గెలిచింది - గళం విప్పింది - మత్తుతో నింపకు
ఎలుగెత్తి తనకలం సింహనాదం చేసింది
జగత్తు మేలుకుంటోంది - కాంతా సమ్మితం చెయ్యకు
మత విషం నిండిన చషకం
విలాసంగా పట్టుకుంటే పట్టుకున్నాం - పెదవి ఆనకు
నిన్నటి అనుభవం నేటికి పాఠం
నేటి ఈ పాఠం రేపటి పునాది - సమాధి చెయ్యకు
అప్పులు, వాయిదాలు ఏలుతున్నాయి జనాన్ని
చావు మాత్రం వాయిదా వెయ్యదు, అరువివ్వదు - ఆశపడకు
విత్తానికి చిత్తం దాసోహం అంటోంది
వెన్నముక విరుగుతుంది - చిత్తం అనకు
స్వార్థం కరిమింగిన వెలగపండు మేథస్సు
దానికి గుండె చప్పుడు వినిపించదు - శోకించకు
గతానికి గంతలు విప్పకు, గీర్వాణం గోరోజనం
వర్తమానం సగం అయోమయం - వత్తాసు పలక్కు
కర్షకుడు, కార్మికుడు గూడేస్తుంటే
దేశం బంగారం పండుతుంది - లాటరీ వెయ్యకు.
అసలు నరుడే వానరుడి వారసుడు
వారసత్వపు హక్కులు వెర్రి తలలు వేస్తున్నాయి - వెంటపడకు
ఎదిరించి నిలబడితేనే లోకం లొంగుతుంది
బెదిరిపోయావో మొట్టుతుంది - జాగ్రత్తపడు.

40a

# జాతీయ తెలుగు రచయితల మహాసభలకు విచ్చేయుచున్న కవులు, రచయితలు, ప్రతినిధులకు, సాహిత్యాభిమానులకు - అందరికీ మా శుభాకాంక్షలు




*To acknowledge the duty*
*That accompanies every right*

# Y'S MEN INTERNATIONAL

## CENTRAL INDIA REGION
## DISTRICT- I

## Y'S MEN'S CLUB OF VIJAYAWADA TOWN

(Charted 1980)

**Ysm. Dr. G.Regina**
President
Ph.: 0866 - 2470522

**Ysm. Dr. D. Kodandaramacharyulu**
Secretary
Ph.: 0866 - 2822359

**Ysm. S. Ramakoteswara Rao**
Vice- President

**Ysm. Dr. V. Ramakrishnamacharyulu**
Treasurer

Directors

**Ysm D.V.L.N. Das**
**Ysm R.D. Shah** (ASD)
**Ysm. D. Sankara Rao**
**Ysm. K. Virabhadra Sastri** (RSD)
**Ysm. M. Devanandam**
**Ysm. K. Jayasree**
**Ysm. M.V. Vijayanand**

Members

**Ysm. A. Rangacharyulu**
**Ysm. Nirmala Prabhakar**
**Ysm. K. Vandana**
**Ysm. K. Padmavathy**
**Ysm. M. Durga**

Y's Mennett

**Ymt. Ch. Vijaya Lakshmi**
**Ymt. D. Tulasi**

406

# కొ. కు. బకాసురుడు ఇంకా సజీవుడే

రవికుమార్, విజయవాడ

"ఈ చంపినవాడు మనిషి కాదని ప్రచారంచేస్తే"

"ఆ ప్రచారం ప్రజలే చేస్తున్నారు-వాడి మీద గౌరవం కొద్దీ"

"వాణ్ణిరాజునీ చేసేస్తారు ! నిశ్చయం "అజ్ఞాని చెప్పినట్టు మనం ఈ కుర్రాణ్ణి విందుకు పిలిచి విషం పెట్టి చంపేస్తే?...

"సాధ్యమా"?

"ఈ నగరంలో రోజుకొక్కణ్ణి చంపేసి అది వీడి పనే అంటే సరి!"

"దివ్యంగా ఉంది ఆలోచన...."

పై సంభాషణలో వీడు అంటే భీముడు. వాడు అంటే బకాసురుడు. సంభాషించినవారు ఏకచక్రపురపు రాజు, మంత్రి, నన్నయ భారతం ప్రకారం ఏకచక్రపురం రాజు దుర్బలుడు. ఈ విషయం కూడా బకాసురుని కాహారంగా వెళ్లవలసిన కుటుంబపెద్ద-పాండవులకు ఆశ్రయం కల్పించిన బ్రాహ్మడు-ద్వారా చెప్పించిన మాటలో వ్యక్తమవుతుంది. అంతకుమించి రాజు అనే వాడి ప్రస్తావనే లేదు. ఏకచక్రపురవాసులకు బకాసురునివల్ల ఎంతో విపత్తు సంభవిస్తే, రాజన్నవాడు ఏం చేస్తున్నాడనేది సహజంగా కలిగే మొదటి ప్రశ్న కనుక, రాజుని దుర్బలుణ్ని చేసి బకునితో ఊరి జనమంతా ఒడంబడిక చేసుకుని దాని ప్రకారం రోజుకొకరిని ఆహారంగా పంపుతూండినట్లు భారతంలో వుంది. బకాసురుడిలాంటి మానవ మాంసభక్షకులైన వారి బారి నుండి, అజ్ఞాతంలో వుంటూ కూడా కాపాడిన పాండవుల ప్రజోపయోగ సత్కార్యాలను తెలియపర్చటం మూలగాథ యొక్క ఉద్దేశ్యం. దీనికనుగుణంగానే హరికథలు, నాటకాలూ, సినిమాలూ... తద్వారా మహాభారత శ్రోతలూ, ప్రేక్షకులూ అంతా బకాసుర సంహారం బాగా ఎరిగిన గాథగా నిలిచి వుంది.

పై గాథలోని ప్రధానమై రెండవ పార్శ్వాన్ని కొడవటిగంటి కుటుంబరావు (కొ.కు) 'బకాసుర' కథ ద్వారా చెప్పారు. రాజ్యం నిజంగా దుర్బలంగా అసమర్థంగా వుంటే బలవంతులు, సమర్థుల దాన్ని కైవసం చేసుకోకుండా విడిచిపెట్టటం వుంటుందా? అయినా రాజ్యం ఇరుగుపొరుగు రాజ్యాల కంటె, శత్రువులకంటె దుర్బలం కావచ్చునేమోగాని, ప్రజలపట్ల కూడా అలాగే వుండదు. నిజానికి సామాజికంగా సంక్షోభం పెరిగిపోతున్నప్పుడు రాజ్యం మరింత నిరంకుశంగా క్రౌర్యంగా మారుతుంది. ఈ విషయాన్ని మన దేశాన్ని చూచి గ్రహించటానికి మానసికంగా సిద్ధంగా లేనివారు మన పొరుగునవున్న సహూదర రాజ్యం పాకిస్తాను నుండి తెలుసుకోవచ్చు.

కొ.కు 'బాకాసుర' కథ ద్వారా చెప్పదలుచుకున్నదీ రాజ్యస్వభావం గురించే. వ్యాసం మొదట పేర్కొన్న సంభాషణ ద్వారా రాజ్యానికొచ్చిన మరొక (భీమ) విపత్తును ఎలా ఎదుర్కోవాలన్నదే రాజూ-మంత్రి సాగించిన చర్చ.

బకాసురుడి నుండి తమను కాపాడిన భీముణ్ని ప్రజలు సహజంగానే నెత్తిన పెట్టుకుని ఊరేగిస్తున్నారు. ఒక వ్యక్తి చేయగలిగిన మేలుని కూడా రాజ్యం చేయకుండా మిన్నకుంది. ప్రజలందరూ భీముని చుట్టూ మూగి, తమ కోటను చుట్టుముడితే ప్రస్తుత రాజు-మంత్రి పదవీచ్యుతులవటం ఖాయం కనుక బకాసురినికంటె భీముడే వారి దృష్టిలో ప్రమాదకారి. బకుడ్ని చంపకుండా వున్నవారే భీముణ్ని చంపెయ్యాలనుకున్నారు. అయితే భీమునికున్న ప్రజాభిమానాన్ని నిర్మూలించకుండా భీముణ్ణి నిర్మూలిస్తే అది తమకు మరో ప్రమాదాన్ని తెచ్చిపెట్టవచ్చు. కనుక బకుడ్ని చంపిన భీముడు బకుని కంటె పెద్ద రాక్షసుడు అని ప్రచారం చెయ్యాలి. కేవలం ప్రచారాన్ని ప్రజలు నమ్మరు. కనుక తామే అంటే - రాజ్యమే - రోజు ఒకడ్ని చంపేస్తూ వాణ్ని తిన్నది భీముడేని ప్రచారం చేస్తే భీముని ప్రతిష్టంతా దిగజారిపోతుంది. తర్వాత చంపేసినా అతని వ్యక్తిగత శత్రువులెవరో చంపేశారని ప్రజల్ని నమ్మించటం చాలా తేలికవుతుంది. ఇదీ రాజ్యాధినేత లిరువురి వ్యూహం - ఎత్తుగడ.

నన్నయ్య భారతంలో బకుడ్ని చంపింది భీముడేనన్న విషయం వారికి ఆశ్రయం కల్పించిన బ్రాహ్మడికి తప్ప తెలయదు. కానీ కొ.కు 'బకాసుర' కథలో అందరకూ తెలిసిపోతుంది. ఈ వార్త దుర్యోధనుని దాకా చేరితే ప్రాణాలకు ముప్పు అని గ్రహించిన కుంతిని బిడ్డలతో సహా ఏకచక్రపురాన్ని వీడి వెళ్ళిపోయేట్టు చేశారు. కొ.కు.

ఎంతటి బలపరాక్రమాలు గలవాడైనా, ఒక్క మనిషి (భీముడు) చేయగలిగిన బకాసుర సంహారాన్ని ఆయుధ బలగాలున్న ఒక రాజ్యమే చేయలేకపోతుందా? ఇది కొ.కు. వేసుకున్న ప్రశ్న. చేయగలదు అన్నదే ఆయన మనకిచ్చిన జవాబు. అయితే బకాసురుడ్ని చంపేసి వాని ప్రమాదం నుండి ప్రజల్ని కాపాడి వుండవచ్చు గదా?

ప్రజలకు విపత్తు సంభవించినపుడు వారిని రక్షించే కృషి సల్పటం రాజ్యం యొక్క బాధ్యత అనీ, అలాగే చేస్తుందనీ సాధారణంగా అనుకుంటారు. కానీ ఏకచక్రపురపు మంత్రి, రాజుతో యిలా అన్నాడు "ఇప్పుడు పరిస్థితులు మనకు క్షేమకరం. ఈ రాక్షసుడు వచ్చాక మన పొరుగురాజులిద్దరూ మన మీద యుద్ధ ప్రయత్నాలు మానుకున్నారు. వాడు మన నగరానికి పెట్టనికోట"

అయితే "ప్రజల ఆందోళనమాటేమిటి?" -రాజు. "వాళ్లను ఆందోళన పడనివ్వండి, నిరుడు మహమ్మారీ వచ్చినప్పుడాందోళన పడలేదా? అయిదేళ్ల క్రితం కాటకం వచ్చి ఎందరు చచ్చారు కారు ? జననష్టం గురించి మనం బెంగపడనవసరంలేదు" - ఇదీ మంత్రి జవాబు.

బకాసురుడు నగర ద్వారం వెలుపలే వుండే విధంగా ఏర్పాటు చేయాలని రాజు ఆదేశం.

ఐదుగురు నగర ప్రముఖులతో మంత్రి సమావేశమై బలాధికుడైన రాక్షసులుంగారి స్నేహంతోబాటు, లాభదాయకమైన మార్గాలు కూడా చూపిస్తాడు. రోజుకొక మనిషిని, కుటుంబాల వారీగా పంపటం ఇతర వంట సరుకులలో వ్యాపారస్తులకు లాభాలు, వాటి వసూళ్లలో పై అధికారులకు వాటాలు మాత్రమే కాక ధనికులు తమ కుటుంబసభ్యులకు బదులుగా బానిసలనూ, డబ్బుకు అమ్మకమైన వారినీ బకునికి ఆహారంగా సమర్పించే విధంగా ఏర్పాటు చేశాడు. ఇవీ చౌకగా రాజ్యసంరక్షణకు మంత్రి కల్పించిన ప్రత్యామ్నాయాలు. అందుకు మంత్రి సమర్థింపు ఇలా వుంది. 'ఏకచక్రపురానికి బకుడు పెట్టనికోట. వాడు మూడు అక్షౌహిణుల సైన్యానికి తుల్యుడు. వాడే చతురంగ బలాలూను. అందుకు వాడు రాజుగారికి దివ్యమైన అంగరక్ష. వాడు పోవటానికి వీల్లేదు. వాడి ఖర్చు ఏడాదిలో మూడువందల అరవై మంది ప్రాణులు! కారుచౌక! యుద్ధాలలో దానికి అయిదింతలు చస్తారు. క్షామాలు అంతకన్నా ఎక్కువే బలి తీసుకుంటున్నాయి. క్షామం వెనకా, మహమ్మారి వెనకా శత్రువులు వచ్చిపడి మరింత నష్టాలు చేసిపోతారు. వీడు అలా కాదు. వీడు పీడే అనుకున్నా ఇతర పీడలకు గొప్ప ప్రతిబంధకం. అదృష్టదేవత ఈ రాక్షసుడి రూపంలో వచ్చిందంటే అతిశయోక్తికాదు".

నన్నయ భారతంలో కూడా సంపన్నులు తమకు బదులుగా ధనంతో కొనుగోలు చేసి ఇతరులను పంపించుకోవచ్చునని వుంది. "ఊరు మీద ఊరు పడ్డా కరణం మీద కాసుపడదన్న" ట్టు ఎంతటి విపత్తులు వచ్చినా దానికి బలయే వారిలో ప్రథములు పేదలు, మధ్యతరగతి వర్గీయులే. ధనికులు–పేదలుగా సామాజిక విభజన వుండినంతకాలం 'రాజ్యం' యొక్క జీవలక్షణం యిదే. ఈనాటి సామ్రాజ్యవాద ప్రపంచీకరణ అనే మహావిపత్తుని చూచినా ఈ విషయం మనకు అర్థమవుతుంది. పాలకులు దాన్ని తమ ప్రయోజనార్థం వినియోగించుకోవడానికి దానితో సమస్త సర్దుబాట్లూ చేసుకుంటారు. దాని ఒత్తిడి మేరకు, రాజ్యవ్యవస్థనూ, ఇతర రంగాలన్నిటినీ సరళంగా సంస్కరించుతారు! అవసరమైతే "మానవ" మృగవేషం వేసుకోమని సూచనలిస్తారు. దేశవ్యాపితంగా (నూరు కోట్ల) జనాభాలో ఒక లక్ష మంది దాకా రైతులు ఆత్మహత్యలు పాలయితే – వారి వందిమాగధులు రోడ్ల ప్రమాదంలో ఎంత మంది చనిపోతున్నదో, రోగాలు రోష్టులతో ఎంత మంది కాలం చేస్తున్నదీ లెక్కలలో చూపిస్తారు. అందుచేత ఒక మహావిపత్తుకు వ్యతిరేకంగా ప్రజల్ని నిలబెట్టటం (సంపన్న) వర్గ రాజ్యపు లక్షణం కాకపోగా దాన్ని తన సేవలో వినియోగంచటం పైనే దృష్టిని లగ్నం చేస్తారు. సామ్రాజవాదం ఏకచక్రపురమై టెర్రరిజం బకాసురుడైతే, అమెరికా ఏం చేస్తుంది?

భారతదేశం ఏకచక్రపురమై, ప్రపంచీకరణ బకాసురుడైతే భీముడెవరు? భీముళ్ళను రాజ్యం సహిస్తుందా ?

కొ.కు. బకాసురిడిలో బలభద్రుడనే సూత యువకుడొకడు పదిమంది సాహస యువకుల్ని వెంటబెట్టుకుని బకున్ని చంపటానికి వెడతాడు. అయితే బకుడు వారికి తారసపడకుండా తప్పుకుంటాడు. కానీ బలభద్రుణ్ణి రాజ్యం ఏం చేసిందనేది కొ.కు. అవగాహనను, దృక్పథాన్ని పట్టిస్తుంది.

బలభద్రుడ్ని చూసి రాజు గారు అకస్మాత్తుగా కళ్లనిప్పులు రాలుస్తూ "పాపీ నీ దొంగ వేషాలు చాలించు. నీవు జనరక్షకుడ ననిపించుకుని, జనాన్ని కూడగట్టుకొని రాజువు కావాలని చూస్తున్నావు. ఒక వంక జనాన్ని హడవలగొట్టటానికి రాక్షసుడున్నాడంటున్నావు. మరొక వంక వాడు సులువుగా చస్తాడంటూ జనాన్ని నీకేసి

## నవ్యపథం

**కోశా విమలకుమారి, విజయవాడ**

కష్ట సుఖములు సిరి సంపదలు భోగ భాగ్యేములకలసి
పంచుకొనిన కలదు ఆనందం, అందును ఆయురారోగ్యం
తల్లీబిడ్డలు, అత్తమామలు భార్యభర్తల ఉమ్మడి కుటుంబం
ఆప్యాయతాను రాగాల సిరులు కురుపించేనానాడు.
మనుమ సంతానాన మందువా లోగిళ్ళు పండుగలై పరవశించె
కలసి ఉంటే కలదు సుఖం విడిపోతే విషాద వలయం
మన భారతీయ సంస్కృతీ సంప్రదాయాలనడుమ
సమాజాన్ని గౌరవించడం అనాదిగా సంతరించుకొన్న ఆచారమది.
ఇరుగు పొరుగు వారే మన బంధువులు, ఆత్మీయులను భావన
చెలిమి కొలినలో స్నేహకమలములు విరిసేటి వేళ
హృదయరాగ మతిశయిల్లి పల్లవించె పరిపరి విధముల
స్నేహమన్న చెదరని స్వప్నమై విలసిల్లే నాడు
పండుగలు, పెళ్ళిళ్లు జన్మదిన వేడుకలెల్ల వెల్లివిరియ
ఐకమత్యాన అందరూ కలసి యున్న ఆసంతోష సంబరాల సంతృప్తి
అనుభవించిన గాని చెబితే తీరునది కాదు
అత్త మామలు ఆది దంపతులై కుటుంబ వ్యవస్థకే
మూల స్థంభముల వోలె నిలచె నానాడు
స్వార్థం, సంకుచితత్వం సమపాళ్ళలో పయనిస్తుంటే.
మంచి చెడుల విచక్షణా జ్ఞానం లుప్తమై అవగామనా లోపాన
ఉమ్మడి కుటుంబ వ్యవస్థను ప్రక్కకు నెట్టి వేరుకాపురాల
వేడ్కతో ఒంటరి పోరాటాల మాటున కడగండ్ల పాలాయె
కన్నవారి కడుపుల చిచ్చురగిల్చి వృద్ధాశ్రమ పాల్జేయు
ప్రబుద్ధులు ప్రబలి పోతున్న వ్యవస్థ నేటి మన
సంస్కృతీ సంప్రదాయాల వినూత్న విరచితమగు చక్కని సంస్థ
అత్తమామలున్న అతివకు కొండంత అండ యని
తల్లిదండ్రులున్న పుత్రుని క్షేమం కోరి ఆరాటపడునని
ఎరుగని నేటి యువత వక్రమార్గాన పయనిస్తుంటే
వారి యెదదల సుమదుర సుహృద్భావ ప్రకటనల్ జేసి
అవగాహనా పథాన ఆలోచింప జేయునదెవరు!
మానవ సంబంధ బాంధవ్యాలు తెరమరుగవగా
లేదా ముక్తి మార్గమీ మూగవేదనల దీనగాథకు
రానే రాదా మరల మన పెద్దలాశించిన నాటి
సంతోష సంబరాల ఉమ్మడి కుటుంబ వ్యవవస్థ
ఓ యువతా! కన్నవారి యెడ ప్రేమను తలచి వినూత్న యోచనతో
ఆర్థిక సహాయ మందించుకున్నమ అనురాగ లాలనతో ఆదరించు.

తిప్పుకుంటున్నావు. నీ ఎత్తు సగం పారింది. ఈ అమాయకులను వెంట వేసుకుని తిరిగి వచ్చావు. ఇలా నాలుగుసార్లు తిరిగి ఏ అభాగ్యుణ్ణో చంపి, ఏకచక్రపురాన్ని రాక్షసుడి బారి నుంచి కాపాడానని మూఢులైన ప్రజలను సులువుగా నమ్మిస్తావు. మంత్రీ! ఈ రాజద్రోహి తల దీయించండి. ఈ మిగిలిన వాళ్లందరినీ కారాగృహంలోకి తోయించండి" అన్నాడు. వర్గరాజ్యంలో ప్రజాన్యాయం అమలుకాదు. అవినీతి అక్రమాలు దోపిడీలు దౌర్జన్యాలు కల్తీలు, దొంగ వ్యాపారాలు సాగించి సంపాదించుకున్న వారి తీరు ప్రజలకు రహస్యమేమీ కాదు. అత్యాచారాలు, హత్యలు సాగించినదెవరో కూడా ప్రజలకు తెలుస్తూనే వుంటుంది. కానీ నిజమైన దోషులకెందుకు శిక్షలుపడవు అంటే.... అవి సాగించే వారికి రాజ్యం కల్పించే అండదండలూ. అవి ఎరిగిన వారికి రాజ్యమంటే ఎవరిపక్షమో తెలిసి వుండే భయాందోళనలు. అయినా రాజ్యమంటే ప్రజలందరి యొక్క శాంతిభద్రతలనూ సంక్షేమాలనూ కాపాడేదనే భ్రమను నిజమని నమ్మించే సాంస్కృతిక రాజకీయ ప్రయత్నాలు ఎప్పుడూ ఉండనే వుంటాయి. ఈ భ్రమను పటాపంచలు చేయటానికి ఉద్దేశించినదే కొ.కు. 'బకాసుర' కథ.

కేవలం 26 పేజీల కథ నవల కాగలుగుతుందా? కొ.కు కథలు, నవలలను సంపుటాలుగా ముద్రించిన విశాలాంధ్ర ప్రచురణాలయం వారి సంపాదకవర్గం (కేతు విశ్వనాథరెడ్డి గారి ముందుమాటతో) 'బకాసుర'ను నవలల జాబితాలోకి చేర్చింది. ఆంధ్ర మహాభారతంలో బకాసుర గాథ 49 పద్యాలతో నడిమధ్య 25 వచన కథనాలతో కేవలం 14 పేజీలే వుంది. నన్నయ భారతంలో కుంతి, పాండవులూ కాక పేరువున్న ఒకే ఒక పాత్ర బకాసురుడు. మిగిలిన పాత్ర పాండవులనాదరించిన బ్రాహ్మణుడొక్కడే. అతని నోటి మాటల ద్వారా తమ రాజు దుర్బలుడని తెలుస్తుంది. అంతే! కానీ కొ.కు. రాజునూ, మంత్రినీ, బండివాడినీ (నిజం చెప్పనీయకుండా మంత్రి యితని నాలుక కోయిస్తాడు) సాహస యువకుడు బలభద్రుడిని కల్పించాడు. బ్రాహ్మడికి చయనులు అని పేరు పెట్టారు. వేదాంతి, అజ్ఞాని అనే రెండు పాత్రలను సృష్టించటం ద్వారా మొత్తం కథ గొప్ప నాటకీయతను పొంది, ఒక నవలకుండేంత విఖ్యాతిని కొద్ది నిడివిలోనే సాధించింది. రాజ్యాన్ని కాపాడే వాదనలు కర్మసిద్ధాంత మౌఢ్యాలూ ప్రచారం గావించటం వేదాంతి వంతు. ప్రజాభిప్రాయాన్నీ, అందరికీ తెలిసిన సత్యాల్ని ప్రకటిస్తూండటం అజ్ఞాని వంతు. కొ.కునే వేరే సందర్భంలో చెప్పినట్టు నాటకీయత అంటే టెన్నిస్ బంతుల్లాగా సంభాషణలు నడిపించటం కాదు. కథా సంవిధాన శిల్పమూ, పాత్రల మధ్య సహజ సంఘర్షణల చిత్రీకరణే నాటకీయత. నన్నయ భారతంలోనే నాటకీయ కథనం వుంది. కొ.కు దాన్ని ఇంకా విస్తరించాడు. ముఖ్యమైన పాత్రలను, వాటి స్వభావాలను, మనస్తత్వాలను మనం గ్రహించేటట్లుగా, అనవసరమైన ఒక వాక్యం కూడా లేదు అన్నంత చిక్కగా అతిసరళంగా కథను చెప్పారు. కేవలం ఒక సంఘటనో, సన్నివేశమో కాక అటు రాజాంత:పురమూ, ఇటు బ్రాహ్మణుల యిల్లూ ఇంకా బకుడు వాడిన నరమాంసభక్షణా ప్రదేశమూ.......... మన కళ్లముందు దృశ్యం కదలాడేట్టు చేస్తారు. ఇంకా మన ఊహకు కావాల్సిన ప్రదేశాన్ని కూడా కల్పిస్తారు.

బకుడు, బకాసురుడు-బకాసురేశ్వరుడుగా, రాక్షసుడు రాక్షసులుండారు, రాక్షసేశ్వరులుగా పాలక పరివారంలో, గుర్తింపు పొందుతాడు. ఇది గతంలో సంఘ వ్యతిరేక కార్యకలాపాల్పాత్ర వుండినా నేడు గౌరవోన్నతనిన పొందే కొందరి'పెద్దల' తీరుని సూచిస్తుంది.

బకాసురుణ్ణి ముసలివాడిగానూ, సరిగా చూపు ఆనని వాడిగానూ, కుక్కబుద్ధివానిగానూ కొ.కు ఎందుకు చిత్రించాడు? అమెరికా సామ్రాజ్యవాదాన్ని కాగితంపులి అనటంలాంటిదా యిది? కాదు. ఒకనాడు బండివాడు విసిరిన వసికర్ర దెబ్బకు బకుడు పారిపోతాడు. అంతకు మునుపే పాండవులు ఏకచక్రపురంలోకి ప్రవేశించే సందర్భంలో అడ్డం వచ్చి భీముని పిడికిలి దెబ్బకు తాళలేక పరుగుతీస్తాడు. సాధారణ సందర్భాలలో సమ ఉజ్జీని ఎదుర్కొని పోరిగెలిచినట్టు చెప్పటమే కళాత్మకతవుతుంది.నాయక, ప్రతినాయక పాత్ర నడుమ, మంచి చెడుల నడుమ నువ్వానేనా అన్నట్టు కథనం నడిస్తే గాని రచన రక్తిగట్టదు. పాఠకునిపైన గాఢ ముద్ర పడదు. కాని కొ.కు. బకుడ్ని భీముని ముందు దుర్బలునిగా చూపించటానికి కారణం-రాజ్యం యొక్క ప్రజావ్యతిరేకతత్వాన్ని కొట్టొచ్చినట్టుగా ఎత్తిచూపించటానికే. బకుడు నరమాంసభక్షణ గావించే దుష్టుడేగాని, ప్రజలలో భయంగొల్పినంత శక్తివంతుడు కాడు. తన స్వార్థ ప్రయోజనాలకోసం రాజ్యం ప్రజల జీవితాలను ఎంత నిర్లక్ష్యం గావిస్తుందో కళ్లకు కట్టినట్లు చెప్పటమే కొ.కు. ఉద్దేశ్యం.

1961లో ఆంధ్రప్రభ వారాపత్రికల్లో నాలుగు సంచికల్లో ప్రచురింపబడిన కాలానికి ఒక ప్రాయుఖ్యత వుంది. అప్పటికి బ్రిటీషు పాలకులు తెరమరుగై 14 సంవత్సరాలైంది. కొ.కు.లాంటివారు ఆనాడు సాగుతున్న పరిపాలన ప్రజానుకూలంగా లేదని గ్రహించారు. కానీ ప్రజలలో స్వాతంత్ర రాజ్యం, సంక్షేమరాజ్యం, రామరాజ్యంలాంటి ఆశలు, భ్రమలు వున్నాయి. రాజ్యానికి వుండే వర్గ స్వభావాన్ని మసకబార్చిన శక్తుల ప్రభావం ప్రజలపై ప్రబలంగా వుంది. బకాసురుడిలా ప్రజల్ని పీడిస్తున్న సమస్యలను రాజ్యం తనకు ప్రయోజనకరంగా వినియోగించుకుంటుందే తప్ప ప్రజానుకూలంగా వ్యవహరించటం దాని లక్షణం కాదు అని చెప్పటం కొ.కు. ఉద్దేశ్యం. అంతేకాక ప్రజాస్వామిక యుగంలో చరిత్ర నిర్మాతలు ప్రజలే. ఇక్కడ ఒంటరి హీరోలుండరు. ప్రజా ఉద్యమాలుంటాయి. రాజ్యం చెయ్యని పనులు ప్రజా ఉద్యమాలు నిర్వర్తించాలి అని సూచించటం కూడా కొ.కు ఉద్దేశ్యం కావచ్చు.

కొ.కు తిరిగి బకాసురను రాయటానికి కారణం బకాసుర సంహారం ఇంకా జరగలేదనే! ప్రజల్ని ఆత్మహత్యలకూ, ఆకలి చావులకూ, నిత్య అభద్రతకూ, అశాంతికీ, వివిధ రకాల సాంఘిక పీడనలకూ గురిచేస్తున్న వ్యవస్థే బకాసురుడు. ఆయన కథ రాసి 45 సంవత్సరాలు గడిచినా జనతా ప్రజాస్వామ్య భీముడు తప్పటడుగుల్లోనే వున్నాడు. ఇదే అసలు విషాదం.

బకాసురుడు ప్రజాపీడన సామాజిక వ్యవస్థలాంటి వాటిని కాపాడు సంపన్నులరాజ్యము సజీవంగా వున్నంతకాలం కొ.కు బకసురుడు సజీవుడే !!

**(అక్టోబరు ౨౮ కొడవటిగంటి కుటుంబరావు గారి ౯౭వ జయంతి)**

# అహింసా జ్యోతి

పువ్వాడ తిక్కన సోమయాజి, బెంగుళూరు

నింగినంటు హిమాద్రి శృంగాగ్రమున గ్రుమ్మ
రింపగ జాలు పూర్ణేందు కళలు
నీ శైల శిరోవినీల కుంతల లంబ
జలపాత మల్లికాజాల సరణి
దివిషత్తరంగిణీ ప్రవిలసల్లహరీవి
నిర్గత శీకరానీక సుషమ
పాలకడలి తరంగాల నురుంగులన్
నర్తించు నమృత భాండంపు దీప్తి
కొలువు తీరెనో ఒక్కచో కోరి కోరి
యనగ శాక్యముని చంద్రముని సమక్ష
మందు శాంతి స్వరూపిణి మంద పవన
సవన దీక్షానురక్తయై జగతి నీవె!

అరవిప్పు కనుదమ్ము లాకర్ణమై బాహి
రంతర దృష్టి సామ్యతను బెనుప
శరదిందు చంద్రికా స్ఫార ఫాలమ్మున
నిత్య సత్య జ్యోతి నృత్య మాడ
దీర్ఘ నిశ్వాసమ్ము తీర్చు నాసాగ్రమ్ము
యోగ సాధన మార్గ ముచ్ఛ్వసింప
ప్రణవమ్మువైన సుశ్రవణముచ్ వినుు నుడు
వెడద పాత్రికయందు వడియ గట్టి

త్రికరణాచ్చుతన్ చాటు శాటికలు తనర
చుట్టు వలిగట్టు సొబగు చూపట్టి జటలు
వసతి శిబిరమ్ముగా బృహస్పతికి నమర
బుద్ధ భగవాను డదె- శాంతమూర్తి పొల్చె!

తనయుడే సర్వస్వమని కంటి రెప్పగా
కను తల్లిదండ్రుల కన్ను గప్పి
ఏరికోరి వరించి యేలగా గైకొన్న
ధర్మపత్ని యనుబంధమును ద్రెంపి
ముకుపచ్చలారని ముద్దుల కొడుకుపై
వాత్సల్య వౌల్య మావలకు ద్రోసి
రత్న విభూషిత ప్రాజ్యరాజ్య రమాక
టాక్ష వీక్షణము లక్ష్యమ్ము గొనక

ఉన్నతాశయ మొదతోప నుజ్జ్వలముగ,
నల్ప బంధముల ననల్ప కల్పనలకు
నై త్యజించియె స్వప్రబోధి తాత్ముడయ్యె
రాజ్యరమ వీడు జ్ఞానభారతి యతండు!

అస్థిర స్వప్నమైనట్టి కామసుఖమ్ము
చంచల చిత్త సంఛాదితమ్ము
దుఃఖకారక మది దుఃఖమే, తీరని
కోరికల్ తన్మూల కారణములు
బ్రతుకంగనే భుక్తి వసియింపగా నిల్లు
త్యాగమ్ము దానమ్ము ధరణి నిలుపు
కాలయమునకెందు కనికరమ్ముండదు
వార్ధక్య బాల్య యౌవనము లొకటె

యనుచు, హింసాత్మక క్రతుఫలాప్తి కన్న
ప్రాణిరక్షక కరుణాంతరంగ మెన్న
మిన్న యన్న అహింసాగుణోన్నతుండు
బోధి సత్త్వుని పదపద్మములకు నతులు!

పలుకుల్ ముల్కులు, యోచనల్ కటుకు, విధ్వంసమ్ము కార్యమ్ము, లీ
కలికాలమ్మున రాజకీయ రథచక్ర క్రూర వక్ర క్రియా
కుల విద్వేషముతోన్మదిష్టుగత దుష్క్రోధానలోద్విగ్నతన్
కలతంజెందు ప్రజాళి బౌద్ధపద రక్షా దీక్ష కాంక్షించుతన్

# అంతర్యానం

కొండముది సాయికిరణ్ కుమార్. ముంబాయి

నా వైపే చెసుకుంటున్నా
అద్దంలో నా పాత్రకు
మొదటి ప్రేక్షకుడిని
కాలేకపోతున్నా.

ఎదుగుతున్న భ్రమల మధ్య
మబ్బుతునకలా
నేలమీది నా నీడ కోసం
వెతుక్కుంటూనే ఉన్నా.

చీకటి రొదలో
మలుపులు తిరిగే
నదీప్రవాహంలా
చూపుల ఎడారిలో
కన్నీటి చుక్క

రాల్చిన పూలు
చాలనుకుందేమో
స్తబ్ధంగా గాలి.

అందరికీ ఇదే మా ఆహ్వానం




# తెలుగు మేధస్సు

సదా తెలుగు ప్రజల సేవలో

**Telugu Brains : Working for Telugu Society**

**e-mail : telugubrains@yahoo.co.in**

**మా ఆశయాలు :**

1. ప్రపంచమంతా మనకు అందుబాటులో వున్న మానవశక్తిని, ఆన్ లైన్లో వున్న సమాచారాన్ని, తెలుగు సమాజసేవకు వినియోగించడం.
2. తెలుగు సాఫ్ట్‌వేర్ అభివృద్ధిమీద దృష్టిపెట్టి, తెలుగుప్రజల ప్రతిచర్యలో తెలుగు భాషాభివ్యాప్తికి కృషి చేయడం.
3. ప్రభుత్వేతర సంస్థల మధ్య సహకారాన్ని సంపాదించి, మన రాష్ట్ర అభివృద్ధికి పాటుపడడం.

**మా కార్యక్రమాలు :**

1. పిల్లలు తెలుగు నేర్చుకోవడానికి వీలుగా బొమ్మలతోకూడిన సచేతనాత్మక సాఫ్ట్‌వేర్‌ను తయారుచేయడం
2. కాపీరైట్ లేని తెలుగు రచనలన్నింటినీ ఒకచోట చేర్చి, అందరకీ అందుబాటులో ఉంచడానికి తెలుగు ఆన్‌లైన్ గ్రంధాలను ఏర్పాటుకు కృషి చేస్తున్నాము.
3. ప్రభుత్వ సంస్థల వెబ్ సైట్లను తెలుగులో అనువదించుటకు ప్రభుత్వ శాఖలకు ఉత్తర ప్రత్యుత్తరముల ద్వారా విజ్ఞప్తి చేస్తున్నాము.
4. తెలుగు మరియు ఇతర భాషల మధ్య అనువాదములను ప్రోత్సహించడానికి కృషి చేస్తున్నాము.
5. ప్రభుత్వేతర సంస్థల సమాచారాన్ని సేకరించి, వారు పనిచేసే క్షేత్రాల వారీగా అనుసంధానానికి ఒక ప్రణాళిక గురించి ఆలోచిస్తున్నాము.
6. ఆన్‌లైన్‌లో తెలుగు క్లాసులను ప్రోత్సహించడానికి కృషి చేస్తున్నాము.

**మీరు ఏమి చేయగలరు ?**

1. మీ ఆలోచనలుకాని, మీ అభిరుచులుగాని, మా ఆశయాలకు సరితూగినట్లైతే వెంటనే మా ఆన్‌లైన్ చర్చాబృందములో చేరండి.
2. మా ఆశయాలసాధనకు మేము ఏర్పాటుచేసినజట్లతో భాగస్వాములై మీ ఆలోచనలకు ఒక రూపాన్ని ఇవ్వండి. మనం వేసే ప్రతి అడుగు మన జీవితానికి ఒక క్రొత్త అర్థాన్ని ఇస్తుంది. మనం అందరం కలిసికట్టుగా అడుగులు వేసి మన ఆశయాలను సాధించుకుందాము.

అన్ని వివరాలకు ఈ క్రింది వెబ్ సైట్‌ను చూడండి :
**http://telugubrains.tripod.com.**



మా ఆన్‌లైన్ చర్చాబృందము యొక్క చిరునామా:
**http://groups.yahoo.com/group/telugubains/**

449

442

# తోపుడు బండివాడు

శ్రీ చిత్తలూరి సత్యనారాయణ, విజయవాడ

ఉదయ కిరణాలు సోకకముందే
వీధి చివర్లలోంచి విస్తరించే
వాడి రుచుల పరిమళాలు
ఇంటింటినీ నిద్ర లేపుతాయి.
పొద్దున్నే పనిలో కెళ్లే పాదాలూ
డ్యూటీకెళ్లే స్కూటర్లూ
కొండొకచో కంపెనీకెళ్లే కార్లూ
బండితోటలో వాడు పూయించే ఇడ్లీ పూలకోసం
తుమ్మెదల్లా బారులు తీరుతాయి
వేళ్ల చివర్లలోంచి 'సుయ్' మంటూ
వాడు మ్రోగించే పునుగు మువ్వల
సంగీతం విని రకరకాల జనం
వాడి బండిదగ్గర వెలుగు ఉసిళ్లవుతారు.
ఐదు నక్షత్రాల్ని అందుకోలేని
ఎన్నో మధ్యతరగతి జీవితాలకి
సరసమైప ధరలకే
'స్టార్' రుచుల్ని అందించే వాడో రుచుల ఫైవ్‌స్టార్.
ప్రతి వీధి మలుపునూ
తన బతుకుదెరువుకో మలుపుగా మలుచుకుంటూ
పళ్ల బండిగానో, పప్పుల బండిగానో
పూల బండిగానో, పునుగుల బండిగానో
అవసరాన్ని బట్టి బతుకును నెట్టుకుంటూ
గల్లీ గల్లీలో దర్శనమిస్తాడు.
అప్పుడప్పుడూ ఏ వీధిలోనో వాడిపై
జులుం చెలాయించే రూల్స్ లాఠీలకు ఐదో పదో కాగితాలై
ఉండ చుట్టుకు పోతూ మరో వీధిలోకి బతుకును
వెతుక్కుంటూ వెళ్లి పోతాడు.
వంటావిడ సెలవు తీసుకున్నప్పుడో
ఇంటావిడ అలసిపోయినప్పుడో
ఇంట్లో చిట్టి ప్రేమలకు రెండు ఇడ్లీలవ్వడం కోసమో
నాలుగు పునుగులవ్వడం కోసమో
నన్నూ వాడి బండి ముందు క్యూలో నిలబెడతాడు
వాడంటే నాకున్న ప్రేమను రెట్టింపు చేస్తాడు!
విరిగిన ఇడ్లీ ముక్కల్ని, నలిగిన పునుగు తుంపుల్ని
గుండెల్లో మూటకట్టుకుని
గూటిలో ఎదురుచూసే పిల్ల పక్షుల కోసం
మేత తీసుకెళ్లేతల్లి పక్షిలా వాడు
రాత్రిని మోసుకుంటూ ఇంటికి నిష్క్రమిస్తాడు.
ఉదయ సాయంత్రాల్లో మూటకట్టిన
తుండు గుడ్డలోని చిల్ల పెంకుల్ని
ఆలుబిడ్డల ఆకలి కలత్తో
రాత్రంతా బేరీజు వేసుకుంటాడు!
మళ్లీ రేపుదయాన్నే మనందరికోసం
ఏ వీధి మలుపులోనో, ఏ రోడ్డు వారగానో
వేడి వేడి ఇడ్లీలుగా పొగలు కక్కుతూనో
నోరూరించే పునుగులుగా
ఘుమ ఘుమలాడుతూనో
దర్శన మిచ్చేందుకు
తన్ను తాను సిద్ధపరుచుకుంటాడు
తన బతుకు బండిని సిద్ధం చేసుకుంటాడు.

---

**సోమరి పోతు**

కాలు తీసి
కాలు వేసేది
దున్నే పోతు

కాలు మీద
కాలు వేసేది
దున్న పోతు

**రైతు**

పొద్దుకు ముందే
పూసే
పొద్దు!

దున్నేటప్పుడు
మూడో
ఎద్దు!

**రైతన్నల విద్య**

పుడమిని
పైరుగా మొలవడం
ఆకలిని
వైరిగా గెలవడం
బ్రహ్మవిద్యేం కాదు
బ్రహ్మకు రాని విద్య!

**అన్నదాతల ఆత్మహత్య**

తమకు
దేశం
తిండి పెట్టనందుకు కాదు
తాము
దేశానికి
తిండి పెట్ట లేక పోతున్నందుకు

అశోక్ కుమార్, విజయవాడ

## సైడ్ ఎఫెక్ట్స్

కె. స్వర్ణలత, విజయవాడ

> **"పద్నాలుగేళ్ళ లోపు పిల్లలతో ఇళ్ళల్లో పని చేయించుకుంటే ఇంటియజమానికి జరిమానా, జైలుశిక్ష, ఈ నిషేధం అక్టోబరు 2006 నుండే అమలు"**

"లక్ష్మీ, మీ పిల్లను ఇవ్వాళ్టి నుంచి పనిలోకి రావద్దని చెప్పు చిన్న పిల్లల్తో పనిచేయిస్తే జైల్లో పెడతారట, నువ్వు క్రిందటి నెల్లో తీసుకున్న రెండువేలు సాయిత్రం పట్టుకొచ్చి ఇవ్వు."

"అమ్మా, అమ్మా అలా అనెయ్యకండమ్మా. మా పిల్ల మీ ఇంట్లో పని చెయ్యడం నాకిష్టమని ఎవురొచ్చినా నేను సెబుతానమ్మా"

అలా ఒప్పుకోరు, పద్నాలుగేళ్ళ లోపు పిల్లల్తో పని చేయించుకొరాదని రూలు పెట్టేశారు."

"ఓస్ అంతేకదా మా పిల్లకి పదహారేళ్ళని చెబుదాం ఎవరు చూడొచ్చారు?"

"అదింకా చిన్న గుంటే కదా?"

పర్లేదండీ మఖాన్న పెద్ద బొట్టెట్టి, కొప్పెట్టి, ఓణీ వేసేస్తాను. అడిగితే పదారేళ్లని సెప్పమని సెబుతాను. మీకు పన్నెముంటాది. పన్లోంచి పొమ్మనకండమ్మా."

"సర్లే, సర్లే, ఎవరడిగినా మీరిద్దరూ అలాగే చెప్పాలి."

"అలాగేనమ్మా"

❖ ❖ ❖

"అయ్యా, నా కొడుకు గాలికి తిరిగి బీడీలు, సినిమాలు మరిగి సెడిపోతున్నాడండి కాస్త మీ కొట్లో మీ చేతి కింద పెట్టుకొండయ్యా, వేళకి తిని సక్కవుంటాడు.

"కొత్తగా రూలు వచ్చింది తెలుసా చిన్నపిల్లల్తో పనిచేయించకూడదని"

"ఆ తెలుసండీ బాబు,వాడు బాగా పొడుగు, అందుకని మొన్నపండక్కి పద్నాలుగెళ్ళి పదిహేనువచ్చాయని మేమిద్దరం సెబుతాం పర్లేదు బాబు.

"సరే అయితే సాయంత్రం వచ్చికనపడమను"

"సత్య మేవ జయతే"

❖ ❖ ❖

శ్రావణం మాసం బంగారం ఊసేలేదు, దసరాకి పట్టుచీర కొనకపోతివి, దీపావళికి మాత్రం మిఠాయి వండాలేం, వల్లకాదంటే వల్లకాదు "చిటపటలాడింది కానిస్టేబుల్ కనకారావు భార్య.

"మరేం పర్లేదు, ఇంకొద్దిరోజుల్లో అన్నీ కొని పెడతాను కాని నువ్వో పని చెయ్యాలి"

"ఏంటదీ?"

"మన చుట్టుపక్కల కాలనీల్లో చిన్నపిల్లల్తో పనిచేయించుకునే వాళ్ళ ఇళ్లు కాస్త వాకబు చేసి నాకు చెప్తే చాలు"

చిద్విలాసంగా నవ్వుతూ అన్నాడు కనకారావు.

## కృష్ణా తరంగాలు

వేలూరి సుధాకౌండిన్య, విజయవాడ

కృష్ణమ్మ అంటే నాకు ఆరోప్రాణం
అమ్మ అంటే కృష్ణమ్మే!
చల్లని సోయగాల తల్లికి
ఎన్నో ఒంపులు మరెన్నో సొంపులు
ఆ తల్లి స్మృతుల మాలిక వాడని సిరిమల్లె
మదిలో మెదిలే తరంగాలు కృష్ణమ్మ అంతరంగాలు

తళతళలాడే దుర్గమ్మ ముక్కెర
శిధిల సౌరభాలక్రింద అక్కన్న మాదన్న
నగరానికి అంద గాంధీ కొండ
ఆరుబయట ప్రకృతిలో ఆరబోసిన అందాలు
ఆంధ్రదేవుని గుడిగంటల హోరు
మంగినపూడి అలల జోరు
దానిమ్మ తొనల్లోని ముత్యాల్లా
సుతిమెత్తని గులాబీలు
వేదాద్రి నరసింహుని చల్లని చూపు
మధుర స్వరాల సాల మన ఘంటసాల
పదహరణాల పల్లె పడుచు
మా కూచిపూడి ఇంటి ఆడపడుచు
అది గాంధీ క్షేత్రం కాదు
మహిమాన్విత పుణ్యక్షేత్రం
ముత్యాల దండ మువ్వగోపాలుని పదమాలిక
వైభవోజ్వాల సీమ నాదివిసీమ
హృదయాంతరంగ వీణ
నూజివీడి మానస వీణ
కృష్ణా లీలా తరంగం
నారాయణ తీర్థుని అంతరంగం.

ముట్నూరి మానసపుత్రిక
ఆంధ్రుల అభిమాన కృష్ణాపత్రిక
నెమలి కన్నుల వేణు గోపాలుడు
తిరుమంత్రాల తిరుపతమ్మ
మహిమాన్విత దివి
హంసల దీవి
చల్లని పల్లె చల్లపల్లి
జయ జయ ధ్వానాల జెండా వెంకయ్య
విశ్వదాత కాశీనాథుడు
సప్తస్వరాల పారుపల్లి
అనుభవాల ఒడి
కోటి బొమ్మల ఒడి కొండపల్లి
రండి! అనుభూతిల ఒడిలో
ఓలలాడుదాం!

# మా ఇంటి పుస్తకాలయం

జోరాశర్మ, రాజమండ్రి

మా ఇంటి షోకేసు
బొమ్మల కొలువు కాదు.
పుస్తకాలకు నెలవు,
పేరేడ్ గ్రౌండు -----
ఆ అలమరా దగ్గర నడుస్తుంటే
సుశిక్షిత సైనికులు నిటారుగా నిలబడి
కవాతు చేస్తున్నట్లుంటుంది.
ఒక కొనగోటి సైగకు
ఒక పుస్తక సైనికుడు ముందుకొచ్చి
నాకు సైనిక వందనం చేస్తాడు ---
అనాఘ్రాతపుష్పంలా
అట్టనలగని పుస్తకం అందంగా
కనిపిస్తుంది నాకు--
కొత్తపుస్తకం దొరికితే
ఇవ్వాళ కొత్త మిత్రుడు మాయింటి కొచ్చినట్టే -----
ఆత్మీయతా సరాగాల
చిరుసంతకాలతో
కవిమిత్రులిచ్చిన పుస్తకాలు
పుస్తకం తెరవగానే సంతకం కింది తేదీనాటి
జ్ఞాపకాల్లోకి లాక్కెళతాయి
పుస్తకం మూసేసినా
ఆపరిమళాలు వెంటాడుతుంటాయి-----
నే కూడబెట్టు కొన్న పుస్తకాల ఆస్తి
నే ఋణ పడి కట్టుకొన్న ఇంటి కన్నా గొప్పది
ఇంకా చెప్పాలంటే
నన్ను కొనుక్కున్న ఆలికన్నా గొప్పది.----

నిజం చెబుతున్నాను
నేను చాలా పుస్తకాలు వాయిదాల పద్ధతిలో కొనుకున్నాను.
కనీసం వాయిదా పద్ధతిలో అయినా
చదవలేక పోతున్నాను ------
కొని చదవకుండా దాచుకొన్న పుస్తకాలు
నిజాంనవాబు కట్టుకొని ఉంచిన
అంతః పుర బురఖాస్త్రీల్లా కనిపిస్తాయి.
అందుకే ఓ బెంగ నన్నెప్పుడూ
వెంటాడుతుంది.
దానికి మా ఆవిడ తోడవుతుంది.
"ఇవ్వన్నీ ఇంకెప్పుడు చదువుతారు?"
అని ఓ తుపాకీ ప్రశ్న గురిపెడుతుంది -------
పుసకాల్ని విసుక్కుంటే
నా ప్రాణం విలవిల లాడుతుంది.
అడ్డం వచ్చిన పుస్తకాలన్నీ
అటకెక్కించమంటే
మా ఆవిడే నాకు అడ్డమనిపిస్తుంది ---
పుస్తకానికి అమర్యాద జరిగితే
నే సహించలేను.
"ఓసి అమాయకురాలా !
పుస్తకం
నీ పుస్తెల తాడంత పవిత్రమే !"
అని దెబ్బలాడాలనిపిస్తుంది.
ఇవ్వాళ టి.వి. వచ్చి
పుస్తకానికి సవతై కూర్చుంది.
నా షోకేసు పక్కన టీవి.
పవిత్రాలయం పక్కన
బార్ అండ్ రెస్టారెంట్‌లా తగలడింది.
దీని "టీవి" మండ
ఇంటిల్లి పాదినీ
కంట్రోలు చేస్తోంది
నా చేతి కొచ్చిన సమీక్షాగ్రంథం
నా ఆశీస్సులు కోరే
దీర్ఘ సుమంగళి .......
నేను పుస్తక ప్రియుల్ని ప్రేమిస్తాను.
చిలకాగోరింకల్లా మెలిగే భార్యాభర్తల్ని
"షెన్నూ పుస్తకంలా కలిసిపొండర్రా అంటూ
ఓ మంచి పుస్తకం బహూకరిస్తాను.
వాళ్ళముందుగది
సద్గ్రంథాల జీవనది కావాలని
ఆశీర్వదిస్తాను.

## నిన్న-నేడు-రేపు-ఇదీ మన సమాజం

ఓరుగంటి రామకృష్ణప్రసాద్, విజయవాడ

నిన్నచూసాను
నేడు చూస్తున్నాను
రేపు చూస్తానో-లేదో-తెలియదు
కాలం కలికాలం
వర్తమానం అంధకారం
అందరూఇలా చెప్పేవాళ్ళే
అందలమెక్కచూసేవాళ్ళే
ఎలాగ? ఎలాగైనా సరే!
ఎదుటివాణ్ణి-తిట్టో-కొట్టో
మరిపించో, మురిపించో
బులిపించో, బుజ్జగించో
కావాలని అదరగొట్టో
కాదంటే చంపించో
అందుకో పుచ్చుకునేవారే
అందగా-అణగద్రొక్కేవారే
ఇప్పుడో వింత సమస్య
అక్షరాలు ఎక్కువైనాయని
తక్కువగా మాట్లాడాలని,వ్రాయాలని
అక్షరాలు కుదించేసారు
అందని పళ్ళు పుల్లన అన్నట్లు
సంధులు విరగదీసారు
ఎందులోను ప్రావీణ్యం లేక పోయినా
అందల"మెక్క"డానికి
అధికారం పంచుకొనడానికి
అడ్డదారులు త్రొక్కడానికి
"రాజకీయం" చేస్తున్నారు
రాక్షసత్వం ప్రదర్శిస్తున్నారు
ఇది-ఈనాటి-సామాజంలోని సాకార దృశ్యం మరి రేపో..
అది చూడలేని ప్రశ్నార్థకం!
చూడబోని భుమార్థకం!
ఆవేదనతో

## అనంత భారతం

తాతారమేష్‌బాబు, గుడివాడ

1
కనికరంలేక ఉరిమి చూస్తే చిరుగాలికే ఎగిరిపోయే కప్పు
వరుణుడు వర్షిస్తే, కంటతడితో కరిగిపోయే గోడలు
తెల్లవారితే మేలుకొలుపులాతెరలు ఆగని తండ్రి దగ్గు
సిగ్గుతో మదిచితికిన చిరిగిన గుడ్డల ఎదిగిన చెల్లి
దొరలు తిన మరగిన పాత్రలు శుభ్రపరిచే తల్లి
కరువు కొలిమిలో
మగ్గుతున్న మానవ యంత్రాలు
సమస్యల సమాధిలో
సతమత మవుతున్న జీవచ్ఛవాలు

2
గాలిలో మేడలుకట్టే ఆకాశానికి నిచ్చెనలు వేసే
అపసవ్యమార్గాల సంకుచితత్వంలో
ధ్వజమెత్తిన శకుని స్వరానికి బలవంతపు ఆకర్షణకు గురై
దేహాన్ని శయ్యగా మార్చి నిద్రించిన మనసును
స్థితి మరచి గతివిడిచి
కలల విహారానికి రారాజుగా ప్రకటింపబడ్డవాడు
ఎప్పటిలాగే ఆశలమూటను భుజానకెత్తుకొని
శ్రమతెలియని కథల తరాలు మారినా సశేషంగా సాగేబేతాళంలా
రెక్కలు విరుగుతున్నా డొక్కలు ఎండుతున్నా
గుప్పెడు మెతుకుల వద్ద కష్టాన్ని అర్పిస్తూ
పగలూ రాత్రి వెన్నెముకను విరచుకొంటూ
ఆర్థిక సామాజిక రాజకీయ మోసపూరిత మాయాజాలపు రొంపిలో
శ్లేష్మంలో ఈగలా, సాలెగూటిదోమలా
తరతరాల బానిసత్వపు ఎయిడ్స్ రోగిలా మిగిలినవాడు

3
జీవించాలనుంది
మరణించాలనుంది
వైరుధ్యాల మధ్యకాలం దొర్లిపోతోంది
కన్నీటి చినుకు చిట్లింది
అభినవ వ్యాసుని అనంతాక్షరాల సాక్షిగా
జీవన చిగురింపును చూస్తూ
సామాన్యుడి భారతం లిఖిస్తూ....

48a

అఖిలభారత తెలుగు రచయితల మహాసభల విజయానికి దివినుండి ఆశీస్సులు అందిస్తూ....



## "కవిపాదుషా" శ్రీ పువ్వాడ శేషగిరిరావు శతజయంతి

జన్మస్థానము - మొవ్వ (కృష్ణాజిల్లా)

జననము : ది. 12-7-1906 కాలధర్మం : ది. 24-5-1981

| | | |
|---|---|---|
| విద్యాభ్యాసం | : | మచిలీపట్నం హిందూ హైస్కూలు |
| స్వయంకృషితో | : | ఉభయభాషాప్రవీణ, పి.ఒ.యల్ పట్టములు |
| **ఉద్యోగము** | | |
| తెలుగు పండితులు | : | ఎస్.కె.పి.వి.వి. హిందూ హైస్కూలు, విజయవాడ (1929-34) |
| తెలుగు పండితులు | : | హిందూ హైస్కూలు, మచిలీపట్నం (1934-35) |
| ఆంధ్రోపన్యాసకులు | : | హిందూ కళాశాల, మచిలీపట్నం (1935-47) |
| ఆంధ్రోపన్యాసకులు | : | మహారాజావారి కళాశాల, విజయనగరం (1947-51) |
| ఆంధ్రోపన్యాసకులు | : | ఆంధ్ర జాతీయ కళాశాల, మచిలీపట్నం (1951-70) |
| **రచనలు :** | | |
| పద్యకావ్యములు | : | కవిత, గోవత్సము, తాజమహలు, దారా, శతపత్రము, పాలవెల్లి, అపశ్రుతులు, ఆంధ్రసామ్రాజ్యము (అసంపూర్ణం) |
| గద్యకృతులు | : | మధుకలశము, తెలుగు వెలుగులు, దీప కళికలు, పరశురాముడు ఆంధ్రతేజము, ఏరువాక, ఔరా, ఎవరు ? ఉత్తములు. |
| బుఱ్ఱకథ | : | రక్తతర్పణము. |
| నాటకములు | : | ఢిల్లీదర్బారు, దుర్గాదాసు, పృథ్వీపుత్రి, ప్రతాపరుద్రమ దేవి, సహపంక్తి, ప్రాణరక్షణ, శిల్పకావ్యము, తిస్సాపరిష్కారము, తొట్రుపాటు, నందనార్, బిల్హణీదయము, లక్ష్మీ స్వయంవరము, సత్యప్రభ, చదరంగం. |

486

# శ్రమయేవ జయతే

కోనేరు కల్పన, విజయవాడ

"లలిత ఎప్పుడు వస్తుందో?" మరోసారి లలితను తలచుకున్నాడు శివ. చీకటితోనే నిద్రలేవ వలసి వచ్చినప్పటినుంచి ఇప్పుడు కూరగిన్నె చేతిని చురుక్కు మనిపించేవరకు ఎన్నిసార్లు అలా అనుకున్నాడో!

ఔను! మరి, నిన్నటికి మూడోనెల వచ్చేసింది కదా, ఇక వచ్చేయ కూడదూ, తనే వెళ్ళి తీసుకు రావాలేమో లేక పసిపిల్లతో రావటం కదా, వాళ్ళే తీసుకు వచ్చి దింపుతారేమోలే.

పరిపరి విధాల పరుగెడుతున్న ఆలోచనలతోనే పని పూర్తి చేసుకుని బయట పడ్డాడు, డ్యూటీకి వెళ్ళేటందుకు.

నల్లనిమేఘాలను తరుము కొస్తున్నాయి చల్లని తెమ్మెరలు. ఆ పవన పరిష్వంగంలో ఆ కరిమబ్బు కరిగిపోవటాని ఎంతో సమయంకి పట్టేటట్లు లేదు.

శివకు మరోసారి లలిత గుర్తుకు వచ్చింది. తన కౌగిలిలో తాను కరిగే దెప్పుడో నని పించింది.

"పెద్దవానే వచ్చేటట్లుందిరా. ఏమిటలా మబ్బు వంకే చూస్తున్నావు. డ్యూటీకి ఆలశ్యమవటం లేదూ"! తండ్రి మందలింపుతో శివ తిరిగి చూశాడు.

"నాకు వాన వచ్చేటట్లుందని చెప్తూ, ఈ చలి గాలి లో నీవేం చేస్తున్నావు? ఈ పూట పత్యం తిన్నంత మాత్రాన జ్వరం పూర్తిగా తగ్గిపోయిందనుకుంటూన్నారా?

"బయట హాయిగా వుందిరా, అందుకని--" "ఆ.ఆ.అలాగే వుంటుంది. ఆ తగ్గిన జ్వరం మళ్ళీ ముంచుకొచ్చి ఏటైఫాయిడ్ లోకో దింపే దాకా నువు అంతే. పద. పదలోపలకు"

నేను వెళతాగాని నీకు ఆలశ్యమవుతుంది. ఇక బయలుదేరు. నాడ్యూటి నేనెలా చేసేవాడిని. ఈ సత్యం డ్యూటీలో వున్నాడంటే రైల్వేస్టేషన్ మాస్టర్లు ఎంత నిశ్చింతగా వుండేవారు".

"సరే.సరే. రోజూ చెప్పాలా ఏమిటి? నువులోపలకు వెళ్ళు" అంటూ శివ వెళ్ళిపోయాడు.

ఆ నీటి మబ్బుల క్రింద ఆ చల్లగాలిలో తిరగటం సత్యంకు ఎంతో ఉల్లాసాన్నిస్తోంది. జ్వరం తగ్గి నీరసంగా వున్నా ఆ తొలకరి సంకేతాల ఆనందానుభూతిని ఆస్వాదిస్తున్నాడు.

ఇంతలో 'తాతా-తాతా' అంటూ వచ్చి కాళ్లను చుట్టేశాడు మనమడు సుందర్.

"అరరే నీవట్రా", అంటూ వాడిని విడిపించుకుని ఎదురుగావున్న జామచెట్టు కొమ్మ మీద కూర్చోబెట్టాడు సత్యం.

గడ్డం క్రింద చెయ్యి పెట్టుకుని ప్రశ్నార్ధకంగా తాతవైపు చూస్తూ అడిగాడు సుందర్. "శ్రమ యేవ జయతే" అంటే ఏమిటి తాతయ్యా".

"ఓరోరి ఇంత పెద్ద పెద్ద మాటలు నీవెక్కడ విన్నావురా! అంటూ తాత మనుమడి లేత బుగ్గలను నిమిరి ముద్దాడాడు.

"మా టీచరు గారు అట్టమీద వ్రాసి స్కూల్లో తగిలించారు గాని చెప్పు తాతయ్యా"

"అంటే- కష్టపడితే ఫలితందక్కుతుంది. మన బాధ్యతను మనం సక్రమంగా నిర్వర్తించాలి. అదేరా మన డ్యూటిని మనం నిజాయితీగా నమ్మకంగా చేస్తే భగవంతుడు మంచి ఫలితాన్నిస్తాడు.

"ఓహో అదా! అంటూ సుందర్ తాతమీదకు దూకి జర్రున క్రిందకు జారి, తుర్రున పరుగుతీశాడు.

వాతావరణం ఉల్లాసాన్నిస్తే, మనుమడి ముద్దుమాటలు బలాన్నిచ్చినట్లుంది. సత్యానికి ఇంకాసేపు బయటే వుండాలనిపించినా ఆరోగ్య కోసం జాగ్రత్త మంచిదని లోపలకు వెళ్ళాడు.

శివ చకచకా ట్రాక్ చెక్ చేసుకుంటూ వెళుతున్నాడు. చూసినంత వరకు అంతా బాగానేవుంది. ఇంకో రెండు ఫర్లాంగులు చూస్తే తను చూడవలసింది పూర్తవుతుంది ఇంతలో చినుకులు మొదలయ్యాయి.

మళ్ళీ మనసు లలిత మీదకు పోయింది. ఇలాంటి తొలకరి చినుకుల్లో తడుచుకుంటూ వాళ్ళ ఊరు మూడు మైళ్ళు నడచి వెళ్ళేవారు. సరసాలు, సరాగాలతో గాలిలో తేలుతున్నట్లు నడుస్తున్నవారికి అప్పుడే ఊరు వచ్చిందా అనిపించేది.

పెండ్లయ్యి ఆరేళ్లయినా పెండ్లి నాటి మురిపాలనే ప్రతి రోజూ క్రొత్త క్రొత్తగా అందిస్తుందిలలిత. లలితతో జీవితాన్ని పంచుకోవటం నిజంగా తన అదృష్టం.

ఈ రాత్రికి ఫోను చేయాలి. తను వస్తుందో లేదో తనను రమ్మంటుందో తెలుసుకోవాలి. నిన్నటి నుంచి మరీ ఈ ఎడబాటును భరించలేక పోతున్నాడు.

చినుకులు పెద్దవయ్యాయి, త్వరత్వరగా పనిపూర్తి చేయాలని వేగం పెంచాడు.

"శివా" అన్న సురేష్ కేకతో తలెత్తి చూశాడు. వాన వస్తోందిగా రారా క్యాబిన్‌లోకి వెళదాం" నీవు పద. కొద్దిగానే వుంది. చూసి వస్తాను", అంటూ శివ పనిలో లీనమయ్యాడు.

సురేష్ శివ దగ్గర కొచ్చి పేకముక్కలు, పచ్చిమిరపకాయ బజ్జీలు చూపించాడు. వాన పెద్దదయ్యేటట్లుంది. నీ ట్రాక్‌కు ఏమీ కాదు బాగానేవుంటుందిలే. పద బజ్జీలు ఆరిపోతే బాగుండవు. "అంటూ చెయ్యి పుచ్చుకున్నాడు సురేష్, శివ కాదన లేక పోయాడు మళ్ళీ లలిత వచ్చిందంటే పేక కూడ పట్టుకోనివ్వదు. ఎంత రహస్యంగా ఆడినా ఎలా కనిపెడుతుందో ఏమో ఇట్టే పట్టేస్తుంది. అందులో ఆమె ముఖం చూస్తు తాను అబద్దం చెప్పలేడు. పేకాట కోసం మనసు ఉరకలు వేస్తున్నా, కొంచమే కదా చూసి వస్తాను. నువ్వు పద అన్నాడు చెయ్యి వదిలించుకుంటూ, డ్యూటీ ఎగగొట్టటం అలవాటు లేని శివ.

సురేష్ విడువ లేదు. జబ్బపుచ్చుకుని దాదాపు బలవంతంగానే లాక్కెళ్ళాడు.

శివ తల వెనక్కు త్రిప్పి చూశాడు. ట్రాక్ అంతా సవ్యంగా నే ఉన్నట్లు అనిపించింది. సురేష్‌తో కలసి క్యాబిన్ వైపు నడిచాడు. బండి రావటానికి ఇంకా టైమ్ వుందనుకుంటూ ఆటకు దిగాడు అట జోరుగా సాగుతుండగా క్రిందనుంచి సుందర్ గొంతు వినిపించింది... "నాన్న-నాన్నా" అంటూ.

ముందు ఎవరూ పట్టించుకోలేదు. కాని వాడు విడువకుండా అరుస్తుంటే సురేష్ కసిరాడు పొమ్మని. అయినా సుందర్ మెట్లెక్కి క్యాబిన్ లోకి తొంగి చూశాడు.

అందరూ పేకాడుతున్నారు. వాళ్ళ నాన్న కూడ కళ్ళు పెద్దవి చేసుకుని చూస్తుంటే ఎవరో కేకవేసి క్రిందకు దింపేశారు. వాడు ఏడుస్తూ, "అక్కడ-అక్కడ" అని ఏదో చెప్పబోతుంటే వినకుండా తరిమేశారు.

సుందర్ ఏడుస్తూ వానలో తడుస్తూవస్తుంటే సత్యం గుండెగుబేలు మంది. నాలుగు చినుకులు పడితే చాలు వాడికి జలుబు జ్వరం వస్తాయి. రేపో మాపో వాళ్ళమ్మ వచ్చే సరికి వీడికి వంట్లో బాగుండక పోతే ఏమనుకుంటుంది. తన బిడ్డను సరిగా చూడలేదనుకోదూ...

గబగబా పొడితుండుతో వాడి తల తుడుస్తూ విషయం అడిగి తెలుసుకున్నాడు.

"అక్కడికి నీవెందుకు వెళ్ళావురా" అన్నాడు. "మరేమో రైలు వచ్చినప్పుడు పట్టాల మీద ఇనుపరేకు పెడితే అది అయస్కాంతం అవుతుంది గదా. అందుకని మా ఫ్రెండ్స్ అంతా వెళ్ళాం"

"పట్టాల మీద ఆడుతుంటే ట్రైన్ వస్తుందని కోప్పడి వుంటారు. మీరు చేసింది తప్పేకదా?"

"అదేంకాదు క్యాబిన్‌లో నాన్నవాళ్ళు పేకాడుతుంటే చూశానని కోప్పడ్డారు".

"క్యాబిన్ లోకి ఎందుకెళ్ళావు"?

"మీరేమో మీరే-అక్కడ పట్టాల మీద పెట్టటానికి రేకు కోసం వెతుకుతూ వెళుతుంటే-అక్కడేమో నట్లు అన్ని ఊడబీకి వున్నాయి. మరి రైలు పడిపోతుందిగదా. అది చెపుదా మనే క్యాబిన్ దాకా పరుగెత్తుకు వెళ్ళాను".

"మరి చెప్పావా?" కంగారుపడ్డాడు సత్యం "ఎక్కడా? నన్నుచూడగానే తిట్టి తరిమేశారుగా అంటూ మళ్ళీ ఏడుపు మొదలెట్టాడు.

సత్యానికి మతిపోయింది. టైము చూస్తే బండి వచ్చేటయిమవుతోంది. ఊడదీసి వున్న నట్లు-పేకాడుతున్న కొడుకు ఆయన దృష్టితో మెదిలారు.

ఇక ఆలస్యం చేయలేదు. సుందరానికున్న ఎర్రచొక్కా తీసి తన చేతి కర్రకు కట్టి "రారా" అంటూ మనుమడి చెయ్యి పుచ్చుకుని ఆ జోరు వర్షంతో పరుగు తీశాడు.

కొంత దూరం పరుగెత్తే సరికి కళ్ళు బైర్లుకమ్మాయి. నీరసం తో వళ్ళుతూలుతోంది. అలాగే వళ్ళు బిగువున మరి కొంత దూరం పరుగెత్తాడు. కాని ఇక సాధ్యపడలేదు.

దూరంగా రైలు కూత వినబడుతోంది. తల విదిలించి జవసత్వాలు కూడ దీసుకొని పరుగెత్తాడు.

దాదాపుగా ఆ ప్రాంతానికి చేరుకున్నారు. సుందర్ ముందుకు వెళ్ళి "ఇవిగో తాతా" అంటూ చూపించాడు. పట్టాలు కూడా కాస్తఎడమయ్యాయి.

సత్యం ఇంకాస్త పరుగెడుదామనుకున్నాడు గాని కాళ్ళు స్వాధీనం కాలేదు. చేతిలోని కర్రను సుందరానికి ఇచ్చి "ఈ కాలి బాట వెంట రైలుకు ఎదురు పరిగెత్తరా" అన్నాడు ఒగర్చుకుంటూ

సుందర్ ముఖం వీరావేశంతో వెలిగిపోయింది. క్షణంలో జండా కర్రను పుచ్చుకుని పరుగుతీశాడు.

వాన కురుస్తూనేవుంది. రెండు నిమిషాలకు కాస్త ఆయసం తీరినట్లుంది సత్యానికి. దూరంగా రైలు కనిపించింది. మనుమడు ఏమయి పోతాడోననే ఆదుర్దాతో వేగం గా నడక సాగించాడు

శివకు ఎవరు చెప్పారో గాని పెద్ద జండా పట్టుకోని పరుగెత్తటం మెదలుపెట్టాడు. మరో రెండు నిమిషాలు కూడ గడవక ముందే రైలు కీచుమంటూ ఆగిపోయింది.

సత్యం తేలికగా ఊపిరి పీల్చుకున్నాడు. ఇక అడుగు ముందుకు పడలేదు అక్కడే చతికిల పడిపోయాడు.నీరసంతో కళ్ళు బైర్లు కమ్మగా ప్రక్కకు ఒరిగిపోయాడు.

## బిజీ......బిజీ......!

**కోపూరి పుష్పాదేవి, విజయవాడ**

వేధవటైము.....
భొత్తిగా చాలి చావడం లేదు!
టిఫినుతో రోడ్డు ప్రమాద మృతుల వార్తను
కాఫీతో కాశ్మీరులో టెర్రరిష్టుల హత్యాకాండనూ
ఆదరా బాదరాగా దిగమింగి
ఆఫీసుకు పరుగెత్తు తాం
పని టైములో పాడుకాలాన్ని, పాడు మనుష్యులను
తూర్పార పడతాం
తరువాతి నిమిషం తాపీగా మర్చి పోతాం
కవులు, రచయితలు
మరొక అడుగు ముందుకేసి
అన్ని దురన్యాయాలనూ,
ఘోరాతి ఘోరాలనూ
తమ రచనలలో అందంగా ఖండించి,
జరిగిన అకృత్యాలకు
తమ వంతు సానుభూతిని హృద్యంగా
ఒలికిస్తారు
అంతటితో ఆవిషయాన్ని
అడుగున పడేస్తారు
మరొక కవితా వస్తువుకై
వెతుకు లాడటం లో మునిగి పోతూ.

దూరంగా వస్తున్న శివ అది చూసి గుండెజారిపోయినట్లయింది.

సత్యానికి తెలివి వచ్చేసరికి కంపార్టుమెంటులో వున్నాడు ఎవరో పొడి తుండుతో తన తల తుడుస్తున్నారు. తన వంటికి దుప్పటి చుట్టి వుంది. అందరూ తననే సంభ్రమంగా చూస్తుంటే కాస్త ఇబ్బందిగా కదిలాడు.

"మామయ్యా కాస్త టీ త్రాగండి", కోడలి గొంతు గుర్తుపట్టి ఆశ్చర్యంగా అటుచూశాడు సత్యం. తనతల తుడవటం ఆపి ఫ్లాస్కులో టీ గ్లాసులోకి పోస్తూ, ఆదుర్దా, ఆప్యాయత నిండిన కళ్ళతో లలిత.

"ఏమ్మా నీవు ఈ బండిలో వున్నావా" గాద్గధికం గా సత్యం గొంతు.

"ఈ రోజు కాకపోతే మళ్ళీ నాలుగు రోజులు దాకా మంచి రోజు లేదని ఎవరిమాటా వినకుండ ఉన్నట్లుండి బయలుదేరిందిఅన్నయ్యగారు లలిత తల్లి పసి బిడ్డను తాతగారి వళ్ళో పడుకోబెడుతూ అంది.

అప్పుడే కంపార్టుమెంటు లోకి వచ్చిన శివ సుందర్‌ను ఎత్తుకుంటున్న లలితను, చంటి బిడ్డతో తండ్రిని చూశాడు. నోట మాట రాలేదు.

తన నిర్లక్ష్యం వల్ల ఎంత మంది చనిపోయేవారో తన భార్యా బిడ్డను కూడ తన పొట్టన బెట్టుకునే వాడా! కాళ్ళూ చేతులూ వణుకుతూవుండగా తండ్రి కాళ్ళను చుట్టేసి పసి పిల్లాడిలా బావురుమన్నాడు శివ.

రాజకీయాల్లో శత్రుత్వం ఆశాశ్వతం
మిత్రత్వమూ ఆశాశ్వతమే
పిల్లీ ఎలుకా జిందాబాద్ !!

ఓటుహక్కు వినియోగం
అయిదేళ్ళ ఉజ్వల భవిష్యత్తు
మనది కర్మ సిద్ధాంతం

పార్టీ ధోరణి నచ్చక
నాయకులు ప్రభుత్వపార్టీలో చేరారు
కప్ప బురదలోంచి మురుగుకాలవలోకి దూకింది

రైతులందరకీ ఋణాలివ్వాలని తాఖీదు
హామీలేందే అప్పు ఇవ్వమని బ్యాంకు తీర్మానం
దట్టమైన మేఘాలు కురవకుండా తేలిపోయాయి

వరిచేను కోసారు-కుప్ప వెయ్యడమే తరువాయి
రాత్రి కుంభవృష్టిగా వర్షం
రాత్రి తెల్లవార్లు చదివి పరీక్షహాలులో నిద్రపోయాడు

**"ఉత్తరాషాఢ"**

# నేటిబుద్ధులు - ప్రబుద్ధులు

(కవిత) లంకా పూర్ణయ్యశాస్త్రి విజయవాడ

నేటిబుద్ధులు -ప్రబుద్ధులకు లోనైతే
బిడ్డలపై పెట్టుకొన్న ఆశలు
అడి ఆశలైతే అవి చూసి నేటి సమాజాలు-
- సంఘాలు వెక్కిరిస్తుంటే మనలను
మానవప్రబుద్ధులు చెడుకు దారి
తీస్తుంటే నేటి మానవ హక్కులు
దారి తప్పుతుంటే నీ నిజాయితి
ఎక్కడా? నీ ధర్మము ఎక్కడ? తల్లి
పాలుత్రాగి తల్లినే కాళ్ళతో తన్నే
ప్రబుద్ధులు ఉన్నంతకాలం ఈ
అప్రతిష్టలు తప్పవురా ! ఓ నీతికోవిదుడా !
మరి నీవు సాంఘికవ్యత్యాసాలు రూపు
మాపు అంటూ సభలలో మీటింగ్ లిస్తావా!
ఓ బాయ్‌ఫ్రెండ్ తల్లికి! భార్యకు
గుర్తించని నేటి ఈ సమాజంలోని గాంధీ
సూక్తులు అమ్మ మాటలు తాతయ్యల
గౌరవాలు నేటి సంఘాలకు రుచించవురా!
ఓ! భారతీయసోదరా ! అయ్యో ధర్మం,
నశించి విదేశ వ్యామోహాలు పెరిగిన
నీ ధ్యేయం కాస్త స్వదేశం పై వుంచి నీదేశం
పై వ్యామోహంచూపరా! ముందులే
నడుం బిగించు సంఘాల్లోకి ఎదురునిలువు
ఈ కుళ్ళి కరుడు గట్టిన పై

నీచత్వపు సమా
జాలను పారద్రోలి వీరఛత్రపతి
శివాజీవై ఝాన్సీ రుద్రమ్మదేవివై వీరబాలచంద్రులవలె గద్దెకి
సాంఘికవ్యత్యాసాలను
సామాజికంగా అణచి వేస్తాం మేము
మనము అంటూ అల్లూరి సీతారామరాజు
గారి విప్లవ ఆశా జ్యోతిని వెల్గించుదాం!
ఓ! విప్లవవీరుడా! ఓ! విప్లవమిత్రుడా!
అప్పుడౌతురా! నీధ్యేయం మనధ్యేయం
సాంఘికా వ్యత్యాసాల పై నీ (నా) (మా)
(మన) సామాజిక అణిచి వేతలు అప్పుడే స్వర్ణదేశం
అప్పుడు స్వర్ణదేశం మనదేశం మనదేశంరా!

# పిలుపు

చింతాలక్ష్మి సుజాత, విజయవాడ

ముసిముసి నవ్వుల మాధుర్యం లేదా ఇంట
సారామత్తుల రాజ్యం ఏలుతుందక్కడ
ఆనందపు తళుకుల వెలుగులు లేవా కంట
కల్తీసారాల బడబానలం రగులుతోందక్కడ
కరువు కోరల్లో చిక్కిన అన్నదాత అలమటిస్తున్నా
నీళ్ళ కోసం జనం వెర్రి పరుగులు తీస్తున్నా.
ఆకలి కేకలు .. అసహాయుల రోదనలు..
ఎన్నున్నా.. ఎన్నైనా .. వాడవాడనా వారుణి వాహినుల్లో
మునిగితేలుతున్నారు గద్దెని ఎక్కినవాళ్ళు
కొత్త కొత్త పేర్లతో, కొత్త కొత్త రూపుతో
దూసుకువస్తోంది మద్యం మహమ్మారి
ఇది నింపేది ఖజానాలో సొమ్ములే కాదు...
సమాజంలో శవాల గుట్టలు కూడా
శరీరం స్వేదక్షేత్రమై రోజంతా కష్టించినా
కన్నబిడ్డలకు, కట్టుకున్న భార్యకు
క్షుద్బాధను, వ్యథలను మిగిల్చి
తాము అంకితమైపోతున్నారు మద్యానికి
ఈ నేలపై పుట్టిన ప్రతి వారినీ ఆహ్వానిస్తున్నాను
ముంచెత్తే మద్యానికి అడ్డుకట్టగా మారమని...
ఏరి కోరి తెచ్చుకున్న ప్రభుత్వం నవమాసాలకు అందిస్తోన్న
ఈ కౌరవ సంతతిని తుదముట్టించేందుకు
సంధించబడ్డ అస్త్రాలై వాడిగా రమ్మని...
ఈ గడ్డపై పుట్టిన ప్రతి మనిషికీ పిలుపునిస్తున్నాను...
ఆడపడుచుల పసుపు కుంకుమలను కొల్లగొట్టి
పెట్టి నింపుకుంటున్న ధనపిశాచిని
అగుపడనంత దూరం తరిమికొట్టేందుకు
కాలరుద్రులై కదిలి రమ్మని..
ఇక చాలు... ఒక వంచన
ఇక చాలా... ఒక వేదన
మన నరనరానా పేరుకుంటోన్న ఉదాసీనత
జాతినే తుడిచిపెట్టు వేయి సునామీల పెట్టు
రక్తం రుచి మరిగిన దొంగనక్క వేసుకున్న
కుందేటి ముసుగును తీయాలి
మృత్యుభేరీగా పాడుతోన్న కాలంలో
పోగొట్టుకున్న జీవన సౌందర్యాన్ని
ఇకనైనా వెదికి పట్టుకోవాలి
దుఃఖం పదునెక్కి ప్రకంపనగా మారి
నియోజకవర్గాల వారీగా నిధులు పంచుకొనేవారి
పాదాల క్రింద పెనుకంపం కావాలి
ఒక్కొక్కరు .. ఆత్మస్థైర్యంతో కదిలిననాడు
ఏ లాఠీలు, తూటాలు ఆపలేవు.
ఏ బలప్రయోగాలు ఆపలేవు
సంపూర్ణ మద్యనిషేధం సాధించిననాడు
మనదైన ప్రపంచం స్వాగతిస్తుంది.

# తెలుగునేల - తెలుగుభాష

వి. శ్రీఉమామహేశ్వరి, విజయవాడ.

ఓ తెలుగువాడా
వాడ వాడలా
మేలుకొనర - మేలుకొనర.....
వడలని కుసుమం
మన తెలుగుభాషరా!
తరగని సేద్యం
మన తెలుగు నేలరా!
నిలవాలి - నిలవాలి
ఎప్పటికీ -- విశాలాంధ్రగా
సాగాలి - సాగాలి
ఎన్నటికీ -- సమైక్యాంధ్రగా...
కృష్ణవేణీ సవ్వడులు
గోదావరీ సరాగాలు
పినాకినీ మురిపాలు
త్రివేణి సంగమంలా ఉంటే
రాష్ట్రాభివృద్ధికి సంకేతం
ప్రజానీకానికి రాజభోగం
చంద్రగిరి కోట మనది
భువనగిరి కోట మనది
బొబ్బిలి కోట మనది
ఆ కోటలపై సమైక్యపతాకం ఎగరేద్దాం...
నల్లమల
ఎర్రమల
క్షీరమల అంచుల్లో
అరకులోయ అందాల్లో
కుంతల జలపాత గీతంలో
కిన్నెరసాని అభయారణ్య హొయల్లో
మన తెలుగునేల ఒకటిగా
మన తియ్యనైన తేనెభాష నాలికిస్తు...
రసాలంలా మధురమైన
మన తెలుగుభాషా సౌరభాన్ని ఆస్వాదిస్తు......
సుధాబిందువు లొలికించు
మన తెలుగుభాష రుచిచూపిస్తూ
మన భాష మనుగడకై
మన రాష్ట్ర సమైక్యతకై
కలిసి కలిసి నడుద్దాం
మానవహారం నిర్మిద్దాం
తెలుగుతల్లి
వెలుగు తల్లీ
తెల్లకలువలా వికసించి
తెలుగు మల్లెలా గుబాళించి
తెలుగుజాతి ఔన్నత్యాన్ని చాటి చెప్పి
తెలుగు నేల ఒకటిగా
తెలుగుభాష ఒప్పుగా
వెలుగుతల్లి-- తెలుగుతల్లీ.......

# వికృత చిత్రం

- మందరపు హైమవతి, విజయవాడ.

క్రౌంచ మిధునంలో
జంటనెడబాసినపిట్టలా
ఆమె ఒక సాకార దుఃఖ గీతం
సాధింపులో వేధింపులో
దశాబ్దాల సాహచర్య సూత్రం తెగి
దిగులు కూపంలో పడిపోయినపుడు
పరామర్శల పేరిటకెలికిన
పచ్చి గాయాలు

రెప్పల కింద కన్నీటి
ఉప్పెనలు పొంగుతుంటే
అమ్మవారి విగ్రహాన్ని అలంకరించినట్లు
ఇంతపసుపు పూసి
కుంకుమ వెలత్తి
గాజులు తొడిగి
పూలుపెట్టి
బలివ్వబోయే ముందు
యజ్ఞ పశువులా
ఒక హింసాత్మక దృశ్యం

అటవిక యుగమైనా
ఆధునిక యుగమైనా
మౌలిక సూత్రాలు మారనపుడు
మనువుగతించినా
మగ ధర్మశాస్త్రాలు మారవు
అద్భుత విజయాలను సాధించిన
అణు యుగంలోనూ
ఆచారాల కబంధహస్తాలు
అతివల కంఠాలకురి బిగిస్తూనే వుంటాయి

నూత్న వైధవ్య దుఃఖంలా
అంధకారం అలముకొన్నపుడు
ఒక్కతారా తరుణి ఐనా చూడకుండా
చుట్టూ పరదాలు కట్టిన బండిలో
ఏటి ఒడ్డుకు పయనం

అదిగో వస్తుంది అదిగోవస్తుంది
తలుపులు వేసెయ్యండి
పొరపాటుగా నైనా చూడకండి
తక్షణం విధవలైపోతారు జాగ్రత్త

ఆడవాళ్ళకి ప్రాణం కన్నా
సుమంగళీత్వమే మిన్న

ఎంత కన్నీటి సుడిగుండంలో
మునిగి పోతున్నా
చెవుల్లో లీలగా వినబడుతున్న
మాటలు కొరడాదెబ్బల్లా
మనసుపై వాతలు పెడుతుంటే
ఇంకా బతికున్న గుండెలు
బండలుగా మారినపుడు
నరకం ఎక్కడో లేదనే భావన

ప్రాణంలో ప్రాణంగా
ప్రేమించిన కూతుళ్ళైనా
కష్టసుఖాల్లో పాలుపంచుకొనే
తోడబుట్టిన వారైనా
పక్కలో పామును చూచి బెదరినవైనం

చూపు సోకిన పాపానికే
నుదుటి బొట్టు
తుడిచి పెట్టుకుపోతుందనే భయంతో
వెలివేసినట్లు దూరంగా తప్పకొంటుంటే
పక్కింటికిక్కూడా ఒక్కతే వెళ్ళలేని ఆమె
మూడువైపులా
మూసుకుపోయిన గదిలో
పొద్దుటి నుంచి కనీసం
వాయుదేవుడు కూడా తోడులేని
ఒక్కొక్క క్షణం
ఉరి కొయ్యలా బిగుసుకు పోతుంటే
అనుభవించిన క్షోభకు
ఏ చిత్రగుప్తుడు లెక్కలు కట్టలేడు

సతీధర్మం నెరవేర్చినందుకే
మనసు ఒక క్షణం స్పందించినందుకే
శిలలుగా చేసి
శిరస్సులు ఖండించే
ద్వంద్వనీతుల సంఘంలో
స్త్రీ గా పుట్టిన నేరానికి
కిటికీలు తలుపులు లేని

చీకటి కొట్లో బంధించి
జూలో జంతువును చూచినట్లో
మ్యూజియంలో వింతవస్తువును పంకించినట్లో
ఒక్కొక్కరు చూసి వెళ్తుంటే
కొయ్య దుంగ మీద మాంసాన్ని కొడుతున్నట్లు
మనసుని ముక్కలు ముక్కలు చేసే
పైశాచికానందం

భార్య గతించిన చితాగ్ని సాక్షిగా
మరోసారి నూత్న వరుడు పురుషుడు
భర్త మరణిస్తే మాత్రం
ముఖం మీద బొట్టు చెరిపేసి
సకలసౌభాగ్యాలు హరించి
ఆనందం ఇంద్రధనుస్సు విరిచేసి
అమంగళ చిహ్నాన్ని ముద్రిస్తారు.

రోజూ చూచే ఆమెనైనా
ఆనాడు చూడ గూడదనే
నిషిద్ధఘడియలు గుడలించాక
గుండె దిటవు చేసికొని
గుమ్మంలోనికి తొంగి చూస్తే
తెల్లచీర తెల్ల జాకెట్
తెల్ల బొట్టుతో
మతంగీసిన వికృత చిత్రం
ఆమెను చూడగానే
విమూఢనై నేను

## పచ్చని స్పర్శ

**కృష్ణ కృష్ణ, హైదరాబాద్**

గం డిపడ్డ ఆకాశం
నిలువెల్లా వణికిస్తున్నా
గెండెల్లో గువ్వలకి
వెచ్చని ఊసులు చెప్తూ....

మండిపడ్డ ఆకాశం
నిప్పులు కురిపిస్తున్నా
ఊయల్లో చిన్నారి
ముంగుర్లని చల్లగాసవిరిస్తూ...

## దీపదర్శనం

**డా॥ మంగళగిరి ప్రమీలాదేవి.**

ఎంతవెలుగు ఈ దీపానిది!
ఏమి వెలుగు ఈ దీపానిది!
నా కోసమేనా
ఇంత వెలుగును తెచ్చి నింపింది ఈ దీపం !
నా కళ్ల వాకిళ్లనిండా
ఎదద లోగిళ్ల నిండా
ఎంతెంత వెలుగునింపి పోయింది!
ఎంత పురాతత్వం
మరెంత పరాతత్వం ఈ దీపానిది!
ఎంతేసి వెలుగు నాలుగు దిశలా
ఎగజిమ్ముతోంది
ఎంత సమతను
వాకలుగా ప్రసరిస్తోంది
ఇన్నాళ్లుగా ఈ సందేశాన్ని నేను
ఎందుకు స్వీకరించలేక పోయాను?
తనలో రగిలిన వెలుగుల్ని
దాచుకొందా?
ఎంత ఆత్మవిశ్వాసం ఈ దీపానిది!
యుగ యుగాలుగా ప్రసరిస్తున్నదే
ఈ జ్యోతి !
కాని నా కెక్కడిదీ పరిగ్రహించే సుమతి ?
యుగ యుగాలుగా వెలుగుతోంది ఈ దీపం ?
అశోకుడు నాటించిన వృక్షాలు కొమ్మల గుబురుల మధ్య
దమ్మ సూత్రాలుగా
శరణు ఘోషగాత్రాలుగా
వెలిగించిందీ, వినిపించిందీ
ఈ దీపం కాదూ !
అగ్బరు దీన్ ఇలాహి చర్చల్లో
ఇదా దతో ఖానా మణిమందిరపు చలువ కాంతుల్లో
విరివిగా వెలిగింది ఈ జ్యోతేనేమో !
జాతి పిత బోసినవ్వుల పువ్వుల్లో
కమ్మగా కలిసి
తానే ఒక అహింసా విప్లవమై
జాజ్వల్య మైనదీ ఈ దీపమే.
ఇన్నియుగాలుగా వెలుగుతున్న
ఈ జ్యోతి నెందుకు కొలుచుకోలేక పోయాను ?
నాలో అంతర్ద్వం ద్వం ఆవరించుకొన్నపుడు
అసలు నాకై నేను
దీపాన్ని కాదలుచుకొన్నప్పుడు
దీపాన్ని దర్శింపక పోను
ఆ శక్తిని ప్రసాదించమని వేడుకొనే
తల్లి కిరణం ప్రసరించిన ఒక కిరణ పుత్రికగా !

# కారుదొంగ

మల్లాది వెం. కృష్ణమూర్తి

**క** రీంనగర్‌కి చెందిన రవివర్మ కార్ల దొంగతంలో ఆరితేరాడు. అతని పధ్నాలుగో ఏటనే కారుమెకానిక్‌గా పనిలోపెట్టాడు తండ్రి. ఏడేళ్ళలో కార్ల మెకానిజం పూర్తిగా నేర్చుకుని అందులో నిష్ణాతుడవడమే కాక, కారు డ్రైవింగ్ కూడా నేర్చుకున్నాడు.

కార్లని దొంగిలించి వాటిలోని ఖరీదైన భాగాలని అమ్ముకోవడం అలవడ్డాక హైద్రాబాద్ నగరానికి వచ్చి ఆ పనినే వృత్తిగా స్వీకరించాడు. గత నాలుగేళ్ళలో ఒక్కసారి కూడా పట్టుబడకుండా అనేక కార్లని దొంగిలించాడు.

**జాతీయ తెలుగు రచయితల మహాసభ ప్రత్యేక సంచిక కోసం**
**శ్రీ మల్లాది ప్రత్యేక రచన.**

ఓ రోజు నగరంలోని బిజీ సెంటర్‌లో కాపేసాడు. ఓ యువతి మరో ఇద్దరు స్త్రీలతో కలసి ఏక్సెంట్ కారులో వచ్చి దాన్ని ఓ ఖరీదైన చీరలదుకాణం బయట ఆపింది కారుకి తాళం వేసి ఆ దుకాణంలోకి వెళ్ళింది. ఆడవాళ్ళు చీరల దుకాణంలోకి వెళ్తే గంటలోగా బయటకి రారని రవివర్మకి అనుభవపూర్వకంగా తెలుసు. ఓ అయిదారు నిముషాలాగి ఆ కారు దగ్గరకి వెళ్ళాడు. తను ఆ కారు డ్రైవర్ అని ఆ వాచ్‌మేన్ అనుకోవాలని జేబులోంచి బట్టతీసి కారు ముందు భాగాన్ని శుభ్రంగా తుడిచాడు.

తర్వాత మారుతాళం చెవితో కారు తలుపు లాఘవంగా తెరచి డ్రైవింగ్ సీట్లో కూర్చున్నాడు. అదే తాళాన్ని ఇగ్నిషన్ కీ గా ఉపయోగించి కారుని స్టార్ట్ చేసి రివర్స్‌లో బయటకి తీసాడు. క్షణాల్లో అతని కారు ఆ బట్టల దుకాణం నించి దూరంగా కాసాగింది.

పావుగంట తర్వాత దాన్ని ఓ కాలనీలోని ఓ చిన్న డెడ్‌ఎండ్ రోడ్డులో ఆపాడు. ఆ కారులో విలువైనవి ఏమన్నాఉన్నయా అని వెదికాడు రవివర్మ. వెనక సీట్లో సెల్ ఫోన్, ఓ బ్రీఫ్‌కేస్ కనిపించాయి. సెల్ ఫోన్‌ని ఓ అయిదారు వేలకి అమ్మచ్చనుకున్నాడు. బ్రీఫ్‌కాస్‌ని తెరిచి చూసే అందులో కొన్ని టైప్‌డ్ కాగితాలు కనిపించాయి. అవి ఇన్‌కమ్‌టాక్స్ రిటరన్స్ అని గుర్తించాడు రవివర్మ. ఆ కారు ఓ చార్టర్డ్ అకౌంటెంట్‌దని కూడా విజిటింగ్‌కార్డులను బట్టి గ్రహించాడు. కారు డిక్కీలో వున్న టూల్ బాక్స్‌ని బయటికి తీసాడు. డిక్కీడోర్ మూస్తుండగా కారు లోంచి వందేమాతరం ట్యూన్ వినిపించింది. సెల్‌ఫోన్ అందుకోని ఆన్ చేసి చెప్పాడు.

"హలో"

"కృష్ణ కిషోర్‌గారేనా? అడిగిందో మగ కంఠం

"అవును." అతన్ని ఆటపట్టించాలని అబద్ధం చెప్పాడు ఉత్సాహంగా ఉన్న రవివర్మ

"ఇన్‌కంటాక్స్ కట్టాల్సిన లక్షా ఆరువేల రూపాయలు సిద్ధంచేసాను.

వెంటనే మీరు ఆ డబ్బు తీసుకోవచ్చు "ఉర్దూలో వినిపించిందా కంఠం.

"ఎవరు మాట్లాడేది?" ఉత్సాహంగా అడిగాడు రవివర్మ ఉర్దూలో స్కూల్లో అతని సెకండ్ లాంగ్వేజ్ ఉర్దూనే.

"అబ్దుల్‌ని. నా ఇన్‌కంటేక్స్ కట్టడానికి ఇవాళ ఆఖరి రోజు కదా, అందుకని కేష్ కట్టేద్దామనుకున్నాను. టాక్స్ చలాన్ మీద నేను సంతకం చేసి, మీరు చెప్పినట్లుగా వందన సిస్టర్స్ బట్టలదుకాణం కాడ మీ ఆవిడకుఇస్తాను. సరేనా?

వెంటనే రవివర్మకి తనుకారులో చూసిన ఆ బ్రీఫ్ కేస్ లోని కాగితాలు గుర్తుకొచ్చాయి. ఆ డబ్బుని తనే సంపాదించాలనుకున్నాడు.

"చిన్న ఛేంజ్. మీరు రామకృష్ణాపురం లోని నా ఆఫీసుకు వచ్చి సంతకాలు చేయచ్చు కాగితాలు నా దగ్గరే వున్నాయి.

"రామకృష్ణాపురమా? అదేమిటి? బ్యాంక్‌టైమైపోతోందిగా. చిరుకోపం ధ్వనించిందాకంఠంలో

"పోనీ ఓ పని చేయండి. నా డ్రైవర్‌కి కారిచ్చి పంపుతాను. అతనికివ్వండి".

"అలావద్దు గన్‌ఫౌండ్రీలో ఎస్.బి.హెచ్ దగ్గరకు ఆ కాగితాలతో అతన్ని పంపండి. నేను సంతకాలు చేసి ఎయిర్‌పోర్ట్‌కి వెళ్ళిపోతాను. ఈ మార్పువల్ల నాటైం చాలా వృధా అవుతుంది. ఎయిర్‌పోర్ట్‌కు వెళ్ళాలని చెప్పాగా. సర్లేండి బోర్డింగ్‌పాస్ తీసుకోవడానికి ఎవర్నయిన పంపుతాను" నిష్ఠూరంగా చెప్పాడతను.

"సరే" తన పంట పండిందనుకున్నాడు రవివర్మ. బ్రీఫ్‌కేసు లోని కాగితాలు చెక్ చేసాడు. అబ్దుల్ అనే బీడీలవ్యాపారి సబ్‌మిట్ చేయ్యాల్సిన ఇన్‌కమ్‌టాక్స్ రిటర్న్ అని. అతను కట్టాల్సిన టేక్స్ లక్షా ఆరువేలని ఆ కాగితాల్లో టైప్ చేసివుండడం గుర్తించాడు రవివర్మ

హుషారుగా గన్‌ఫౌండ్రిలోని ఎస్.బి.హెచ్. దగ్గరకు చేరుకున్నాడు. అతను కారులోంచి దిగ్గానే మఫ్టీలో వున్న ఇద్దరు కానిస్టేబుల్స్ అతన్ని పట్టుకున్నారు. ఏంజరుగుతుందో అర్ధమయేలోగానే అతన్ని పోలీస్‌వ్యాన్ ఎక్కించారు

"ఏమిటిది?" అడిగాడు రవివర్మ ఆశ్చర్యంగా

"ఈ కారులో తన సెల్‌ఫోన్ మర్చిపోయినావిడ దానికోసం వెంటనే బయటకు వస్తే కారు దొంగిలింపబడిందని తెలిసింది. వెంటనే మాకు ఫిర్యాదు చేసింది. కారులో ఏమున్నాయో అడిగితెలుసుకున్నాం. సెల్‌ఫోన్‌ని ఉపయోగించే నిన్ను పట్టుకున్నాం. మా పథకం ఎలా వుంది" నవ్వుతూ అడిగాడు ఎస్ఐ

తనతో సెల్‌ఫోన్‌లో మాట్లాడిన ఆ కంఠాన్ని గుర్తుపట్టాడు రవివర్మ.

# పేరంటము

కీ॥ శే॥ ముట్నూరి కృష్ణారావు

కాళ్ళ గజ్జెలు, అందియలు గల్లుగల్లున మ్రోయ, పరికిణీ అంచులు నేలజీరాడ, ముద్దులొల్కు మోముతో, తీయదనాలు వెదజల్లు పాటలతో, పరుగు పరుగున వచ్చిన ఈ చిన్నికన్నె యెవరు? తప్పటడుగులు, తొక్కుపల్కులు ఇప్పుడిప్పుడే చాలించి, పేరంటానికి బయలుదేరే యీడు వచ్చిన ఈ కన్నె ముత్తైదువ మా బందరు పౌరుల పిలుపుకు సంబరపడి దీవెనలనందుకొన ఏ తెంచినది. నవసాహిత్య పరిషత్తుకు బాలారిష్టాలు గడచి ఆరేండ్లు నిండినవి. తెలుగునాడు నాలుగు మూలల జన ముద్దుగ తిరిగి, ఫలాని పిల్ల కావద్దా అనిపించుకొని, మాట, మన్నన, నడక, నాగరికత నేర్చుకొని పేరంటమునకు వచ్చిన ఈ పడుచుకు, సాహితీ ప్రియులు, రసజ్ఞులు, కవిబాంధవులు నిండోలగమున దీర్చియుండ, మా బందరు పౌరులు వేడుకతీర పసుపు కుంకుమ లిచ్చి, కానుక లొసగి, అచిరకాలములో నీ కన్నె పట్టమహిషి యగుగాక యని దీవించెదరు కాక!

బందరు చరిత్ర ప్రసిద్ధమైన పురాతన పట్టణము. ఒక కాలమున ఆంధ్రదేశపు వర్తకమున కంతటికి కూడలైన ఓడరేవిది. గోలకొండ నవాబుల కిది సుబా. ఇచ్చటి కలంకారి కళాకౌశము ప్రపంచమందంతట పేరు మ్రోసినది. అనాదిగ నున్న భారతీయ సంస్కృతికి ఇస్లామిక సంస్కారము చిన్నెవన్నెలు పెట్టుటయే కాక, తెలుగు దేశమున కెల్ల మొట్టమొదట అంగ్రీజు కాలేజి యిక్కడనే వెలయుటచే ముప్పిరైన ఒక నవ్యసంస్కారము ఇచ్చట ప్రారంభమైనది. కాని పాశ్చాత్య సంస్కార వ్యామోహము పైచేయి కాకుండ, ధారావాహికముగ వచ్చుచుండిన భారతీయసంస్కార స్రవంతిని రక్షించుకొను జాగరూకత కూడ నిచటివారికి అప్పుడే కలిగినది. కాని వెంటనే సంతోషించు అల్పసంతుష్టిలేదిక్కడ? ఏ విద్యనైనను ఇచ్చట గీటు రాతిమీద ఒరిసి పరీక్షించు కఠిన విమర్శకులు మా బందరు పౌరులు. ప్రతిదానికి పెదవి విరచుట వారికి మామూలై పోయినది. భక్తి విశ్వాసాలకంటే మా పట్టణానికి బుద్ధి పాలెక్కువ. తెలుగు దేశపు రుచుల కన్నిటికి బందరు తనదే మేలుబంతి యని గర్వించుకొనును. ఇక్కడ నెగ్గిన ప్రపంచములో నెక్కడను తిరుగుండదు. బందరు ముద్రకు అట్టి చలామణి కలదు.

వెనుకటి కాలములో శ్రీనాథకవిదీ బందరు దగ్గర నున్న కల్పటమే కాపరమని చెప్పెదరు. తరవాత ఆంధ్ర నాయక శతకము చెప్పిన కాసుల పురుషోత్తముడు ఈ ప్రాంతస్థుడే. దక్షిణా పథమందంతట పేర్పడిన క్షేత్రయ్య నారాయణ తీర్థులు ఈ గడ్డలో బుట్టి పెరిగినవారే. పదకవిత్వములో వాసిగన్న వీర రాఘవ కవికి మా దేవర కోట సంస్థానము ఆశ్రయము. భరతవిద్యా పారంగతులైన కూచిపూడి భాగవతులీ సంస్థానము వారి యాదరణల పోషణకిందనే వర్ధిల్లుచుండిరి. నూజివీటి అప్పరాయల నాశ్రయించిన కవి పండితులందరీ కృష్ణా తీర్థ వాసులు. ఇచ్చటి కళాశాలల మూలమున కోరాడవారు, వేదాలవారు, కాశీనాధునివారు మొదలైన విద్వత్కవులెందరో సంస్కృతాంధ్ర వాఙ్మయములకు పట్టము గట్టిరి. తెలుగు వచన నాటకములాడు నాట్యరంగము లిచ్చుట చాల వెలసినవి. నాదెళ్ళ పురుషోత్తమ కవివర్యుడిచ్చట కవిత్వాది కళల కుత్తేజనము గల్పించెను. గరికిపర్తి కోటయ్య దేవరగా రిచటి వారికే కాక, తెలుగు వారందరకు గాన రసజ్ఞత గల్పించినారు. వాగ్గేయ కారకులైన హరినాగభూషణం గారు బందరు సంగీత గౌరవాన్ని నేటికిని దశదిశల వెదజల్లుచున్నారు. కీర్తిశేషులైన కోపల్లి హనుమంతరాయలు ఆంధ్రజాతీయ ప్రతిభకు నిదర్శనముగ నొక కళామందిరమును నిర్మించి చరితార్థులైన పుణ్యక్షేత్రమిది.

శ్రీ శతావధాని వెంకటశాస్త్రులువారు పదమూడు సంవత్సరాలు మా అదృష్టమువల్ల ఇచ్చట ఉండుట తటస్థించినది. అవల రాజమహేంద్రవరాన్నుంచి వీరేశలింగం పంతులు విశ్వతోముఖమైన గద్య ప్రవాహాన్ని పారించి ఆంధ్రజాతికి క్రొత్త ప్రాణము పోయుచుండ, వెంకటకవి యిచ్చట నుండి అనర్గళమైన - పద్య ప్రవాహము వెల్లివిరియించిరి. నశించిపోయిన కవి గౌరవాన్ని తిరిగి ప్రతిష్ఠించి పూర్వకవుల గాథలు జ్ఞప్తికి తెచ్చినారు. కవిత్వానికి నిఘంటువులు నల్లించ నక్కరలేదని, సులభము సుపరిచితము అయిన శబ్దజాలము చేతనే భారతాదులలోవలె ఉదాత్తత చెడకుండ ప్రసన్న గంభీరమైన కావ్యసృష్టి చేయవచ్చునని నిరూపించినారు. శిష్ట వ్యవహారమునకు సన్నిహితముగ నుండు భాషనే వారు గ్రహించి స్వభావోక్తి సుందరములు, లోకానుసారులు అయిన కవితా మార్గములు చూపించారు. కేవల పండితులకు ఆట పట్లయిన రాజాస్థానాలను ముట్టడించి కవితా సరస్వతికి రాజులచే పల్లకీ లెత్తించినారు. ఆ మహోత్సవములో పామరులకు కూడ పాలు పంచి యిచ్చినారు. తెలుగు దేశము నాలుగు మూలల సంచరించి అపూర్వమైన పద్య పఠనా ధోరణిచేత ప్రజలను సమ్మోహింపజేసి, కవిత్వమనిన చెవులు కోసుకొనేటట్టు చేసినారు. వారి నిరంకుశచర్యలు, వారనుభవించిన వైభవము, కవితా వృత్తికి గౌరవము కలిగించినవి.

ఇదంతయు బందరు బడాయిని చెప్పుటకొరకు కాదు. నవ్య సాహితీ పోషణకొరకు బందరులో జరిగిన కృషిని ఒక మారు జ్ఞాపకము చేసుకొనుట అవసరము. ఆంగ్ల సాహిత్య పరిచయముచేత, యుగ ధర్మముచేత బయలుదేరిన ఉత్సాహము కవిత్వరూపమున బయలుదేరుటకు కారణమైన ఉద్బోధమేకాక క్రొత్త భావాలను ధారాళముగ చెప్పుకొనుటకు ఉచితమైన భాషను కూడ వెంకట కవి గారు సమకూర్చి పెట్టిరి. పాత రసాలనుండి తప్పించి కవితా రథమును కొత్తబాటలను నడుపుటకు, అవసరమైన సాహసాన్ని ధీరత్వాన్ని వారు ప్రసాదించినారు. నవ కవుల గ్రంథాలను చదివి ఆనందించుటకు క్రొత్త రసిక లోకాన్ని గూడ సమకూర్చి పెట్టిరి. ఆ కవికుల గురువు సంచారముచేత చవిటి పల్లులు బందరు బృందావనమై పోయినది. నేడిచటికి చేరిన కవి కోకిలలను కవి భృంగములను ఈ బృందావనము సాదరముగా సగౌరవముగ సన్నేహముగ స్వాగత మడుగుచున్నది.

సర్వజనసేవ్యమై యిట్లు సులభదర్శినయైన భాషాదేవికి అప్పరాయకవి ముత్యాల సరములు గ్రుచ్చి కాన్కలు పెట్టినాడు. హృదయమును జీల్చుకొని వెడలు క్రొత్త పాటలతో మంగళగానము చేసినాడు. ప్రాతబడిపోయిన దేశీయ కవితలకు తిరిగి గుళ్ళు గోపురములు కట్టినాడు. క్రొత్త క్రొత్త భావములను కండగల తేట తెలుగు మాటలతో పొదివినాడు. గ్రంధాల చెర తప్పించి కవిత్వానికి ఆబాలగోపాలము నోళ్ళే యిల్లు చేసినాడు. హృదయాన్ని రంజింపచేసి చమత్కారము కలగించుటయే ప్రయోజనముగా నుండెడి కవిత్వాన్ని జాతి ప్రబోధానికి, వికాసానికి సాధనము చేసినాడు.

అప్పరాయ కవితో పాటు ఉత్తరాంధ్రమున ఇంకొక మహాశక్తి నవ్య సాహిత్య లతకు అనుకూల వాతమైపుట్టి వీచనారంభించినది. భాషాదేవి గుడి చుట్టును పండితులు ఎత్తుగా పెట్టిన గోడలు దాని ధాకకు కూల నారంభించినవి. భాషాదేవి గుడి గుడియలు వీడిపోయి తలుపులు తెరచికొన్నవి. అంక్షలు తొలగిపోయినవి వాత్సల్యపూర్ణమగు ఆ తల్లి అంకమున పామరులకు గూడ చోటు దొరికినది. తన ఉత్తర వయస్సంతయు ధారపోసి యీ మహా కార్యములను సాధించిన భాషా గాంధి రామమూర్తి పంతులు తన కనుల యెదుట నవ నవ లాడుచు క్షణ క్షణము ఏపుగ ఎదిగి వచ్చుచు కొనలు సాగుచున్న భాషాలతను చూచుచు మురిసిపోవుటను నేడు కనులపండువుగ చూచు చున్నాము.

ఈ మహామహుల కృసివల్ల కవిత్వానికి రాజాశ్రయముగూడ పోయి ప్రజలే ఏడుగడలైనారు. కవులకింక ప్రజారాధనమే పని. పూర్వకవులు రాజారాధన చేసిరని మన మనుకొనుటయేకాని నిజానికి వారును ప్రజారాధనమే చేసినారు. ఆ ప్రజ రసిక ప్రజ. ఆ రసిక లోకానికి రాజాస్థానములే ఆకరముగ నుండెడివి. అందువల్ల కవిత్వము చమత్కరకారియై వినోదప్రాయమై ఊరుకున్నది. ఈ దోషము ఆ రాజులకు గాని కవులకు గాని అంటగట్టుట కంటె అది, ఆ కాల ధర్మమని భావించుట న్యాయమేమో ! ప్రజా తంత్రమునకు పట్టము కట్టుచున్న ఈ రోజులలో సాహితీపరులు ప్రజారాధన చేయిట న్యాయమే గాని అది నెపముగ సాహిత్య సౌధము ఎత్తు తగ్గించి క్రమముగ నేలబట్టము చేయవలసిన వచ్చునేమో ఆలోచించవలయును. కవులు క్రిందకి దిగట కంటె ప్రజలను పై కెత్తుటలోనే విశేషమున్నది. కవులు ఏ గాలికి ఆ తెర పట్టరు. ప్రజలకు చేయిఅందిచ్చి వారి హృదయాన్ని సంస్కరించి ఆనంద పర్యాయమైన రసమును సాధించుటయే వారి కర్తవ్యము.

ఆ భారము నేడు సాహితీ ప్రియులమీద బడినది. వారు కథలు చెప్పుదురో, కళ్యాణములు చేయుదురో, పాటలు పాడుదురో, నాటకములు రచించెదరో, వారి యిష్టము. ప్రజల హృదయ కవాటములు దెరుచుకొని వారి కొరకు వేచియున్నవి. వానిని సంస్కరించి సౌందర్య బోధము కల్గించి లోకయాత్రను రసమయముగ చేయుట వారి ధర్మము. సినీమాలు మొదలైన కొత్త సాధనములు అందుబాటులోనికి వచ్చినవి. శృంగార గ్రంధములపై ఆంక్షలు తొలగింపుడని అడుగుచున్నాము. ప్రభుత్వము ఇంకను ఏ కారణముచే ఉపేక్షచేయుచున్నదో తెలియదు గాని నేడో రేపో ఈ యడ్డంకులు

# కొన్ని హైకూలు

మూలా సుబ్రహ్మణ్యం, బెంగుళూరు

కొన్ని సీతాకోకచిలుకలు
నా కంట్లో వాలాయి
ఆమె నవ్వుతోంది

తాకనా వద్దా అని
అడుగుతోంది
చిరుగాలి

నీరెండలో
ఎంత స్వచ్ఛం
ఏటిలో కాళ్ళు

గడ్డిలో
ఏదో వెతుక్కుంటూ
ఉడుత

లోతులేని
చెరువులో
ఈతెలా కొట్టడం?

పూ రెక్కలపై
మంచుని తడిమాను
నువ్వు గుర్తొచ్చావు

అక్కడ ఎవరైనా
చిన్నపిల్లలే
కిటికీ పక్కసీటు

ఏ దేవత
కన్నీటి బొట్టో
ఈ మంచు బిందువు

కారు అద్దాలపై మంచు
చూపుడు వేలుతో
నీ పేరే రాసాను

సూర్యకిరణం
చిలిపి కబురు
పువ్వు నవ్వుతోంది

శిశిరాన్ని
వెళ్ళగొడుతోంది
చిన్ని మొలక

తీరకతప్పదు. కావున మంచికిగాని చెడ్డకుగాని ఎంతైన అవకాశము సిద్ధముగనున్నది. సర్వవిధములైన దాస్యములతో మునిగియున్న మనజాతికి జీవితపరమార్థమును తెలియజెప్పి తరింపజేయగల భారము నవ్యసాహిత్య పరిషత్తుది.

మొదటి నుండియు సాహిత్య విషయములో కృసి చేయుచు యువకులలో యువకులు పెద్దలలో పెద్దలుగా సంచరించుచున్న పూజ్యులు శ్రీ డాక్టరు బుర్రా శేషగిరిరావు పంతులుగారు ఈ సభాకలాపమును నిర్వహించుటకు పూనుకొనుట సంతోషము, భావులకు, ఉత్సాహశీలురు, మనకెల్ల మాన్యులు అయిన శ్రీ గోపాల రెడ్డిగారు ఈ సభకు మంగళాచరణము చేయుట మన భాగ్యము. వారు అమాత్యులేకాక స్వయం కవులై యుండుటవల్ల సాహిత్యానికి సాచివ్యము జేయగలరు. రాజ్యాంగమును రసవంతము చేయగలరు.

ఈ రెండు నాళ్ళు ఈ సదస్యమున కేతెంచిన సాహిత్యోపాసకు లెల్లరు కావ్యగోష్ఠితో, ఆటపాటలలో, సత్కాలక్షేపములలో తెలుగు నాటి రుచులను గ్రోలుచు, పేరంటమునకు వచ్చిన ఈ నవ్య సాహిత్య కన్యను సాదరముగ దీవించి పంపెదరు గాక!

ప్రధాన వ్యాసము, కృష్ణాపత్రిక

12-2-38 నుండి పునర్ముద్రితం




## సృష్టి అందం

(ఆమ్రపాలి) శ్రీమతి నోరి విజయ, అమెరికా

అందమంటే ఏమిటి?
ఆనందమంటే ఏమిటి?
అనుభూతి అంటే ఏమిటి?
అనే ప్రశ్నలు ఎన్నో సార్లు వేసుకున్నా
కాని సాగరములో వేసిన ఏ వస్తువయినా
యధావిధిగా ఒడ్డు కే కొట్టుకు వచ్చినట్లు
నా ప్రశ్నలు నాకే ఎదురొస్తున్నాయి
ఈ సృష్టిలో ఎన్నో చూశా
ఎగిసే భానుడి వెలుగు చూసా
విరిసే పువ్వుల సొగసు చూసా
కురిసే చినుకుల కులుకు చూసా
మెరిసే తారల తళుకు చూసా
పారే ఏరుల పరుగు చూసా
ఎగిరే కొంగల బారులు చూసా
నిశ్చలమైన కొలనులు చూసా
పచ్చపచ్చని చేలను చూసా
మంచు కప్పిన గిరులను చూసా
గాలికి ఊగే తరులను చూసా
చల్లని తెల్లని వెన్నెల చూసా
అస్తమించు సూర్యుని అందం చూసా
చెంగున ఎగిరే జింకను చూసా
పసిపాపల కేరింతను చూసా
కన్నుల ద్వారం దాటుకొని ఈ దృశ్యాలు
గుండె తలుపులను సున్నితముగా తడుతూ
నిదురించిన తలపులను
చిత్రముగా జాగృతం చేస్తున్నాయే
పరమాత్మ సందేశాన్ని
మౌనముగా నాకందిస్తున్నాయే
ఆచేతన హృదయాన్ని తాకి
ఆనందం గా ప్రతిధ్వనిస్తున్నాయే
సృష్టికర్త కళానైపుణ్యాన్ని
ప్రతిబింబిస్తున్నాయే
ఇదేనా అందమంటే?
ఈ భావనేనా ఆనందమంటే?
ఇదేనా అనుభూతంటే?
సృష్టి ఇంత అందముగా ఉంటే
ఇంత ఆనందాన్నిస్తే
దీన్ని సృష్టించిన సృష్టికర్త
ఎంత ఆనందాన్నిస్తాడో
తెలుసుకోవాలని ఆత్మ ఆత్రముగా
ఆరాటపడుతోంది అత్యాశపడుతోంది

## కృష్ణాజిల్లా రచయితల సంఘం (రిజిష్టర్డ్)

### జీవిత సభ్యులు

1. **శ్రీ మండలి బుద్ధప్రసాద్**, అవనిగడ్డ
2. **శ్రీ కాలనాథభట్ట వీరభద్రశాస్త్రి**, విజయవాడ
3. **డా॥ మాదిరాజు రామలింగేశ్వరరావు**, మచిలీపట్నం
4. **డా॥ ద్వానాశాస్త్రి**, హైదరాబాదు
5. **శ్రీ పువ్వాడ తిక్కన సోమయాజి**, బెంగుళూరు
6. **శ్రీ సోమంచి రామం**, మచిలీపట్నం
7. **శ్రీ గుత్తికొండ సుబ్బారావు**, మచిలీపట్నం
8. **డా॥ జి.వి. పూర్ణచంద్**, విజయవాడ
9. **శ్రీ తాతా రమేష్‌బాబు**, గుడివాడ
10. **డా॥ వేదాంతం రామకృష్ణమాచార్య**, విజయవాడ
11. **శ్రీ చింతపల్లి వెంకట నారాయణ**, కైకలూరు
12. **శ్రీ పి. ఎస్. ఎస్. ఆర్. ఆంజనేయులు**, మచిలీపట్నం
13. **శ్రీ మాకర్ల ఆంజనేయులు**, మచిలీపట్నం
14. **శ్రీ గేరా జీవరత్నం**, మచిలీపట్నం
15. **శ్రీ టి.యల్. ఆర్. ప్రసాదరావు**, మచిలీపట్నం
16. **శ్రీ చక్కా పాండురంగారావు**, గుడివాడ
17. **శ్రీమతి చలసాని వసుమతి**, విజయవాడ
18. **శ్రీమతి కోగంటి విజయలక్ష్మి**, గుడివాడ
19. **శ్రీమతి ఎమ్. ఎన్. రాజకుమారి**, మచిలీపట్నం
20. **డా॥ సిహెచ్. కళావతి**, గుంటూరు
21. **శ్రీమతి కోపూరి పుష్పాదేవి**, విజయవాడ
22. **శ్రీమతి కోకా విమలకుమారి**, విజయవాడ
23. **శ్రీమతి రావిపాటి ఇందిరామోహనదాస్**, గుంటూరు
24. **శ్రీమతి కాట్రగడ్డ రజని**, గుడివాడ
25. **శ్రీమతి ఎన్. పూజిత**, నెల్లూరు
26. **శ్రీమతి కోవిల**, విశాఖపట్నం
27. **శ్రీమతి కాపాలక్ష్మి**, విజయవాడ
28. **శ్రీమతి వడ్డాది లక్ష్మీసుభద్ర**, విజయవాడ
29. **శ్రీమతి భమిడిపాటి బాలాత్రిపుర సుందరి**, విజయవాడ
30. **శ్రీమతి తుర్లపాటి రాజేశ్వరి**, బరంపురం
31. **శ్రీమతి చాపరాల సరళాతిలక్**, గుడివాడ
32. **శ్రీమతి కోనేరు కల్పన**, విజయవాడ
33. **శ్రీ చిత్తజల్లు ప్రభాకరరావు**, మచిలీపట్నం
34. **కుమారి నందిని నల్లఘట్ల**, విజయవాడ
35. **శ్రీ విడియాల చక్రవర్తి**, మచిలీపట్నం
36. **శ్రీ కె. శివరామకుమార్**, మచిలీపట్నం
37. **శ్రీ చలమలశెట్టి కోటేశ్వరరావు**, మచిలీపట్నం
38. **శ్రీ విహారి**, హైదరాబాద్
39. **శ్రీ ఎ. వి. ఎస్. ఆర్. ఆంజనేయులు**, విజయవాడ
40. **డా॥ జి. రెజీనా**, విజయవాడ
41. **శ్రీ వంగర రంగ భాస్కరరావు**, విజయవాడ
42. **శ్రీమతి వి. శ్రీఉమామహేశ్వరి**, విజయవాడ
43. **శ్రీమతి వి. యుగంధరాదేవి**, మచిలీపట్నం
44. **శ్రీ నరహరిశెట్టి నరశింహారావు**



# జాతీయ తెలుగు రచయితల మహాసభల నిర్వహణకు
# ఆర్థిక సహకారం అందించిన దాతలకు అభివాదములు



శ్రీ సతీష్, సియోల్



శ్రీమతి స్నేహ, హైదరాబాద్



శ్రీ నీలమేఘశ్యాం, బెంగుళూరు



శ్రీ వాకా కిరణ్, అమెరికా



శ్రీ ఉప్పలపాటి లక్ష్మీరాంప్రసాద్ &
శ్రీమతి సత్యసాయి విజయలక్ష్మి, హైదరాబాద్



కీ॥శే॥ శ్రీమతి ముత్య వెంకటసుబ్బలక్ష్మి

## జాతీయ తెలుగు రచయితల మహాసభలకు విరాళాన్ని అందించిన సాహితీ ప్రియులు

**రీగల్ షూ సెంటర్**, గుడివాడ

**అలంకార్ ఫ్యామిలి రెస్టారెంట్**, గుడివాడ

**శ్రీ మునగల వీర నారాయణ రెడ్డి**, గుడివాడ

**శ్రీ సి. రఘోత్తమరావు**, బెంగుళూరు

**శ్రీ మూలా సుబ్రహ్మణ్యం**, బెంగుళూరు

**శ్రీ బి. భాస్కరరావు**, హైదరాబాద్

**శ్రీ జి. కిషోర్ కుమార్**, మచిలీపట్నం

**శ్రీ విహారి**, హైదరాబాదు

**శ్రీ కొండముది శాయికిరణ్ కుమార్**, బొంబాయి

**శ్రీ నూతక్కి ప్రతిభ**, విశాఖపట్నం

**శ్రీ కె. సాయి మోహనరావు**, మచిలీపట్నం

**శ్రీ అక్కిరాజు వాచస్పతి**

**శ్రీ యమ్. రామారావు**, విజయవాడ

**శ్రీ శేగు వెంకటేశ్వర్లు**, గుడివాడ

**శ్రీ చోడవరపు విజయకుమార్**, గుడివాడ

**శ్రీ కఠారి శ్రీనివాసరావు**, గుడివాడ

**శ్రీ కె. జయచంద్రశాస్త్రి**, గుడివాడ

**శ్రీ కృష్ణవేణి టాలెంట్ స్కూలు**, విజయవాడ

**రసమయి**, దుబాయి తెలుగు సాహిత్య సంస్థ

**శ్రీ డి. నాగేష్**, చెన్నై

**శ్రీ భాగవతుల కోదండపాణి**, గుడివాడ

**శ్రీమతి భాగవతుల ఉమామహేశ్వరి**, గుడివాడ

**డా॥ డి. ఆర్. కె. ప్రసాద్**, గుడివాడ

**డా॥ పాలడుగు వెంకట్రావు**, గుడివాడ

**శ్రీ సూర నరశింహారావు**, గుడివాడ

**డా॥ ఎమ్. భవానీశంకర్**, గుడివాడ

**శ్రీమతి నోరి విజయ**, అమెరికా

**శ్రీ కృష్ణ కృష్ణ**, హైదరాబాద్



# కృష్ణాజిల్లా గ్రంథాలయోద్యమం - గ్రంథాలయాలు

దొండపాటి దేవదాసు, మచిలీపట్నం

ఆంధ్రదేశంలో జాతీయోద్యమంతో పాటు గ్రంథాలయోద్యమం కూడా ఆవిర్భవించింది. ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయోద్యమం అనతికాలంలోనే అఖిలభారతస్థాయిలో అగ్రగామిగా నిల్చింది. ప్రముఖస్వాతంత్ర్యసమర యోధుల్ని తయారుచేసింది. రాజకీయ సాంఘిక, సాంస్కృతిక రంగాలకు సంబంధించి అనేక ఉద్యమాలకు తల్లి ఉద్యమంగా విరాజిల్లింది.

గ్రంథాలయపితామహ అయ్యంకి వెంకటరమణయ్య గారు జన్మించింది తూర్పు గోదావరి జిల్లా రామచంద్రపురం తాలుకా కొంకుదురు గ్రామం. ఆయన ఆంధ్రుల రాజకీయ రాజధాని విజయవాడలో స్థిరపడటం ఆంధ్రగ్రంథాలయోద్యమ నాయకుల అభిమానుల అదృష్టం అనాలి.

చైతన్యవంతంగా నడిచిన ఉద్యమాల ముఖ్యకేంద్ర స్థానం (బెజవాడ) కృష్ణాజిల్లా కావడం ఓ చారిత్రక విశేషం.

ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ త్రిమూర్తులుగా చరిత్ర ప్రసిద్ధిగాంచిన వారు శ్రీ అయ్యంకి వెంకట రమణయ్య గారు, గాడిచర్ల హరిసర్వోత్తమరావు గారు,పాతూరి నాగభూషణం గారు తమ జీవితాలను గ్రంథాలయోద్యమానికి, పౌరగ్రంథాలయాల పురోభివృద్ధికి విశేషంగా పాటుపడినవారు. అంచేత వీరిని ఇలా అభివర్ణించడం సమంజసంగా వుంటుంది.

పుట్టుక వీరిది
చావు వీరిది
బ్రతుకంతా గ్రంథాలయోద్యమానిది.

కృష్ణాజిల్లా గ్రంథాలయోద్యమానికి ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమానికి సమర్థుడయిన, చైతన్యవంతుడయిన నాయకాగ్రణి అయ్యంకివారు. 1911 సం॥ బెజవాడ రామమోహన గ్రంథాలయ కార్యదర్శి పదవి చేపట్టి తద్వారా ఆంధ్రదేశంలో గ్రంథాలయోద్యమంలో కాలుమోపారు.

బెజవాడని కార్యస్థానం చేసుకుని ఆయన నడిపిన ఉద్యమాలు వాడవాడలా గ్రంథాలయాలనే జ్ఞానదీపాలను వెలిగించినట్లయ్యింది.

అయ్యంకివారి విశిష్ట నాయకత్వాన్ని అంగీకరించి వారికి తమ పూర్తి సహకార ప్రోత్సాహాలనందించి నడుస్తున్న గ్రంథాలయోద్యమ చరిత్రలో చిరంజీవులుగా మిగిలిపోయినవారు శ్రీ వావిలాల గోపాలకృష్ణగారు, పాతూరు నాగభూషణంగారు, కోదాటి నారాయణరావు గారు, శరణురామస్వామి చౌదరిగారు, శ్రీ కోగంటి మాజేటి రామచంద్రరావు మొదలయినవారు.

"తర్ణః పరాంస్యారుయతి" తాము బాగుపడి తోటివారిని బాగుచేయుట అనే మానవత్వం మహనీయుల స్వభావం మూర్తిభవించి వుండటంవల్లే శ్రీ అయ్యంకి అంతటి మహనీయుడుగా దేశవిదేశాలలో పేరుప్రఖ్యాతుల్ని అపారంగా పొందగలిగారు.

కృష్ణాజిల్లా ముఖ్యపట్టణం మచిలీపట్నంలో కృష్ణాపత్రిక సంపాదకులు ముట్నూరి కృష్ణారావు దర్బారు బొంబాయి కాల్వదగ్గర జరిగే సమావేశాలకు (1908-1910) శ్రీ అయ్యంకి హాజరయ్యేవారు. ఈ సమావేశాలకు డా॥ భోగరాజు పట్టాభి సీతారామయ్య, కోపల్లె హనుమంతరావు, అవుటపల్లి నారాయణరావు మొదలయిన వారు పాల్గొని ఆర్థిక సామాజిక రాజకీయ విషయాల గురించి చర్చించేవారు. ఈ చర్చలలో ఎంతో ఉత్సాహంగా పాల్గొనడంవల్ల శ్రీ అయ్యంకి వారి మేథకు బాగా పదును పెట్టినట్లయింది. సామాజికస్థితిగతుల అవగాహనకు దోహదపడ్డాయి.

ఈ అనుభవ ఫలితంగా అయ్యంకివారు బందరు నుండి 1910 సం॥ గ్రంథాలయ సర్వస్వం నడపటానికి అవకాశం ఏర్పడింది. మహాకవి గురజాడ రచనలు నీలగిరిపాటలు, ముత్యాలసరాలు, లవణరాజు కల-కాసులు, మరికొన్ని కథలు గేయాలు కూడా ఈ పత్రికలో ప్రచురించబడటం గమనార్హం. ఆంధ్రభారతి లేకపోతే గురజాడ వారి రచనలు ప్రచురించే పత్రిక వేరొకటి వుండేదికాదేమోనని రాయప్రోలువారు పేర్కొనడం గమనించదగినది. కృష్ణాజిల్లా గ్రంథాలయోద్యమ చరిత్రలో ఇదోసువర్ణాధ్యాయంగా పేర్కొనవచ్చు.

కృష్ణాజిల్లా గ్రంథాలయోద్యమచరిత్రలో మరో మహోజ్వలఘట్టం యావద్భారత దేశానికి తలమానికమయిన సంఘటన 10-4-1914 సం॥ ప్రప్రథమ ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ మహాసభ బెజవాడ టౌన్ హాల్లో జరగడం.

కృష్ణ, గోదావరి, గుంటూరు, విశాఖ, గంజాం, నెల్లూరు, కడప, కర్నూలు, బళ్ళారి జిల్లాల నుండి పలువురు ప్రతినిధులు, సమధి కోత్సాహంతో తరలివచ్చారు. ఈ మహాసభకు సుప్రసిద్ధ కవి స్వర్గీయ చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు అధ్యక్షతవహించారు. గ్రంథాలయోద్యమ ప్రాముఖ్యాన్ని గూర్చి ఆయన చేసిన ఉపన్యాసం, చిరస్మరణీయమైనది చారిత్రాత్మకమయినది.

శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రి (1874-1951) ప్రముఖ కవి. కృష్ణాజిల్లా ఉయ్యూరు సమీపం కనకవల్లి అగ్రహారంలో జన్మించారు. అయ్యంకివారికి అనుచరులు. గ్రంథాలయ సర్వస్వం సంపాదకవర్గంలో పనిచేశారు.

శ్రీ సూరి వెంకటనరసింహశాస్త్రి (1890-1933) కృష్ణాజిల్లా గ్రంథాలయోద్యమంలో తొలి తరం నాయకులు. బెజవాడలో రామమోహన గ్రంథాలయ స్థాపనకు ప్రముఖ పాత్రవహించిన వ్యక్తి.

శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగారు (1881-1962) కృష్ణాజిల్లా నందిగామలో జన్మించారు. చారిత్రక ప్రసిద్ధిగాంచిన రామ్మోహన్ గ్రంథాలయ స్థాపకులలో ఒకరు.

శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు (1862-1938) కృష్ణాజిల్లా ఎలకుర్రు గ్రామంలో జన్మించారు. ఆంధ్రులలో పఠనాభివృద్ధికి గ్రంథాలయోద్యమానికి పెక్కు గ్రంథాలయాల స్థాపనకు కృషిచేశారు. ఆంధ్రనాట ఎక్కడ గ్రంథాలయం ఏర్పాటుయినా దానికి ఆంధ్రపత్రిక, (డైలీ) భారత (మాస) ఆంధ్రగ్రంథమాల ప్రచురణలు ఉచితంగా పంపిణీ చేసి గ్రంథాలయానికి పాఠకుల్ని అధిక సంఖ్యలో ఆకర్షింటానికి దోహదకారులయ్యారు. ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు, వదాన్యులు. శ్రీ కొమర్రాజు వెంకటలక్ష్మణరావుగారు

(1874-1923) కృష్ణాజిల్లా పెనుగంచిప్రోలు లో జన్మించారు. బహుభాషాకోవిదులు, వీరి రచనలు ప్రచురించిన గ్రంథాలు తొలిగ్రంథాలయ వెలుగుదీపాలయినాయని పేర్కొనవచ్చు.

శ్రీ కొమ్ము సీతారామయ్య (1886-1974) విజయవాడ పడమటలంక వాస్తవ్యులు. విజయవాడలో 1946 సం॥ విలువయిన మూడెకరాల తోట భూమిని దానం చేస్తూ ఆంధ్రదేశంలో గ్రంథాలయ అభివృద్ధినిమిత్తం ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయట్రస్ట్ నెల కొల్పనున్నట్లు ప్రకటించి దానిని 10.4 1946న రిజిష్టరు చేయడం జరిగింది.

శ్రీ కోగంటి దుర్గామల్లిఖార్జునరావు గారు (1904-1976) కృష్ణాజిల్లా గుడ్లవల్లేరు మండలం అంగలూరులో జన్మించారు. వీరు క్రిష్ణాజిల్లాలో పలు గ్రామాలలో పట్టణాలలో గ్రంథాలయాల స్థాపనకు కృషిచేశారు. అయ్యంకివారిచే "గ్రంథాలయోద్యమభూషణ" బిరుదును పొందారు. భారతీ సమితివ్యవస్థాకులు.

శ్రీ కోదూరు శ్రీరాములు (1916) ప్రముఖకవి గ్రంథాల యోద్యమ నాయకులు. ఆంధ్రదేశగ్రంథాలయ సేవకసంఘం ప్రధాన కార్యదర్శిగ పనిచేశారు. ప్రముఖగ్రంథాలయ నాయకులకు కనకాభిషేకాలు చేసి బిరుదు లిచ్చి ఘనసన్మానాలు నిర్వర్తించారు.

శ్రీ పండిత గొట్టిపాటి వెంకట సుబ్బయ్య (1898-1981) కృష్ణాజిల్లా ఘంటసాలలో జన్మించారు. ఆ చుట్టుపక్కల ప్రాంతాలలో గ్రంథాలయాలస్థాపనకు, వాటి పురోభివృద్ధికి కృషిచేశారు. ప్రముఖ రచయిత జీవిత చరిత్రలు రాయడంలో ప్రసిద్ధిగాంచినవారు.

మన రైతుపెద్ద గొట్టిపాటి బ్రహ్మయ్య (1898) కృష్ణాజిల్లా ఘంటసాల గ్రామంలో జన్మించారు. 1914 సం॥ ఆ వూరి రామమోహన గ్రంథాలయ ప్రారంభానికి, అభివృద్ధికి తోడ్పడ్డారు. 1964 సం॥ కృష్ణాజిల్లా గ్రంథాలయ సదస్సు సమర్థంగా నిర్దేశించిన సందర్భాలలో గ్రామస్థాయి నుండి సంచార గ్రంథాలయసేవ అందజేసే పథకరూప కల్పనలో పాల్గొన్నారు.

శ్రీ చిత్రావూరి నాగభూషణాచార్యులు (1913-1982) కృష్ణాజిల్లా కొణకంచిలో జన్మించారు. గాడిచర్ల, అయ్యంకి వంటి ప్రముఖులతో కలిసి పనిచేశారు. "గ్రంథం భిక్షాందేహి" అనేనినాదానికి ఆంధ్రదేశంలో ఆద్యులువీరే !

శ్రీ టేకుమళ్ళ రామచంద్రరావు గారు బందరులో జన్మించారు. అయ్యంకివారి ఉద్యమవ్యాప్తిలో ముఖ్యఅనుచరులుగా వున్నారు. అఖిల భారత స్థాయిలో వీరు గ్రంథాలయాల చరిత్ర వివరించే గ్రంథాలు రాశారు. ప్రముఖసాహిత్య విమర్శకులు.

శ్రీ దుగ్గిరాల గోపాలకృష్ణయ్య (1889-1928) కృష్ణాజిల్లా పెనుగంచిప్రోలులో జన్మించారు. అయ్యంకివారితో మంచి పరిచయం గలవారు. "రామదండు" ద్వారా సంచలనాత్మక కార్యక్రమాలు నిర్వహించారు. (చీరాల పేరాల సంచలనాత్మక ఉద్యమనాయకుడు) ప్రముఖ గ్రంథాలయ కార్యకర్త. 'ఆంధ్రరత్న' బిరుదాంకితులు.

శ్రీ పాతూరి నాగభూషణం గారు ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమ నాయకత్రయంలో ఒకరు. వీరు గ్రంథాలయ సేవలు నిరుపమాన మయినవి. సర్వోత్తమ భవననిర్మాణం వీరి అవిరళకృషికి నిదర్శనం. వీరు ప్రముఖగ్రంథాలయ శాస్త్రరచయిత. కళాప్రపూర్ణులుగా సత్కరించబడ్డారు. ఇటీవల వీరిశతజయంతోత్సవాలు, హైదరాబాద్‌లో వైభవంగా నిర్వహించబడ్డాయి.

ఈ మాడపాటి హనుమంతరావు గారు (1885-1970) కృష్ణాజిల్లా నందిగామ తాలూకా పొక్కునూరు గ్రామంలో జన్మించారు. గ్రంథాలయాలను స్థాపించడం, తాళపత్రగ్రంథాలను సేకరించడం శాసనాల ప్రతులను సంపాదించి పరిశోధనలు చేయించి విజ్ఞాన సంపదను ప్రజలకందించడం మొదలయిన వీరి నిర్మాణాత్మకకృషి మరువలేనిది.

గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు (1883-1960) ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు. దేశంలో వీరు అడుగిడని సేవారంగం లేదు. ప్రముఖ పాత్రికేయులు. ప్రముఖ గ్రంథాలయోద్యమ నాయకునిగా వయోజన విద్యావ్యాప్తికి అవిరళకృషి చేసిన మహనీయులు. రాయల సీమలో జన్మించిన గాడిచర్ల తెలంగాణా, ఆంధ్ర జిల్లాలను కలిపి మొత్తం తెలుగు ప్రాంతాన్నంతా తమ కార్యక్షేత్రంగా చేసుకున్న దేశభక్తుడు. 1907 సం॥ సర్వోత్తమరావుగారు సంపాదకులుగా బోడినారాయణరావు ప్రకాశకులుగా బెజవాడ పట్టణంలో స్వరాజ్య పత్రికని స్థాపించి నిస్వార్థదాయకంగా నడిపించారు.

సుప్రసిద్ధ కవి కాళోజి గాడిచర్లవారిని ఇలా అభివర్ణించారు.

"వయో వృద్ధుడుగా యువకుడు
వాస్తవ జీవితమతనిది
హరిసర్వోత్తముడాతడు
ఆంధ్రుల పాలిట దేవుడు "

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారు (1906) గుంటూరు జిల్లా సత్తెనపల్లిలో జన్మించినా గ్రంథాలయోద్యమ నాయకునిగా ప్రజా నాయకునిగా ప్రజా భాషళ్యంలో పేరు ప్రతిష్టలు గడించారు. ఆయన ఎక్కువుగా అయ్యంకి, పాతూరి వారితో కలిసి పనిచేయడం జరిగింది. 1960 సం॥ ఆంధ్రప్రదేశ్ పౌరగ్రంథాలయ చట్ట నిర్మాణంలో తోడ్పడ్డారు. 1976 సం॥ ఎగ్జొటే కమిటిలో సభ్యులుగా ఉన్నారు. గ్రంథాలయోద్యమానికి, తెలుగు భాషా వికాసానికి, చిరస్మరణీయమైన సేవలందించిన మహనీయుడాయన.

శ్రీ నాగులపల్లి సీతారామయ్య, ప్రముఖవక్త చెరుకువాడ నరసింహం పంతులు, నాయని వెంకటరంగారావుగారు, నాళం కృష్ణారావు, మల్లెల శ్రీరామమూర్తి శ్రీమతి సూర్యదేవర రాజ్య లక్ష్మి, అయ్యంకి తాండవ కృష్ణ, కొండిపర్తి వీర భద్రాచార్యులు, గద్దె రంగయ్య నాయుడు, కొల్లూరి కోటేశ్వరరావు, గోరా, దంటు సుబ్బావధాని, దుగ్గిరాల బలరామకృష్ణయ్య, నిడమర్తి లక్ష్మీ నారాయణ, డా॥ పాటిబండ్ల మాధవరాయశర్మ, డా॥ పుట్టపర్తి శ్రీనివాసరావు మైనేని శ్రీరాములు, గ్రంథాలయాల మంత్రిగా ఉద్యోగులపాలిటి దైవంగా ప్రస్తుతించ బడినవారు డా॥ సిహెచ్. దేవానందరావుగార్లు పేర్కొనదగినవారు.

గ్రంథాలయోద్యమంలో, గ్రంథాలయాల స్థాపలనలో భూరి విరాళాలిచ్చినవారు, స్థలదాతలు మహనీయులు ఎందరో వుండవచ్చు వ్యాస విస్తరణ భీతిలో మర్చిపోయి వుంటే క్షంతవ్యుడను.

1950 గ్రంథాలయ చట్టం అమలులోకి వచ్చింది. ఆ ప్రకారం రాష్ట్రమంతటా లోకల్ లైబ్రరి ఆథారిటీలు ఏర్పడ్డాయి.

బందరువాస్తవ్యులు నీతి నిజాయితీలకు మారుపేరయిన రాజకీయవేత్త డా॥ రాళ్ళపల్లి అచ్యుత రామయ్యగారు కృష్ణాజిల్లా లోకల్

లైబ్రరి అథారిటీకి ఛైర్మన్‌గా ఎంపికయ్యారు. 1952 సం॥ బందరులో జిల్లా కేంద్ర గ్రంథాలయం స్థాపించబడింది. 1954 సం॥ ఛైర్మన్‌గా శ్రీ కె.జి. బాబురావుగారు ఎంపికయ్యారు. జిల్లా వ్యాప్తంగా శాఖాగ్రంథాలయాల స్థాపనకు మంచి కృషిచేశారు.

1957 సం॥ శ్రీగోనుగుంట్ల నాగేశ్వరరావుగారు ఛైర్మన్‌గా ఎన్నికయ్యారు. ఉత్సాహవంతులు కార్యదీక్షాపరులు, వీరి ప్రశంసనీయమైన కృషివల్ల కృష్ణాజిల్లాలో అధికసంఖ్యలో గ్రంథాలయాల స్థాపన జరిగింది. జిల్లా స్థాయి ఉద్యమానికి వీరి పదవి మంచి వన్నె తెచ్చింది.

1962 సం॥ శ్రీ కలపాల సూర్యప్రకాశరావు ఛైర్మన్‌గా ఏకగ్రీవంగా ఎంపికయ్యారు. బాల్యం నుండి వీరికి గ్రంథాలయానికి వెళ్లి పత్రికలు పుస్తకాలు చదివే ఉత్తమ అభిరుచిగలిగిన వారు 1914 సం॥ ముదునూరులో స్థాపించిన హిందూపుస్తక భండాగారాన్ని వీరు ఎంతో అభివృద్ధిగావించారు. గ్రంథాలయాలపట్ల గ్రంథాల యోద్యమం పట్ల వీరికి గల శ్రద్ధాసక్తులు పలువురి ప్రశంసలకు పాత్రమయ్యాయి. 1962 సం॥ కృష్ణాజిల్లా లోకల్ లైబ్రరీ అథారిటి ఛైర్మన్‌గా ఎంపిక కావడానికి దోహదపడింది. నూతన గ్రంథాలయాల వికాసానికి వినూత్న పద్ధతులు ప్రవేశపెట్టడం వీరి ప్రతిభ సామర్థ్యాలకు నిదర్శనం. వీరి కృషివల్ల కృష్ణాజిల్లా లోకల్ లైబ్రరి ఆంధ్రప్రదేశ్‌లో అత్యున్నత స్థాయిలో అభివృద్ధిచెందింది.

గ్రామగ్రామాన గ్రంథాలయాల స్థాపనే వీరి నినాదం కార్యరూపం ధరించి వారి హయాంలోనే 1967 సం॥ ఉన్నత స్థాయిలో ఆదర్శ ప్రాయంగా గ్రంథాలయ సెమినార్ ఏర్పాటు చేయబడింది జెబవాడలో ఇందులో పాల్గొన్న ప్రముఖ గ్రంథాయలోద్యమ నాయకులు సర్వశ్రీ అయ్యంకి వెంకటరమణయ్య, కోదాటి నారాయణరావు, పాతూరి నాగభూషణం, వావిలాల గోపాలకృష్ణయ్య, శరణు రామస్వామి చౌదరి మొదలయిన వారు, అలాగే ప్రముఖ రాజకీయ నాయకులు, గ్రంథాలయ అభిమానులు అయిన కాకాని వెంకటరత్నం, అక్కినేని భాస్కరరావు, రేపాల బుచ్చిరామయ్య శేషయ్య శ్రేష్టి, పేట బాపయ్య లైబ్రరి కమిటి సభ్యులు, ఉద్యమకార్యకర్తలు, గ్రంథాలయ సిబ్బంది నాటి గ్రంథాలయ డిప్యూటి డైరెక్టర్ కె. రాఘవరెడ్డి మొదలయిన వారు చర్చలలో పాల్గొని గ్రంథాలయాల అభివృద్ధికి తీర్మానాలు చేసి అమోదించి ఆచరణలో పెట్టడం ప్రశంసార్హమైన అంశం.

అలనాటి సెమినార్ చర్చలు, తీర్మానాలు వగయిరాంల విషయాలలో ప్రముఖ గ్రంథాలయ కార్యకర్త, రచయిత, లైబ్రరిమ్యాన్ అయిన శ్రీ వెలగా వెంకటప్పయ్య ప్రముఖ పాత్ర వహించారు.

సెమినార్ చర్చల పర్యవసానంగా కృష్ణాజిల్లా లోకల్ లైబ్రరి అథారిటీలో మరో ముందడుగు సంచార గ్రంథాలయాల ఆవిర్భావం అని చెప్పాలి.

గాంధీజీ శతజయంత్యుత్సవాలు కృష్ణాజిల్లాలోని అన్ని గ్రంథాలయాలలో వైభవోపేతంగా నిర్వహించబడ్డాయి. ఈ సందర్భంగా గాంధీ జీవితచిత్ర ప్రదర్శనను 2-10-1968న బందరు జిల్లా కేంద్రగ్రంథాలయంలో అయ్యంకి వెంకటరమణయ్య గారు ప్రారంభించగా సభకు ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు శ్రీ కొడాలి ఆంజనేయులు గారు అధ్యక్షులుగా వ్యవహరించారు.

విజయవాడ పుష్కర ఎగ్జిబిషన్ గ్రౌండ్సులో ఏర్పాటు చేయబడింది. ఈ ప్రదర్శనను ప్రముఖ నాయకులు, మంత్రులు కవులు కళాకారులు, మొదలయిన 30 వేల మంది ప్రజలు ఆనందోత్సాహాలతో తిలకించడం జరిగింది.

ఈ ప్రదర్శనకు ఎంతో శ్రమించి, ఫోటోలు సేకరించి ఆకర్షనీయంగా కళాత్మకంగా రూపొందించి అశేష ఆంధ్రప్రజానీకం మెప్పు పొందడానికి కారణభూతులయిన అలనాటి జిల్లా కేంద్ర గ్రంథాలయ సిబ్బంది, ముఖ్యంగా ఛైర్మన్ శ్రీ కలపాల సూర్యప్రకాశరావు, కార్యదర్శి శ్రీ వేములపల్లి చంద్రశేఖరరావుగారు, రిఫరెన్సు లైబ్రేరియన్ స్వర్గీయ ఎం.ఎస్.గిరి మొదలగు వారు అభినందనార్హులు.

1980 సం॥ శ్రీ కోపూరు వెంకట సుబ్బారావు ఛైర్మన్‌గా ఎన్నికయ్యారు. వీరు మంచి పట్టుదల, ఉత్సాహం, కార్యదీక్ష, మూర్తీభవించినవారు. ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయాల చరిత్రలో ఓ అపూర్వ సంఘటన టాగోర్ మెమోరియల్ లైబ్రరీలో పరిశోధనా విభాగం ఏర్పాటు చేయడం (1983) సుబ్బారావుగారి దీక్షాదక్షతలకు మరో నిదర్శనం టాగూర్ స్మారక గ్రంథాలయ భవన నిర్మాణం.

ఆ తరువాత శ్రీ వల్లభనేని బాబురావు, శ్రీ కొడాలి జగన్మోహనరావులు ఛైర్మన్ పదవులు నిర్వహించారు.

1960 సం॥ పి.పి.ఎల్. యాక్టు ప్రకారం జిల్లా కేంద్ర గ్రంథాలయ అధికారులే కార్యదర్శులుగా నియమించబడ్డారు. అంతకు ముందు డి.ఇ.ఓ.లే సెక్రటరీలుగా వ్యవహరించేవారు. ఈ యాక్టు అమలులోకి రావడంతో డి.ఇ.ఓ.లు గ్రంథాలయశాఖకి కార్యదర్శులుగా వ్యవహరించే సంస్కృతికి తెరపడినట్లయ్యింది. ఈ ప్రకారం అప్పటివరకు జిల్లా కేంద్రగ్రంథాలయాధికారిగా వున్న శ్రీ టి.సుబ్రహ్మణ్యంగారు తొలి కార్యదర్శిగా పదవీబధ్యతలు స్వీకరించారు.

ఆ తరువాత కృ.జి.గ్రం.సం. కార్యదర్శులలో పనిచేసిన చాలా ముఖ్యులు శ్రీ వేములపల్లి చంద్రశేఖరరావు, ఉత్తమ పరిపాలనాదక్షులు. వీరి హయాంలో జిల్లా కేంద్ర గ్రంథాలయం గొప్ప సాహిత్య సాంస్కృతిక కేంద్రంగా విరాజిల్లింది. డా॥ వెలగా వెంకటప్పయ్య, విజయవాడలో ఠాగూర్ పరిశోధనా గ్రంథాలయం రూపొందడంలో వీరి కృషి మరువరానిది. సెమినార్లు నిర్వహించి సిబ్బంది పని తీరు మెరుగుపరిచారు. యువకవుల్ని కవయిత్రుల్ని విరివిగా ప్రోత్సహించారు. ఒక్కమాటలో గ్రంథాలయ సేవానురక్తిలో నిత్యం వెలిగే వెంకటప్పయ్యగా ప్రశస్తి పొందారు.

**1950 సం॥ నుండి కృష్ణాజిల్లా గ్రంథాలయ సంస్థలో పని చేసిన అధ్యక్షులు వివరాలు**

| | | |
|---|---|---|
| 1. | డా॥ ఆర్. అచ్యుతరామయ్య | 16.8.50 నుండి 4.10.53 |
| 2. | కె.జి.బాబూరావు | 20.2.54 నుండి 27.12.56 |
| 3. | జి.నాగేశ్వరరావు | 6.9.57 నుండి 19.6.62 |
| 4. | కె.సూర్యప్రకాశరావు | 20.6.62 నుండి 30.6.70 |
| 5. | కె.వి.సుబ్బారావు | 8.4.71 నుండి 16.4.86 |
| 6. | వల్లభనేని బాబూరావు | 18.7.88 నుండి 6.4.92 |
| 7. | కె.జగన్మోహనరావు | 7.4.92. నుండి 7.9.96 |
| 8. | గొర్రెపాటి గోపీచంద్ | 11.6.98 నుండి 7.9.96 |
| 9. | కె.వి.సుబ్బారావు ప్రస్తుత అధ్యక్షులు | 2.8.2004 |

**1951 నుండి కృష్ణాజిల్లా గ్రంథాలయ సంస్థలో కార్యదర్శులుగా పనిచేసిన వారి వివరాలు**

| | | | | |
|---|---|---|---|---|
| 1. | ఎమ్. నాగేశ్వరరావు | /-4-51 | నుండి | 26.12.53 |
| 2. | ఎన్. కోమలాదేవి అన్నకి | 27.12.53 | నుండి | 2.3.54 |
| 3. | కె.సి. పాత్రుడు | 3.3.54 | నుండి | 3.7.56 |
| 4. | ఎస్.సీతారావమ్మ | 4.7.56 | నుండి | 2.7.58 |
| 5. | కె.ఎన్.ఎల్.నరసింహం | 3.7.58 | నుండి | 14.12.58 |
| 7. | యు.సత్యనారాయణ చౌదరి | 15.12.58 | నుండి | 4.8.60 |
| 8. | సి.గురునాధం | 5.8.1960 | నుండి | 6.1.61 |
| 9. | ఎన్.వీరయ్య చౌదరి | 7.1.61 | నుండి | 31.3.61 |
| 10 | టి.సుబ్రహ్మణ్యం | 1.4.61 | నుండి | 24.5.63 |
| 11. | వి.చంద్రశేఖరరావు | 25.5.63 | నుండి | 5.4.71 |
| 12. | కె.మల్లికార్జునరావు | 6.4.71 | నుండి | 29.6.71 |
| 13. | కె.వి.రమణమూర్తి | 30.6.71 | నుండి | 1.5.75 |
| 14. | కె.మల్లికార్జునరావు | 2.5.75 | నుండి | 30.6.76 |
| 15. | వి.చంద్రశేఖరరావు | 1.7.76 | నుండి | 26.5.82 |
| 16. | వి.వెంకటప్పయ్య | 29.5.82 | నుండి | 16.10.85 |
| 17. | వి.చంద్రశేఖరరావు | 18.10.85 | నుండి | 31.12.91 |
| 18. | శ్రీ ఎం.శ్రీహరిరావు | 1.1.92 | నుండి | 13.3.92 |
| 19. | కె.మల్లికార్జునరావు | 13.3.92 | నుండి | 30.6.94 |
| 20. | కె.రోశయ్య | 31.8.94 | నుండి | 30.8.94 |
| 21. | వి.సత్యనారాయణ | 1.10.94 | నుండి | 31.3.96 |
| 22. | వి.లోకేశ్వరరావు | 9.7.96 | నుండి | 30.6.02 |
| 23. | వై. దుర్గారావు | 25.8.02 | | ప్రస్తుత కార్యదర్శి |

| | | |
|---|---|---|
| **కృష్ణాజిల్లా లో మొత్తం గ్రంథాలయాల సంఖ్య** | - | **109** |
| **గ్రామీణ గ్రంథాలయాలు** | - | **14** |
| **బుక్ డిపాజిట్ సెంటర్సు** | - | **61** |
| **జిల్లాలో ప్రథమ శ్రేణి గ్రంథాలయాలు** | - | **7** |
| **ద్వితీయ** | - | **18** |
| **తృతీయ** | - | **83** |
| **సిబ్బంది మొత్తం** | - | **129** |
| **ఖాళీలు** | - | **122** |

కళాప్రపూర్ణ గ్రంథాలయోద్యమ అగ్రశ్రేణినాయకులు స్వర్గీయ పాతూరి నాగభూషణం గారి కుమార్తె డా॥ రావి శారదగారు, తండ్రికి తగిన తనయ. ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘానికి ప్రధానకార్యదర్శిగా వుండి కార్యక్రమాల్ని విజయవంతంగా నడిపిస్తున్నారు.

"గ్రంథాలయ సర్వస్వం" మాసపత్రికను గ్రంథాలయ విజ్ఞానంతో పాటు అన్ని అభిరుచులు గలవారికి అనుగుణంగా సర్వాంగ సుందరంగా వెలువరిస్తున్నారు. "మారుతన్న కాలంలో - మార్పుకోరుతున్న పౌరగ్రంథాలయాలు" రాష్ట్రస్థాయిలో సదస్సు నిర్వహించారు. ఇలా ఎన్నో ప్రయోజనాత్మకమయిన చైతన్యవంతమయిన గ్రంథాలయ శిక్షణా తరగతుల ప్రిన్సిపాల్‌గా సమర్థంగా పనిచేస్తున్నారు.

ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘాన్ని అన్ని జిల్లాల్లో నెలకొల్పి గ్రంథాలయోద్యమాన్ని, గ్రంథాలయాలు నిర్వహించవలసిన తీరుతెన్నులీ నేటి తరానికి అనువుగా కొంగ్రొత్త పథకాలు, పంథాలతో నడిపించాలని ఆమె ఆశయం, ఆకాంక్ష. ఒక్కమాటలో గ్రంథాలయాల సర్వతోముఖాభివృద్ధికి ఆమె చేస్తున్న కృషి సత్ఫలితాలను సాధిస్తుందని ఆశిద్దాం.

జిల్లాలో పురపాలక సంఘాలు విజయవాడ (కార్పొరేషన్), గుడివాడ, గన్నవరం, నూజివీడు, తిరువూరు, అవనిగడ్డ, బందరు లైబ్రరి సెస్సు సక్రమంగా చెల్లించడంలేదు. 6 కోట్లకు పైగా బకాయిలు పడ్డాయి. ప్రభుత్వ పరంగా కఠినమైన చర్యలు లేవు. ఈ బకాయిల కారణంగా గ్రంథాలయాల అభివృద్ధి కుంటుపడుతోంది. నిధుల లేమి కారణంగా కృష్ణాజిల్లలో తొలిగా ప్రారంభించబడి విజయవంతంగా నడిచిన సంచార గ్రంథాలయాలు మూతపడిపోయాయి. సిబ్బంది కొరత తీవ్రస్థాయిలో వుండటం కారణంగా పాఠకులకు మెరుగయిన ప్రయోజనాల్ని, విలువయిన విజ్ఞానాన్ని అందించలేకపోతున్నాయి.

గ్రంథాలయాల అభివృద్ధికి, సిబ్బంది, కవులు, రచయితలు, కళాకారులు, మేథావులు, విద్యార్థులు, పెద్ద సంఖ్యలో ప్రజలు గ్రంథాలయ పునరుజ్జీవనానికి మహోద్యతంగా ఉద్యమించవలసిన తరుణం ఆసన్నమయింది.

## కవి-కవిత్వం (హైకూలు)

**ఎస్.కె.డి. ప్రసాదరావు**, నూజివీడు

రచయితలు
సమాజ ప్రేమికులు
ఊహాలోకంలో

ఈ ప్రకృతికి
ప్రేయసీ ప్రియులుగా
రచయితలు

ఓ రసమయి
కవి మనసు
వయసెరుగదు

ఓ అనుభూతి
సాహిత్య వికాసమే
రచన మనసు

మనసుపొర
చీలుతున్న విస్ఫోటం
కవితలపు

కవి
రవికన్నా వేగవంతుడే
కా(కొ)లమానం లేదు

ఆవేశ పుట్ట
అనుభూతుల బుట్ట
కవి మనసు

ఉత్తుంగ తరంగం
పరంపర శృంగం
రచనా ప్రభంజనం

# ఇప్పటికైనా....

మల్లెమాల, హైదరాబాద్

ఏ మహనీయ పూరుషుడు-యేబదియెన్మిదిరోజులుంగ దీ
క్షామహిమమ్ముజూపి తన ధిగణ్యచరిత్ర ప్రసిద్ధమౌనటుల్
ఈ మహిరాష్ట్ర సిద్ధికొరకిచ్చెనొప్రాణములట్టి పొట్టిశ్రీ
రాముల లక్ష్య సాధనకు ప్రాజ్ఞులు దీక్షవహించగావలెన్॥

ప్రజలు మాటాడుకొనునట్టి భాషలోనె
సాగుపాలనమికనని సకల జనులు
జయజయధ్వానములతోడ సంబరములు
జరుపుకొనినారు రాష్ట్రావతరణవేళ॥

ధరలోమద్రాసీలుగ
పరిగణనముగన్న తెలుగువారికి తిరమౌ
చిరునామాయేర్పడెనం
చరికెను జనతాస్రవంతి - యుత్సాహమునన్॥

చెల్లాచెదురుగనుండిన
యెల్లరమొకటైతిమంచు యేకోన్ముఖమై
యుల్లములు పల్లవించెను
పల్లెలుపట్నమ్ములాడిపాడె ముదమునన్॥

నాటి ఆశలన్ని - నీటిమూటలుగానె
మిగిలిపోయెనన్న దిగులుతోడ
తెలుగుతల్లి నేడు విలపించుచున్నది
కడుపులోనిబాధగ్రక్కలేక॥

ప్రక్కరాష్ట్రాలు తమతమ భాషలోనె
ప్రజల కోరిక మేరకు పాలనమ్ము
సలుపుకొనుచున్న - తులలేని తెలుగునాట
మసకబారినదీనాడు మాతృభాష॥

తెలుగుజిలుగుమాసి వెలుగును గోల్పోయి
దిక్కులరయుచుండె దీనవోలె!
అదనుజూచి - ఆంగ్లమందరియిండ్లలో
కురులు విరియబోసి కొలువుదీరె॥

కలవారిమాటలందున
కలికమునకు కూడ తెలుగుకన్పించదు,పే
దల పలుకులలో సైతము
తలదూరిచెనాంగ్లభాషదర్పమ్మెనయన్॥

అమ్మా! యనుపిలుపునకే
యమ్మయు సమ్మతము దెలుపదాంధ్రావనిలో
మమ్మీ! యని పిలువుడటం
చమ్మయె పిల్లలను మొట్టి యాజ్ఞాపించున్॥

ఆంగ్లమీ రోజు ప్రతివానికవసరమ్మె!
అంతమాత్రానదానికే అంకితమయి
వేలసంవత్సరాలుగా వినుతిగనిన
తల్లిభాషను మరచుటతగదుమనకు॥

అరిగెను యేబదేడులు మహాంధ్రప్రదేశము వచ్చి, యైన,ని
బ్బరముగ పాలకుల్ తెలుగు భాషను ముట్టియుముట్టనట్లుగా
నరయుచునాంగ్లసంస్కృతిని - అందిన మేరకుపెంచుచుండిరీ
పరమదురాగతమ్మునకు పాడవలెన్ చరమాంక గీతముల్॥

**ఇప్పటికైన** నేతలు మరింతగ శ్రద్ధవహించి, యొప్పులున్
తప్పులు లెక్కజూచుకొని తక్షణమే మన మాతృభాషపై
గప్పిన కారుమేఘముల కట్టడి సేయక మిన్నకున్నచో
ముప్పుఘటిల్లు తెల్గునకు-ముందుతరాలకు హానిచేకురున్॥

## ఈ యేటి మేటి ప్రచురణ

# "తెలుగు పసిడి"

జిల్లా రచయితల సంఘాలకు తనదైన స్ఫూర్తిని ఇస్తూ "కృష్ణాజిల్లా రచయితల సంఘం" అక్టోబర్ 27-28 తేదీల్లో తెలుగు రచయితల జాతీయసదస్సును రెండురోజులపాటు ఘనంగా నిర్వహించింది. ఈ సందర్భంగా విశిష్టమైన "తెలుగుపసిడి" ఉద్గ్రంథాన్ని వెలువరించడం అభినందనీయం. తెలుగు వ్యాస సంకలనాల చరిత్రను తిరగరాస్తూ ఏకంగా వెయ్యి పుటలకు సరిపడా ఆమోదమయిన 112 వ్యాసాలతో "తెలుగు పసిడి" తన పేరును నిజంగా సార్థకం చేసుకుంది.

కృష్ణాజిల్లా రచయితల సంఘానికి జవం, జీవం అనదగ్గ అవనిగడ్డ శాసనసభ్యుడు అలుపెరుగని ప్రజానాయకుడు, సంఘం గౌరవాధ్యక్షుడు మండలి బుద్ధప్రసాద్ పూనికతో ఈ అపూర్వగ్రంథం వెలుగుచూసింది. విక్టరీ ప్రచురణలతో వినుతికెక్కిన ఇమ్మడిశెట్టి అక్కేశ్వరరావు చారిటబుల్ ట్రస్టు సౌజన్యం తోడై ఈ వ్యాససంకలనం తెలుగుప్రచురణలకే అమూల్య ఆభరణంగా భాసిల్లుతోంది. కృష్ణాజిల్లా రచయితల సంఘానికి కృష్ణార్జునులుగా దూసుకుపోయే గుత్తికొండ సుబ్బారావు, డాక్టర్ జి.వి. పూర్ణచందులు సంపాదకత్వం సమర్థంగా నెరిపారు.

తెలుగుకు ప్రాచీనభాష హోదా ఇవ్వాలంటూ వెల్లువెత్తుతున్న న్యాయసమ్మత కోరిక నేపథ్యంతో ఈ "తెలుగుపసిడి" బృహద్గ్రంథం వెలుగు చూడడం ఎంతో ప్రాధాన్యం సంతరించుకుంది. తెలుగుభాషాసంబంధిత వ్యాసాలతో "తెలుగుపసిడి" మొదలవటం సముచితంగా ఉంది. తెలుగుభాష ప్రాచీనతపై పరబ్రహ్మశాస్త్రి వ్యాసంతో సహా ఈ మొదటి విభాగంలో 21 భాషావ్యాసాలుండడం విశేషం. రెండవ వ్యాసం భద్రిరాజు కృష్ణమూర్తి విరచిత "తెలుగుభాష నాడు - నేడు - రేపు". గడచిన యాభైఏళ్ళలో తెలుగుభాష పరిణామాన్ని డా॥ ఆర్వీయస్ సుందరం విశదపరచారు. "నడుస్తున్న" భాషోద్యమాన్ని పాత్రికేయుడు డాక్టర్ సామల రమేశ్‌బాబు సమర్థంగా సమీక్షించారు. ఈనాటి తెలుగుభాష స్థితిగతులను సి. ధర్మారావు వెల్లడించారు.

మొత్తం పద్నాలుగు విభాగాల్లో రెండవది స్వగతం. ఇందులో 5 వ్యాసాలు చోటుచేసుకున్నాయి. డా॥ రావూరి భరద్వాజ, ఆచార్య పేర్వారం జగన్నాథం, జానమద్ది హనుమచ్ఛాస్త్రి, శీలా వీర్రాజు, జానకీరాణిల స్వగతాలు పాఠకులను ఉత్తేజపరుస్తాయి. "ప్రభావం" శీర్షికన తొమ్మిది వ్యాసాలున్నాయి. విశ్వనాథ, శ్రీశ్రీ, జాషువా, సినారె, గాంధీ, దేశరాజకీయాలు, ప్రపంచీకరణల ప్రభావాలను ఆయావ్యాసకర్తలు విపులంగా విశ్లేషించారు.

"ఉద్యమాలు" శీర్షికన 9 వ్యాసాలున్నాయి. జ్వాలాముఖి, నగ్నముని తదితర ప్రముఖుల భావధార జాలువారింది. పరిశోధన శీర్షికన 5 వ్యాసాలున్నాయి. జాతీయస్థాయిలో "తెలుగువెలుగులు" గురించి యార్లగడ్డ లక్ష్మీప్రసాద్ వివరించారు. "పద్యకవిత" శీర్షికన 13 వ్యాసాలున్నాయి. వర్తమానంలో పద్యకృతుల్ని ఆచార్య బేతవోలు రామబ్రహ్మం సమగ్రంగా సమీక్షించారు. గంగప్ప "గేయం"పై వ్యాసం అందించటం విశేషం. అద్దేపల్లి సామరస్య - సంఘర్షణలను చిత్రించారు. రాపాక ఏకాంబరాచార్యులు అవధాన వికాసాన్ని తేటతెల్లం చేశారు. గజల్‌పై రెంటాల విలువయిన వ్యాసం అందించగా, హైకూల్లో తాత్త్వికతను శిరీష ఆవిష్కరించారు.

తెలుగుకథపై పెద్దిభొట్ల రాచపాళెం, కాలువ మల్లయ్య, కాత్యాయని విద్మహే, విహారి, అప్పల్నాయుడుల వ్యాసాలు ఎన్నదగ్గవి. తెలుగు నవలపై డాక్టర్ కడియాల రామ్మోహనరాయ్, అంపశయ్య నవీన్, ముదిగొండ శివప్రసాద్‌లు విలువైన వ్యాసాలందించారు. సాహితీప్రక్రియలు అన్న శీర్షికన వీరాజీ, పిశుపాటి ఉమామహేశ్వరం, వద్దేపల్లి కృష్ణ తదితరుల వ్యాసాలున్నాయి. సంస్కృతి - జనజీవనం శీర్షికన సుజాతారెడ్డి, చొక్కాపు వెంకట్రమణ, ఆచార్య వంగపల్లి విశ్వనాథం, చింతపల్లి వెంకటనారాయణ వ్యాసాలు రాశారు.

"కళారూపాలు" అన్న శీర్షికన రాళ్ళబండి కవితాప్రసాద్ రూపకం ఆరంభవికాసాలను అక్షరీకరించారు. సంగీతరూపకాలపై ఇంద్రగంటి శ్రీకాంతశర్మ విలువయిన వ్యాసం అందించారు. ప్రదర్శన కళారూపాలను ఆచార్య కసిరెడ్డి వెంకటరెడ్డి, బుర్ర కథ - నాజర్ గురించి కత్తి పద్మారావు స్పందించారు. కాటమరాజు గురించి ఆచార్య తంగిరాల వెంకటసుబ్బారావు వ్యాసం రచించగా, తెలుగు నాటకానికి ప్రభుత్వ ప్రోత్సాహాన్ని బోయిన వెంకటేశ్వరరావు వివరించారు.

పత్రికలు - ప్రచురణరంగం - ప్రసారమాధ్యమాలు అన్న అధ్యాయంలో రాఘవాచారి, వెలగా వెంకటప్పయ్య, సుధామల వ్యాసాలున్నాయి. "ఇతరాలు" అన్న కడపటి అధ్యాయంలో డా॥ ద్వానా శాస్త్రి తెలుగు సాహితీ సంస్థల సమాచారం ఇచ్చారు. తెలుగువారి సైన్స్‌సేవను పురాణపండ రంగనాథ్ విశ్లేషించారు. సిలికానాంధ్రపై కూచిభొట్ల ఆనంద్ వ్యాసం అందించారు.

మొత్తం 112 వ్యాసాలలో ఒకటీ అరామినహాయించి అన్నీ విలువయినవే. తెలుగు తెలిసిన ప్రతివాడు పదిలపరుచుకోవాల్సిన పొత్తమిది. రిఫరెన్సుగా ఉపకరించే ఈ సంవత్సరపు మేటి రచన "తెలుగుపసిడి". వ్యయప్రయాసలకోర్చి దీన్ని వెలువరించి కృష్ణాజిల్లా రచయితల సంఘం తన సత్తా చాటుకుంది. మొత్తం పుటలు 1010 + వెల 300/- ప్రతులకు ఇమ్మడిశెట్టి అక్కేశ్వరరావు చారిటబుల్ ట్రస్టు, సింగరాజు వీధి, కొత్తపేట, విజయవాడ - 520 001

- సశ్రీ




కృష్ణాజిల్లా తెలుగు రచయితల ప్రథమ మహాసభలను (8-1-1967, ఆదివారం) ప్రారంభిస్తున్న ప్రముఖ పాత్రికేయులు శ్రీ నార్ల వెంకటేశ్వరరావు గారు



కృష్ణాజిల్లా తెలుగు రచయితల ప్రథమ మహాసభలో నివేదిక సమర్పిస్తున్న ప్రధాన కార్యదర్శి శ్రీ కాలనాథభట్ట వీరభద్రశాస్త్రి



కృష్ణాజిల్లా తెలుగు రచయితల ప్రథమ మహాసభలో కవితా సదస్సులో ప్రసంగిస్తున్న శ్రీ జమదగ్ని శర్మ



కృష్ణాజిల్లా తెలుగు రచయితల ప్రథమ మహాసభలో కథా సదస్సులో ప్రసంగిస్తున్న ప్రముఖ రచయిత శ్రీ పెద్దిభొట్ల సుబ్బరామయ్య



కృష్ణాజిల్లా తెలుగు రచయితల ప్రథమ మహాసభలో ప్రసంగిస్తున్న శ్రీ విదమర్తి ఉమారాజేశ్వరరావు




కృష్ణాజిల్లా తెలుగు రచయితల ప్రథమ మహాసభలో ప్రసంగిస్తున్న శ్రీ జి.ఎస్.ఆర్. మూర్తి

68a




కృష్ణాజిల్లా తెలుగు రచయితల ప్రథమ మహాసభలో ప్రసంగిస్తున్న
శ్రీ సందూరి రామమోహనరావు



కృష్ణాజిల్లా తెలుగు రచయితల ప్రథమ మహాసభలో ప్రసంగిస్తున్న
శ్రీ తుమ్మల వెంకట్రామయ్య




కృష్ణాజిల్లా తెలుగు రచయితల ప్రథమ మహాసభల ఆహ్వాన సంఘకార్యవర్గం

68b



మార్చి 1968లో జరిగిన కృష్ణాజిల్లా తెలుగు రచయితల ద్వితీయ మహాసభలను ప్రారంభిస్తున్న ఆంధ్రప్రదేశ్ సాంస్కృతిక శాఖామాత్యులు శ్రీ కొండా లక్ష్మణబాపూజీ



మార్చి 1968లో జరిగిన కృష్ణాజిల్లా తెలుగు రచయితల ద్వితీయ మహాసభల ప్రత్యేక సంచికను ఆవిష్కరిస్తున్న ఆంధ్రప్రదేశ్ శాసనసభ సభ్యులు డా॥ టి.వి. చలపతిరావు



1970లో జరిగిన కృష్ణాజిల్లా తెలుగు రచయితల తృతీయ మహాసభలలో ప్రసంగిస్తున్న ప్రముఖ కవి శ్రీ ఆరుద్ర

68C




కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గార్కి విజయవాడలో జరిగిన "సువర్ణపుష్ప సమారోహణం" దృశ్యం. వేదికపై డా॥ టి.వి.యస్. చలపతిరావు, శ్రీ భాట్టం శ్రీరామమూర్తి, శ్రీ మండలి వెంకట కృష్ణారావు, డా॥ బెజవాడ గోపాలరెడ్డి, ఉషశ్రీ ప్రభృతులు. ప్రసంగిస్తున్న విశ్వనాథ



కృష్ణాజిల్లా రచయితల 5వ మహాసభ
ప్రారంభసభ 1982 జూలై 10-11 తేదీలు
ప్రారంభిస్తున్న
కీ॥ శే॥ మండలి వెంకటకృష్ణారావు
కీ॥ శే॥ దాశరధి, కీ॥శే॥ సంజీవదేవ్,
రోజర్‌కేన్ (కెనడా)
కీ॥ శే॥ ముక్కామల నాగభూషణం



కృష్ణాజిల్లా రచయితల 5వ మహాసభ
1982 జూలై 10-11 తేదీలలో
అవనిగడ్డలో జరిగిన సందర్భంగా
నృత్యప్రదర్శన ఇచ్చిన కుమారి పతివాడ రాధిక.
వేదికపై శ్రీ కొట సుందరరామ శర్మ,
కీ॥శే॥ ఎం. ఆర్. అప్పారావు, కీ॥ శే॥ మండలి
వెంకట కృష్ణరావు, శ్రీ పతివాడ సూర్యనారాయణ,
శ్రీ గుత్తికొండ సుబ్బారావు




డా॥ జి. వి. పూర్ణచంద్ "కాంతిస్వప్న" కావ్య ఆవిష్కరణ సభలో
శ్రీ పరుచూరి రాజారాం, శ్రీ నండూరి రామ్మోహనరావు,
శ్రీ ఇంద్రగంటి శ్రీకాంతశర్మ, శ్రీ గుత్తికొండ సుబ్బారావు,
(1998, విజయవాడ)



"తెలుగు నవల - నాడు, నేడు, రేపు" సదస్సులో
కీ॥ శే॥ ఏటుకూరి బలరామ మూర్తి,
కీ॥శే ముక్కామల నాగభూషణం, శ్రీమతి వాసిరెడ్డి సీతాదేవి,
(1992, విజయవాడ)




"తెలుగు నవల - నాడు, నేడు, రేపు" సదస్సులో ప్రసంగిస్తున్న
కీ॥ శే॥ విశ్వనాథ పావనశాస్త్రి, వేదికపై శ్రీ పాండురంగ,
శ్రీ కొమ్మూరి వేణుగోపాలరావు, శ్రీ కాటూరి రవీంద్ర,
(1992, విజయవాడ)



జర్నలిజం అవగాహనా సదస్సులో ప్రసంగిస్తున్న శ్రీ గుత్తికొండ సుబ్బారావు,
వేదికపై శ్రీ మండలి బుద్ధప్రసాద్, శ్రీ కాలువ మల్లయ్య,
శ్రీ ఎ.బి.కె. ప్రసాద్, శ్రీ గోవిందరాజుల చక్రధర్,
డా॥ దుగ్గరాజు శ్రీనివాసరావు, లయన్ జి. రామబ్రహ్మం
(2005, మచిలీపట్నం)



మార్చి 1968లో జరిగిన కృష్ణాజిల్లా తెలుగు రచయితల ద్వితీయ మహాసభలకు ఆహూతులైన సదస్యులు




“ప్రస్తుత సంక్షోభిత పరిస్థితులలో రచయితల విస్తృత పాత్ర” సదస్సులో వేదిక పై కీ॥శే॥ పైడిపాటి సుబ్బరామశాస్త్రి శ్రీ ఆవంత్స సోమసుందర్, కీ॥శే॥ మైత్రేయ (1990, విజయవాడ)




“ప్రస్తుత సంక్షుభిత పరిస్థితులలో రచయితల విస్తృత పాత్ర” పై సదస్సులో వేదికపై డా॥ కేతు విశ్వనాథరెడ్డి, కీ॥శే॥ ఏటుకూరి బలరామమూర్తి, డా॥ ఎస్.వి. సత్యన్నారాయణ, శ్రీమతి పి. సత్యవతి ప్రసంగిస్తున్న శ్రీ తెలకపల్లి రవి. (1990, విజయవాడ)



కిరణ్ “వేసవి” కవితా సంపుటి ఆవిష్కరణసభ, వేదికపై శ్రీ ఎ.వి.ఎస్. రెడ్డి, శ్రీ రాఘవాచారి, శ్రీ కె. రామమోహన్‌రాయ్, (1980, మచిలీపట్నం)



కృష్ణాజిల్లా న్యూ మాన్యువల్ కమిటీ ప్రచురించిన “విజయవాడ డివిజన్” గ్రంథావిష్కరణ సభలో శ్రీ కె. ప్రభాకరరావు, IAS కృష్ణా కలెక్టర్, శ్రీమతి ఉషారాణి, మున్సిపల్ కమీషనర్, శ్రీ గుత్తికొండ సుబ్బారావు, శ్రీ శీరం రామారావు, శ్రీ లంక వెంకట రమణ, డా॥ జి.వి. పూర్ణచంద్, (2005, విజయవాడ)



శ్రీమతి ఇంద్రగంటి జానకిబాల కథా సంపుటి ఆవిష్కరణ సభలో వేదికపై కీ॥శే॥ మధురాంతకం రాజారామ్, కీ॥ శే॥ ఉషశ్రీ (1980, విజయవాడ)



“తెలుగు నవల – నాడు, నేడు, రేపు” సదస్సులో శ్రీ అంపశయ్య నవీన్, కీ॥ శే॥ కాయితాల రాజేశ్వరరావు, కీ॥ శే॥ వాకాటి పాండురంగారావు, డా॥ వెలగా వెంకటప్పయ్య (1992, విజయవాడ)



శ్రీ వంగూరుచిట్టెన్ రాజు రచన "అమెరికామెడీ" కథలు
గ్రంథావిష్కరణ సభ (2006, విజయవాడ)
వేదికపై శ్రీ పన్నాల సుబ్రహ్మణ్యభట్టు డా॥ జంధ్యాల శంకర్,
శ్రీకిరణ్ ప్రభ (సిలికానాంధ్ర), శ్రీ గుత్తికొండ సుబ్బారావు ప్రభృతులు,



డా॥ పోతుకూచి వెంకటేశ్వర్లు "డాక్టరు సలహాలు"
గ్రంథావిష్కరణ చేస్తున్న శ్రీ గుత్తికొండ సుబ్బారావు,
ముఖ్యఅతిధి శ్రీ వీరాజీ (1981, విజయవాడ)




"ప్రస్తుత సంక్షుభిత పరిస్థితులలో రచయితలపాత్ర" పై
రాష్ట్రస్థాయి విస్తృత సదస్సులో శ్రీ పెద్దిభొట్ల సుబ్బరామయ్య,
శ్రీమతి ఇంద్రగంటి జానకిబాల,
డా॥ జి.వి. సుబ్రహ్మణ్యం, శ్రీ శశికాంత్ శాతకర్ణి
(1990, విజయవాడ)



శ్రీ తాతారమేశ్‌బాబు రచన "పిడికిలి" దీర్ఘకవిత
గ్రంథావిష్కరణ సభలో ప్రసంగిస్తున్న
కీర్తిశేషులు టి.ఎల్ కాంతారావు, టి. వాణీ రంగారావు
(1986, మచిలీపట్నం)




"తెలుగు సాహితీ సంస్థల ప్రతినిధుల మహాసభలు"
వేదికపై శ్రీ మహీధర, శ్రీ వీరాజీ,
శ్రీ వంశీరామరాజు, శ్రీ తుమ్మల వెంకట్రామయ్య,
శ్రీదోకల నారాయణరావు (1981. విజయవాడ)



శ్రీ కాంచనపల్లి రాంప్రసాద్ కవిత బంభరాలు ఆవిష్కరిస్తున్న
డా॥ సి. నారాయణ రెడ్డి,
వేదికపై కీర్తిశేషులు మండలి వెంకట కృష్ణారావు,
తెన్నేటి హేమలత (1981, విజయవాడ)




డా॥ జి.వి. పూర్ణచంద్ చారిత్రక నవల "సప్తసింధు"
గ్రంథావిష్కరణ సభలో డా॥ రాజారామ్మోహనరావు,
శ్రీ విహారి, కీ॥శే॥ ముక్కామల నాగభూషణం
(1991, విజయవాడ)




తెలుగు నవల "నాడు - నేడు - రేపు" సదస్సులో
ప్రసంగిస్తున్న కీ॥శే॥ పురాణం సుబ్రహ్మణ్యశర్మ
వేదికపై శ్రీ పెద్దిభొట్ల సుబ్బరామయ్య,
శ్రీ పి. చంద్రశేఖర అజాద్, (1992, విజయవాడ)



శ్రీ జోస్యుల సూర్యనారాయణమూర్తి రచన 'కవితా భారతి"
గ్రంథావిష్కరణ సభలో ఉపన్యసిస్తున్న కీ॥శే॥ మైత్రేయ
(1992, విజయవాడ)



"తెలుగు నవల నాడు, నేడు, రేపు" సదస్సులో ప్రసంగిస్తున్న
కీ॥శే॥ నాని, వేదికపై శ్రీ పి. పాండురంగ,
శ్రీ కాటూరి రవీంద్ర త్రివిక్రమ్, కీ॥ శే॥ డా॥ కొమ్మూరి
వేణుగోపాలరావు (1992, విజయవాడ)



"ప్రస్తుత సంక్షుభిత పరిస్థితులలో రచయితల విస్తృత పాత్ర" పై
రాష్ట్రస్థాయి సదస్సులో శ్రీమతి రెజినా, కీ॥ శే॥ టి. వాణి రంగారావు,
కీ॥ శే॥ శ్రీమతి లత, శ్రీమతి మల్లాది సుబ్బమ్మ,
శ్రీమతి హేమలతా లవణం, శ్రీమతి కొండపల్లి కోటేశ్వరమ్మ
(1990, విజయవాడ)




"ప్రస్తుత సంక్షోభిత పరిస్థితులలో రచయితల విస్తృత పాత్ర"
రాష్ట్రస్థాయి సదస్సులో డా॥ రావూరి భరద్వాజ,
డా॥ నాయని కృష్ణకుమారి, శ్రీ తుమ్మల వేణుగోపాలరావు,
శ్రీ మండలి బుద్ధప్రసాద్, కీ॥ శే॥ ముక్కామల నాగభూషణం
(1990, విజయవాడ)



# శ్రీపద చిత్ర రామాయణము - సుందరకాండము

## పద్యకావ్యము - గ్రంథకర్త



మా గురుతుల్యులు

శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణ మూర్తి గారికి

Shriram Life INSURANCE

హార్ధిక శుభాకాంక్షలతో..

**యండి. రఫీ** **వి.దొరరాజు** **యం. శ్రీనివాస రెడ్డి**

పి. సతీష్
కె. సత్యనారాయణ
యం. సురేష్ కుమార్
వై. రవీంద్ర
పి. నరేంద్ర
యన్.వి. క్రిష్ణా రెడ్డి

యండి. షరీఫ్
జె.సి.రమేష్ రెడ్డి
కె. ఆంజనేయులు
సిహెచ్.వి. రవి శంకర్
వి. శ్రీవాణి

వి. సురేష్
మురళీ జగన్నాద్
కె. చంద్రమౌళి
టి. శివకుమారి
మొ. అంజాద్ అలీ
ఎస్. శ్రీకాంత్

జి.సి. ప్రసాద్ నాయుడు
యన్. గిరిధర్
టి. కిషన్ సింగ్
ఎల్. అశ్విన్ కుమార్
పి. కల్పన
కె. శ్రీరామమూర్తి
కె.వి. సత్యనారాయణ

పి. పీటర్
బి.ఆర్. దుర్గకుమార్
బి. సుబ్రమణ్యం



68J

68k

తెలుగు వెలుగులు దశదిశలా

వెన్నెలలై విరబూయాలని....



శ్రీ వెంకటేశ్వరా పౌల్ట్రీఫారమ్

శ్రీ రామకృష్ణా పౌల్ట్రీఫారమ్

మూల్పూరి పౌల్ట్రీస్

శ్రీ విజయలక్ష్మీ పౌల్ట్రీఫారమ్

రామానగరం - నూజివీడు



682

# 39.59 లక్షలు



దేశంలోని మొత్తం 301 మ్యాగజైన్స్‌లో
తెలుగుకి మురిపాల మూడో స్థానం
ఆ మూడో స్థానం స్వాతి సపరివార పత్రికది
నేషనల్ రీడర్‌షిప్ స్టడీస్ కౌన్సిల్ **NRSC** నిర్వహించిన
తాజా అధ్యయన నివేదక అందించిన కీర్తి కిరీటమిది

39.59 లక్షల పాఠకుల సహృదయాలలో చోటుచేసుకుని
పట్టణ, గ్రామీణ ప్రాంతాలు రెండింటిలో అగ్రగామిగా
అలరారుతోంది స్వాతి సపరివార పత్రిక
ఇది అపూర్వ విజయం అద్భుతమైన అందలం అనితర సాధ్యం

ప్రపంచంలో ప్రతిదేశంలో తెలుగువారున్నారు
దేశంలో ప్రతిరాష్ట్రంలోనూ తెలుగువారున్నారు
ప్రతి తెలుగువారి హస్తభూషణం స్వాతి
అందుకే పాఠకదేవుళ్ళ ఏకైక పత్రిక స్వాతి

రెండు దశాబ్దాల అకుంఠిత దీక్షకూ
నిరంతర తపస్సుకు దక్కిన నీరాజనం
ఈ కీర్తి ఈ ఘనత ఈ సంబరం మీది మాది మనందరిది
ఇంతటి విజయానికి కారణం అయిన తెలుగుభాషకు వందనం
తెలుగువారికి వందనం స్వాతి పాఠకదేవుళ్ళకు వందనం

THE LARGEST CIRCULATED TELUGU WEEKLY



సపరివార పత్రిక స్వాతి